గృహలక్ష్మి.

## సువర్ణలేఖ

"నేను చేటలోబడినదిమొదలు ఆశ్రయమిచ్చిన ఈయింటిని, రక్తములో రక్తమగు మిమ్ములను విడనాడిపోవుటలో నాహృదయము ఛిన్నాభిన్నమగుచున్నది. ఈలేఖయందలి విషయములు మీకు మెఱుపుదెబ్బలగుననుసంగతి నాకు సువిదితము. అయినను ప్రేమదేవతా భక్తులపథమునుపట్టిపోవుటకే నేను సునిశ్చితురాలనైతిని. నాకన్నిటితో తమపాదములు కడిగినను నాపునర్వివాహమునకు మీరంగీకరింపరని నాకు తెలియును. నే నిపుడొనర్చిన కృత్యమువలని ఫలమునుగూర్చి చింతించుటలో నే నంతులేనివేదనను బొందినను ఈకృత్యము న్యాయమైనదని నాతలంపు. మనకులమువారు దీనికిగాను నన్ను, నన్ను బట్టిమిమ్ము నిందింతు రనుట నిస్సందేహము. దానిని నివారింపజాలము. నాకు పండ్రెండేండ్లబాలప్రాయమున మీరు పర్చి నన్నొకబాలునిచేతులలోపెట్టినపుడు మీరది నిజముగ నాపాణిగ్రహణమహోత్సవమనియే మోసపోయితిరా? వివాహమైన మూడుమాసములకే ఆబాలుడు పరలోకగతు డయ్యెను. ఈ మూడుమాసములును నే నాతనిభార్యగ భావింపబడితిని. అప్పటినుండి నేను వితంతువును. హితులును, బంధువులును నావైధవ్యమునకు చాలగ విచారించిరి. కాని నాయౌవనమును మాత్రము విస్మరించిరి. లోకముతోబాటు నాహృదయమును లోకసుఖముల నాకాంక్షించుననువిషయము మాత్రము వారికితట్టలేదు. అన్నియుఉడిగినముదుకనని వారు భావించిరి. నాముంజేతికి ఒకకానీగాజులు ధరించుటకుగాని,నాజుట్టులో రెండుపువ్వులు పెట్టుకొనుటకుగాని నాకధికారములేదు. ధరించుచో ఇతరులదృష్టినుండి వానినికప్పిపుచ్చవలెను. లోకమునందలి స్త్రీలతోబాటు నేనును గాజులు ధరింప కాంక్షింపరాదా? పువ్వులు పెట్టుకొన మోజుపడరాదా? భగవానుడు మనకు సౌందర్యపిపాసఇచ్చినపుడు ఆపిపాస తీర్చుకొనుటకు దేహమలంకరించుకొనుట యొకతప్పా? పండ్రెండువత్సరముల బాలిక ఆశలనన్నిటిని దిగద్రావి యోగిని యెట్లుకాగలదు? నాకిప్పుడు ఇరువదియొక్కటవవత్సరము. ఈ

తొమ్మిదివత్సరములుగ నాకుగలిగిన ఆశామహితరాగములను నాహృదయమునందే అణచి వేయబడినవి. వాటిని నోటివెంట వెల్లడించుటకుగూడ నాకు హక్కులేదు. నాకు పండ్రెండవ వత్సరములప్పుడు నాఅగ్రసోదరునకు ముప్పదివత్సరములవయస్సు. ఆతడు భార్యతో పది సంవత్సరములు సంసారసుఖము లనుభవించెను. నేను నాభర్తతో పట్టుమని పదిరోజులపాటైన సంసారసుఖ మనుభవింపలేదు. నేను వితంతువునైన కాలముననే ఆతడు విధురుడగుటయు తటస్థించెను. ఆతనిని తిరిగి వివాహముచేసికొనవలసినదిగా మీరు చాలబలవంతముచేసితిరి. ఆతడు తిరిగి వివాహముచేసికొనెను. కాని నాసంగతిని ఎవరును విచారింపనేలేదు. ఇందు కొఱకుగాను నేను ఎవరినిగాని నిందించుటలేదు. భారతస్త్రీల కర్మము! భార్యను గోలుపోయినపురుషుడు తిరిగి పెండ్లియాడుటకు ఆఆచారమే అనుమతించుచున్నది. భర్తను గోల్పోయిన స్త్రీ తిరిగిపెండ్లి చేసికొనుటకు ఆఆచారమే అనుమతింపదు. అర్థములేని ఆచారము. వితంతువు లోకవృత్తమును విడనాడవలయును, యావనాశల నన్నిటిని తెగగోయవలయును, ఆమెయోగినికావలయును. విధవరాలు ఏపురుషుని కన్నెత్తిచూడరాదు. ఆమె పెదవులపై మందహాసరేఖ పొడచూపినచో ఆమె హృదయము కామదూషితమైయుండవలసినదే! ఇదియేమి సంఘము? ఇదియేమినీతి? ఇట్టి కఠినసంఘముయొక్క శృంఖలములను, ఇట్టి దుర్నీతియొక్క కట్టుబాట్లను తెంపి పునర్వివాహము గావించుకొని సుఖమార్గము నవలంబించుటలో పాపమేమి? ఎట్టి పాపమును లేదని నానమ్మకము. రహస్యముగ దుష్ప్రవర్తనమున వర్తిల్లుటకంటె బహిరంగముగ పునర్వివాహము గావించుకొనుటయే మేలు. కట్టెను బంధింపవచ్చును కాని హృదయమును పట్టలేము. తలిదండ్రులారా! నన్ను మఱచిపొండు. పూర్వమువలె నేను ఇప్పుడును మీతనయనే. ఇప్పుడుగూడ మీరు నన్ను తనయగనే భావించుటకు వ్యతిరేకింపనిచో మీపాదపంకేరుహములను అర్చించుటకు నేను సంసిద్ధను. —యశు".

చిత్తగించితిరా ఈఉత్తరమును? యశోవతియను ఒకబ్రాహ్మణబాలికకు పండ్రెండు వత్సరముల బాల్యప్రాయమున వివాహము గావింపబడెను. అత్తవారియింట మూడు మాసములు కాపురముచేసిన అనంతరము ఆమె వితంతువయ్యెను. పుట్టినింటికివచ్చెను. అచ్చట తలిదండ్రుల యనుమతివడసి ఆమె పాఠశాలలోజేరెను. పాఠశాలలో యువకుడగు నొకగ్రాడ్యుయేటుఉపాధ్యాయునితో పరిచయమేర్పడెను. పరిచయము ప్రణయమై వివాహమునకు ప్రోత్సహించెను. బరోడాలో వివాహముగావించుకొనుటకు ఇల్లువిడనాడి పోవుచు యశోవతి తలిదండ్రులకు ఈసువర్ణలేఖవ్రాసెను. యశోవతి ధైర్యవతియగుటను తెగించి ఈసముచితకార్యమొనర్చినది. ఈఉత్తరమున ఈమె పెట్టినఘోషకు హిమగిరిగహ్వరములు మారుమ్రోగుచున్నవి. వరశుల్కమునకు బలియగుచు స్నేహలతాదేవి వ్రాసిన

లేఖవలె ఈలేఖయు భారతసంఘసంస్కరణమునకు ఉద్దీపనకారికాగలదు. విద్యాసాగరుడు, వీరేశలింగముపంతులు, గంగారాముమొదలగువారి విపులప్రయత్నములకంటె ఇట్టిలేఖలు జనులను వితంతూద్వాహములకు సుముఖులనుగా జేయుటకును, వారిహృదయములను కరగించుటకును సమర్థములై యుండును. సంఘమునకు ఎదురుతిరుగలేక దుర్భరదుఃఖజీవితమున క్రుంగుచువచ్చుచున్న వితంతువులను పునర్వివాహమునకు ప్రేరేచుటకును ఇట్టిలేఖలు సమర్థములు. తన్ను తా నుద్ధరించుకొనుటతోబాటు లోకమునకుగూడ ఇట్టిరీతిని ఉపకరింపగలిగిన యశోవతియెడ సంఘసంస్కర్తలు కృతజ్ఞత చూపవలసియున్నది. ఈసువర్ణలేఖ సంఘసంస్కర్తల పారాయణగ్రంథము కాగలదు.

## మార్గశీర్షము

హరి రాధాకృష్ణమూర్తిగారు

౧

పరితోవ్యాప్తవిశాలశాలిమయసంపత్క్షేత్రసంభావిత
స్ఫురదభ్రంకష హేమవీచికల సభ్యర్థితానముంగూర్చి శ్రీ
శరదభ్యర్చితలోకవాహినిని శశ్వత్సౌఖ్యసంధాత్రిగా
బరివేషించె దిదెట్టి మక్కువయొ మాప్రాంతాలపై మార్గమా!

౨

నతమై ఆనతమై చరింపభువి సన్మానింతు సర్వంబు ను
ద్ధతప్రత్యక్షఫలంబునన్ జనులయంతర్దేహముల్ పొంగగా
స్తుతమై ప్రస్తుతమైఅలర్చుకద నీశోభాసముద్భాతసాం
ద్రతరానంతసుధాప్రసారణము పాంథశ్రేణులన్ మాసమా!

౩

ఏకప్రాభవవర్తనంబున సుఖస్వైకప్రథానోత్సవ
శ్రీకల్యాణముగాంత్రుగాక సఖులౌనీమంతినుల్ నీవు ము
ల్లోకోద్ధారు త్రిమూర్తిరూపు ఘను ముల్లోకేశు దత్తాహ్వయున్
లోకారాధనకౌచు కాంచితివి నీనోమేమొ సన్మాసమా!

౪

సుఖసమారాధితోర్వీవిశుద్ధజనుల
శుభసమృద్ధులఁజేసి కాచుదువు సుఖవి
వర్జితులఁ బలుబాములఁబరతువీవు
సుఖదమవో! కష్టదమవో! సంస్తుతినొనర్ప.

# కోటిలింగాలు

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

"పత్రికకు పంపేవి ముందుగా పంపాలంటారుగదా దీపావళిమరి మొన్ననేగాజరిగింది. అప్పుడే మరి ఆరోజున జరిగిన సంగతులెలాపంపిందండీ! చిత్రంగావుంది గాని."

"సరిగ్గా యీరోజు దీపావళికిజరిగిందేనా యేమిటి పంపాలిసింది? నిరుడు జరిగిందై ఉండకూడదూ ఆసంగతి?"

"అయితే గాంధీగారూ మాలాట్లూఅని యేమో రాశిందిగదూ. అది నిరుడుజరిగిందేమిటి?. పాపం! ఏదో కప్పెడదామనుకున్నారుగాని. అంతకోసమే అసలుపత్రికల్లో రాసేవన్నీ అబద్ధాలే."

"ఊరుకుందూ. నీకబుర్లకేంలే, చదువురానివాళ్ల కల్లానే ఉంటుంది."

"మణిబంగారం తొక్కకూడదంటారుగదా! ఆవిడకాళ్లకు పట్టీలే బంగారపువి పెట్టుకుందేం అంతచదువుకునికూడాను."

"చదువుకున్నవాళ్లు పెట్టుకోవచ్చు. అందుకోసమే మొన్నశాస్త్రులుగారికాలికి బంగారపు కడియం తొడిగారు మహాపండితులంతాగలిసి."

"అయితే పాపమేఉండదన్నమాట అలా బంగారంతొక్కినందుకు శాస్త్రుల్లుగార్లయితేనూ, చదువుకుంటేనూ."

"ఆహా! నిజమే. సావిత్రిపాతివ్రత్యం యముణ్ణి హతమార్చినట్లుగా ఈచదువుకూడా పాపాన్నినాశనం చేస్తుంది. నీకేంతెలుసు చదువుకోనిదానివి. అందుకోసమే నాలాటిమొగుళ్లుండాలి అన్నీచెప్పేందుకు."

"సరే మొగుళ్లకేంగానీండి మీస్కూల్లో పెద్దమ్మగారువస్తే మీరు లేస్తారుగదా! అచ్చుయింట్లో మొగుళ్లువస్తే పెళ్లాలులేచినట్లు అనిమీకుజ్ఞాపకం వస్తుందటండీ. అయినా కాస్త తేమపాను వేసంటింట్లోంచి వస్తాను మీస్కూలావిడేఅనుకోండి ఒక్కమాటు లేద్దురూ. నేఎవళ్లతోటీ చెప్పను.నవ్వనుకూడానవ్వను. ఒట్టు."

"నోరుమూద్దూ. ఆవిడవస్తే తతిమ్మా మొగమేష్టర్లు లేస్తారుగాని నేలేస్తేగదా అసలు."

"అబ్బో గొప్ప. ఎవరికోసంలేస్తావు. నేనప్పసార్లుచూశాను. మీతో రానీకపోతేమాత్రం అంత మూర్ఖుల్లోకి రాలేననుకున్నారా ఆపాటి."

"వాళ్లప్రభావతితో చెప్తానుఉండు ఈసారినిన్ను తీసుకురావద్దని. ఇదో ఆటగావుంది. మహా నీవు ఊపుకుంటూ రావడమూను, వాళ్లంతా నవ్వుతూ నన్నుచూస్తూండడమూను. అసలు ఈమాటు నువ్వువస్తే నీతోమాట్లాడను. వేళాకోళం అనుకున్నావుగాబోలు."

"అబ్బో యిదంతాకోపమేనటండీ. పాపంమాట్లాడరు? పోనీగానీండి మాటవరసకు అడుగుతున్నాను. మొన్నఅక్కడ పెళ్లికల్లాంగదా. అన్నేళ్లు వచ్చాక ఆవిడకుపెళ్లేమిటండీ. మరీవిచిత్రంగాకపోతే. మీస్కూళ్లూ మీతరహాలూ సినిమాలావుందినాకు. అయినా ఇప్పుడుపెళ్లేమిటి. ఏంచేస్తుంది కాపరం. పోనీ ఆవిడకు పిల్లలున్నారటండి యీవరకు."

"ఛీ ఊరుకో. ఆవిడవింటే జైల్లోకూడా పెట్టిస్తుంది. ఇప్పుడుపెళ్లి అంటె ఇదివరకే పిల్లలుంటారా? మీవాళ్లకెవరికేనా అలావున్నారా పిల్లలు?"

"సరి మావాళ్లు ఇల్లా పెళ్లిచేసుకుంటే ఉండేఉందురేమో పిల్లలు."

"నీవు పల్లెటూరిదానివిగనక నీకుతెలీదుపాపం. అసలు పెళ్లంటే ఏమిటోనీకు అర్థంకాలేదన్నమాట. ఆడదానికీ మొగాడికీ జ్ఞానంవచ్చాక అంటే పెద్దపరీక్షలిచ్చాక పెళ్లిగావడంలో అందం ఉంది. ఇద్దరూ ముందు చూసుకుంటారు. ఒకరిమంచి చెడ్డ లొకరికి తెలుస్తుంది. అప్పుడు ఇద్దరికీ యిష్టంగలుగుతుంది. వెంటనే ఆ ట్టెడబ్బుఖర్చులేకుండా నలుగురు స్నేహితులకీ యింతకాఫీయిస్తారు. పెళ్లయిందంటారు. మర్నాడు పేపర్లో ఇద్దరిపేర్లూ అచ్చుపడతవి-చూడు ఎంతబావుందో. మరి నీకూ నాకూ పెళ్లి

యిలాఅయిందా? ముందుమనిద్దరం ఎరగము. నేను కోటీవాళ్లో నీవుగుడ్డిదానివో కూడా తెలీదుగదా. ఇష్టం అసలేలేదు. నీవంటే యిప్పటికీ నాకిష్టంలేదు. ఏదో మాఅమ్మావాళ్లూ కోప్పడతారనే భయంతప్ప. మనపేర్లు చస్తే పేపర్లోపడవు. ఎందుకిల్లాంటిపెళ్లి. ఎత్తే పట్టిడబ్బుదండుగ."

"అయితే జ్ఞానంఅంటె పెద్దపరీక్షలియ్యడమనీ, తమగర్భాల శుభంకోరే తల్లిదండ్రులుచూచి చేసేకంటే తామేచూసుకోవాలనీ, పేపర్లో పేర్లుపడడమే మంగళసూత్రం మెళ్లోపడడమనీ మీచదువులన్నమాట. ఏమో నీ చదువులోనిదాన్ని నాకేంతెలుస్తుంది గనక. అయితే మీకు కవిత్వమూ, సంస్కృతమూ వచ్చుగదా యివన్ని పెట్టి మంత్రాలు రాయరాదూ డబ్బేనావస్తుందేమో కాస్త. ఎల్లాగూవాళ్లిచ్చే జీతం చాలడంలేదుగా మనకు."

"చిత్తం, కానీండి, తమరు కొంచెంసలహాలు కట్టిపెట్టి లోపలకు దయచెయ్యండి ఎవళ్లోవస్తున్నారు."

"పోతానులెండి. ఇక్కడకూచుంటే అకాఫీగిన్నెలన్నీ ఎవళ్లుకడుగుతారు. అబోడిదానీది అప్పుడే మానుకుందారెూ. అయితే ఆడాళ్లుకూడా మొగాళ్లతోకలిసి మాట్లాడొచ్చు, వాళ్లతో చేతులూకలపవచ్చు అంటారుగా మరి నన్ను లోపలికి పొమ్మంటారేం? అయినా ఎవళ్లిదాకావస్తేగాని యిల్లాంటివి తెలియవులెండి, కబుర్లు ఎన్ని చెప్పితేఏం ఉత్తవి."

"పోనీ వాళ్లతో చేతులు కలపాలంటేకూడా, నాదేంపోయింది."

"నేచదువుకున్నదాన్నయితేగా కలిపేందుకు. ఊరికే మాటవరస కడుగుతున్నాను—కోటిలింగాల కెప్పుడూపోవడం."

"అబ్బ! ఎవళ్లోవస్తూన్నారంటే అదేగోల కోటిలింగాలూ నూరులింగాలూను."

"మీక స్తమానమూ వస్తూనేఉంటారు ఎవరో ఒకరు. తొందరగా పంపేయండివాళ్లని ఊరికేకూచో పెట్టుకోక."

అసలు దీనిఅల్లరీ, కుంటిప్రశ్నలూ విసిగించడమూ నాకు తెలుసుగనకే బదిలీఅవుతుంటే రాజమండ్రీ తీసుకువెళ్లనన్నాను. వాళ్లనాన్నావాళ్ల దగ్గిరికి పంపుతానంటే పోనని ఏడ్చింది. పోనీ చిన్నపిల్లగదా నేనంటే అంతప్రేమ తనకు, ఎందుకుఏడిపించడం, అంతఒకవేళ ఏడిపించి యిప్పుడుపంపినా నాలుగో నాటికి ఎల్లాగూ గోలపెట్టివస్తుంది. అనవసరం రైలు ఖర్చుఅని తీసుకొచ్చాను. చూశారుగదూ దానిప్రశ్నలు. అల్లా సమాధానంచెప్పలేకండా వేస్తుంది. పోనీ దానికితెలిసి తెలివితేటల్తోవేస్తుందేమో అనుకుంటేమళ్లీ అదేంలేదు. వట్టి ఊరికే అనుకోకుండా వేస్తుంది. తనకూ తెలీవు అవి అంతచిక్కుప్రశ్నలని పైగా-నేచెప్పిన గుడ్డిసమాధానాలకు మూడువంతులు తృప్తిపడుతుంది. అదీ ఇదీ అక్కడికీ యిక్కడికీఅని విసిగిస్తే వీల్లేక ఓదానికోటి చూపెట్టినా నిజమేఅనుకొని సంతోషిస్తుందిపాపం. ఊరికేమాయిద్దరికీ పాతచుట్టరికంకాస్తైనా లేకపోయినా అపిల్లఅంటే ఎందుకోనాకు అపరిమితప్రేమ- నాదగ్గిర చిన్నపిల్లలా అభియిఖీకావాలని యేడుస్తుంది. దాన్నిసంతోషపరచడమే నాకుఆనందం, వాళ్లనాన్నా వాళ్లనికూడా అడగదు. వాళ్లకోసం ఒక్కనిమిషమేనా విచారించదు. మళ్లీతను చిన్నపిల్లేఅయినా, ఎవరుచెప్పారో మరిఎల్లాతెలుసో ఏమో తనకు తండ్రిఅయినా తల్లిఅయినా అన్నఅయినా నేనే అనీ తనుఎల్లామాట్లాడినా ఎల్లాచేసినా నాకు ఇష్టంగాఉంటుందనీ ఓగట్టినమ్మకంపాపం- అల్లాంటిపిల్లను ఏమనికోప్పడను.

భార్యాభర్తలు జీవించేది ఒకరికోసం ఒకరుగాకపోతే జన్మఎందుకు? నాశరీరం, నాఅందం, నాఐశ్వర్యం, నామంచీ అన్నీతనవి. తనకోసం తననుసంతోషపరచేందుకు నేనుబతుకుతున్నానని నానిశ్చయం- అందుకోసమే వీలైనంతవరకూ తనుఏంకావాలంటే అదినెరవేరుస్తాను. అయితే నాకు సిగ్గుఎక్కువ. అందుకోసం బహిరంగంగా ఏమీచెయ్యను తనకై. తనకూ అంతే-

ఈఊరు తలిమ్మాటోళ్లకు మల్లేగాదు. ఎన్నోచూడాలసినవి ఉన్నవి. మగవాణ్ణినాకేంగనక ఎప్పుడం

టేఅప్పుడే చూడవచ్చు. అయితే తనకూ చూపాలిగా. ఎల్లాతీసుకెళ్లను?. నాకూ కొత్తేయీ వూరు. నేనిలా స్కూల్లోకి పోగానే తనుపక్కింటికిపోయి అన్నీ అడుగుతూండేది. వాళ్లప్రభావతితో మూడునాలుగు సార్లు స్కూలుకూడావచ్చింది. అయితే తెలివితేటలేమిటంటే ఏయిద్దరిముగ్గురికో తప్ప ఎవ్వర్లకీ తనుఫలానాఅని తెలియనీలేదు. అదమేష్టర్లకసలే తెలీదు. ఏదో ఊళ్లో పిల్లఅనుకున్నారు అందరూను. నన్నడిగినట్టే ఏపంతులమ్మనో తెలుగుచెప్పేఆవిడనుగాబోలు ఏదోఅడిగిందట. ఆవిడఉడుక్కుని కోప్పడి స్కూలుకురావద్దందిట. నేనంటే ఊరుకున్నానుగాని ఆవిడకూడా అబ్బురమా తనంటే.

కాని ఓటి, ఎవరన్నా ఉపన్యాసాలిస్తూంటేనూ మీటింగులవుతూంటేనూమాత్రం పోవాలిఅనదు. ఊరికే ఏమున్నాతమాషాలు చూద్దామనీ, ఎవళ్లనన్నా గమ్మత్తుకి ఆక్షేపిద్దామనీ ఉంటుంది.

"రేపుశనివారం. ఊళ్లో హోమంఅని యేదో ఉందట. నే చూద్దామనుకున్నాను. నీవూవస్తే బండీమీద పోవచ్చు."

"అవునుటండీ, అక్కడంతా పాపంతలచెడిన వాళ్లు ఉంటారుటగదూ వాళ్లఅన్నపూర్ణ చెప్పింది."

"తలచెడినవాళ్లంటే మనవాళ్లలా ఉండరు. బాల్యంలో భర్తలు అకాలమరణం పొందినవారంతా వచ్చి చదువుకుంటారు అన్నమాట-"

"అబ్బో మీరెంత సంస్కృతంలో చెప్పినా అర్థం అన్నింటికీ ఒక్కటేలెండి-ఆఊళ్లో సంగీతంచెప్పే మంగలి ఎంతమేష్టరైనా మంగలాడనడంమానామా?. ఊరికే గొప్పలు."

"పోనీగాని మరి నీవు వస్తావా? నన్నే వెళ్లమంటావా?"

"నీవు చదువుకోలేదుఅంటే నేనేంచెప్పలేనుగాని యింతవరకు మనంఏమీచూడలేదుగదా ముందుగానే వాళ్లనిచూడడం ఎందుకండీ. మరోమాటు వెళ్లగూడదూ? ఇంతలోనే వాళ్లేఊరన్నా లేచిపోతారా?"

"పోతే పోనూ పోతారు. వాళ్లూచిన్నపిల్లలే. పెళ్లిళ్లుచేసుకుంటారు మనలాగేను."

"అవునులెండి. అది చెప్పక్కర్లేదు. అంతే అందరూఒక్కసారే పెళ్లిళ్లుచేసుకొని మేడలన్నీ ఖాళీచేస్తారా యేమిటి? మొట్టమొదటే అక్కడికిపోవడం నాకూబాగాలేదండి మీరుచాదస్తంఅనండి పెంకెదిఅనండి- మొన్నెగో కోటిలింగాలకు పోదామన్నారుగా సెలవొస్తే. మళ్లీయిల్లా తిరిగిందేమిటి యివ్వాళ."

"ఎక్కడికైనా పోవాలంటే ముందు అక్కడిచిత్రంఏమిటో తెలుసుకోండి అనవసరంగా బండికి డబ్బుతగలేయడ మెందుకు?."

"మరి మీచదువుల్లో ఎక్కడా కోటిలింగాల్లో ఏముంటుందో రాలేదూ?."

"రాకేంవచ్చింది. అక్కడ కోటియీశ్వరలింగాలుంటాయట. కాశీహస్తిగుళ్లో కోటి స్తంభాలున్నట్లే."

"మరియింకనేం? దేవుడిదర్శనంకంటే కావాలిసిందేమిటిగనక-అక్కడ గోదావరి అదీ బాగుంటుందిట. అక్కడికేపోదాము-"

ఆసలు నేనూచూడలేదు కోటిలింగాలంటే ఏమిటో. నాకుమాత్రం ఏంతెలుసు? ఏమీ తెలీని చోటికి దీన్నెలా తీసుకెళ్లడం? తీరా అక్కడ కోతులూ కొండముచ్చులూఉంటే దీంతో కూడా నేనూభయపడిపరిగెత్తాలిసివస్తుంది. నాకేమోహోమూ అక్కడితోటా చూడాలనిఉంది. ఎల్లాగసాధనం- సరేఅని తీరాదాన్ని తీసుకువెళ్లకపోతేమరి జయించలేము. ఉపాయం ఆలోచించాలి రాత్రికి పడుకున్నాక-

రాజమండ్రీలో చచ్చినవాళ్లకు స్మారకసభలూ సమాజాలప్రార్థనసభలూ రోజూకు అధమంరెండేనా ఉంటవి. అన్నిసభలకూ ఆహ్వానపత్రికలు రావడం మామూలు మొగవాళ్లుతీరిక లేక రాకపోయినా వచ్చినా కూడా- శనివారంకూడా మీటింగువచ్చింది. ఎల్లాగూ ఆపిల్లలుండరు. తనకువాళ్లనిచూడ్డమూతప్పుతుంది. నాకదిచూడడమూలభిస్తుంది. ఇక, లింగాలూ గోదావరీను. దీనికాపాటి సమాధానం చెప్పలేకపోతానా అనుకున్నాను.

మరువాడు సాయంత్రం నాలుగింటికల్లా కాఫీ అన్నీ తాగాము. తను మామూలు చీరే-ఉన్నవే అసలు పిచ్చిచీరలు. అందులోనూ పిచ్చిదికట్టుకుంది. అంటే బండీలోవెళ్లడమూ అక్కడఎవళ్లూ ఉండరాదు. ఉన్నా మమ్మల్ని ఎరిగినవాళ్లెవళ్లుంటారు గనక. అందులో అజాకెట్టు ఎక్కడో కాస్త చిరిగిందికూడాను. నాకెందుకు? నేనెందుకుచెప్పాలి. నాకై నే మంచిదే కట్టుకున్నాను. మాటకు కోటిలింగాలు. వెడుతున్నది హోముదగ్గిరికి వెంగాణిగనక 'చేరమాడా లని బండివాడిదగ్గిరకువచ్చి వాడి నేమీ మాట్లాడవద్దనీ మీ కోటిలింగంగారితోటదగ్గిరకనీ ముందుచెప్పేశాను.

పోతున్నదిబండి. వంతెనమీదుగా దానవాయి గుంటా, చిన్నమైదానాలూ పోయాము-అక్కడది గాము. ఎవళ్లూ లేరు. నేనూ, ఇదీ, బండివాడూను. మమ్మల్ని చూచి ఎవళ్లో యిద్దరు బాలికలువచ్చివెళ్లారు. అక్కడిపూజారికూతుళ్లువాళ్లు అనిచెప్పాను-అన్నీ చూచింది. ఇళ్లూ, చెట్లూతప్ప ఏముంటాయి. నాకెంతో హాయిగాఉంది - అనాథబాలికలనిమిత్తం ఆ సంస్కారి, మహాత్ముడు ఎంతప్రయాసపడ్డాడో గదా పాపం. దేశంరెండువంతులైనా అతండ్రి ఆదర్శాన్ని అనుసరిస్తే ఎంతబాగుండును? ఆఎత్తైనగోడలూ, ఆవిశాలప్రదేశమూ, చల్లనిగాలీ ఎంతో ప్రశాంతంగాఉండడం నాకో ఆనందాన్ని కలిగించినవి.

పక్కపదిక్కులు చూస్తూ తెల్లబోయినుంచుంది-లింగాలేవండీ యింకాఎక్కడేనా ఉన్నాయా అని అడిగింది తొందరగానూ, కోపంతోటీనూ-

"ఇవిగో నే, యీరాళ్లే-" అని అక్కడ కంకరరాళ్లు చూపెట్టాను. "కావాలిస్తే లెక్కెట్టుకోరాదూ?"

"అన్నీ నట్టిదే, ఎక్కడికో తీసుకొచ్చి పాపం. ఇవి లింగాలెలాఅవుతవి-ఏపూజాలేదు బుగ్గీలేదు. ఎప్పుడూ ఇంతే-" అని ఏడుపుమొగం పెట్టింది.

"అదిగాదే మరిభద్రాచలంలో సీతామ్మవారి పసుపుకొమ్ములని రాళ్లుఏరుకురారూ, ఇవేంపసుపుకొమ్ములుఅని అన్నావా?-సీతామ్మవారు ఆరవేసుకున్నచీరఅని ఓచిన్నకొండ చూపెడితే అక్కడ ఓకాసేపడేసి నమస్కారం చేశాము గాని యిదేంచీర అని అడిగామా? అల్లాఅడగడంతప్పు, మహాపాపంఅని అంటారుగదూ. ఇక్కడాఅంతే-లింగాలంటే ఇవే. ఇవేంలింగాలని అనకూడదు. ఎంతదోషం. నీవు ఎరక్క-అన్నావుగనక అది పాపంలో చేరదులే-సరిగ్గా చూచేవాళ్ళులేక పూజాఅదీ రోజూజరగదు-లింగాల అమావాస్యఅని ఏడాదికో ఉత్సవంవస్తుంది. ఆనాడు ఇక్కడ ఎంతో బాగుంటుంది- అప్పుడు పరమేశ్వరుడు పార్వతీదేవితోసహా గొప్పవారికీ మంచివారికీ దర్శనమిస్తాడట రహస్యంగా. మనం అప్పుడుకూడా వద్దాము-"

"మరి గోదావరేదమ్మా-"

"గోదావరీసేసింది యిక్వేళ. ఈప్రాంతాల్లో గోదావరితల్లికి మహిమఅందుకనే-ఆమహాతల్లి దేవత కదూ! తనమాహాత్మ్యంచూపించి జనులకు భక్తిపుట్టించేందుకు తనయిష్టంవచ్చినప్పుడు మాయమౌతూ ఉంటుంది- ఒక్కొక్కప్పుడు నిండుగా ఎంతో లోతుగా ఉంటుంది. అప్పుడు చిన్నచిన్న పడవలమీద పోతారుజనం- ఆఉత్సవంలో అంతే- అంతమహిమగనకే ఎంతోమందిజనం రావడం, కోటిలింగాలని ప్రసిద్ధీను- అల్లాఅడిగి అన్నీతెలుసుకోవాలిగాని ఏదోఅనుకొని మూతివిరిచుకోవడం కూడదు-"

పాపం కొంతసమాధానపడ్డది-ఆపిల్లలు జడా, చీరే, బొట్టూకట్టుకొని చక్కగా మనపిల్లల్లానేఉన్నారు- తనువాళ్లతో మాట్లాడుతుందేమో మరీగోలఅనివాళ్లు మనదేశపువాళ్లుకారనీ హిబ్రూదేశపువారనీ, ఆదేశం ఎంతోదూరమనీ, మనభాషరాదనీ చెప్పాను-ఊరుకుంది. గావాళ్లని చూచింది-

అయితే యిక్కడివాళ్లలా జడాచీరే కట్టుకున్నారు గదా మరి తెలుగుగూడా ఎందుకు నేర్చుకోలేదు అని అడిగింది. ఏమో నాకూ తెలీదని పొద్దూక్కుముందే మళ్లీవాళ్లంతతావస్తే యికతప్పుకుండా హోమేఅనుకుంటుందని బండిఎక్కించి తొందరపెట్టి యిల్లుచేరాము. కాని అది కోటిలింగాలుకాదనిమాత్రం తెలుసుకుంది గోదావరి లేకపోవడంమూలాన్ని. బండీలో నాతో ఏంమాట్లాడలే. ఇంటికివచ్చాక అన్నంతినేప్పుడు "నేను ఇంక మీతో ఎక్కడికీరాను. వాళ్ళఅన్నపూరా నేనూ నెడతాను. ఆ సమావం ఓదానికోటి చూపడమేగాని- పాపం- అసలుఎందుకు రమ్మనాలి అంత యిష్టంలేకపోతే నన్ను" అని అంది గమ్మత్తుగా మొగంపెట్టి.

# ప్రాతఫక్కీపాటలు

శ్రీమతి యన్. వి. సరళాదేవిగారు

౧

సారస్యమొలికినది శూర్పణఖమనసు
రామునిరూపాన్ని తానువలచినది
రామునిలోనున్న లావణ్యరసము
అన్యపిపాసింప నలవియగునొక్కో?

౨

శూర్పణఖ యెన్నగా చుప్పనాతియే
రామునిసీతను ఎడబాపజూచె
అంతమాత్రమేకాదు తనదుపుట్టింట
ఆరనికార్చిచ్చు దరికొల్పుకొనియె.?

౩

మంధర యొంటటి మహితోపకార
శీలినియానొక్కో తెలిసిచూడంగ
ఆమెతంత్రాంగంబు లేకయేయున్న
లోకాలుపాయునే రావణుబాధ?

౪

మంధరాదాసి తా పాపిష్ఠమతియె
సర్వగుణాకరు శ్రీరామచంద్రు
వనవాసకారణభూతయై మెలగి
నలుగురినోళ్ళలో నానుచునుండు
తిట్లను తినుచుండు నేటికింగూడ?

౫

పూతసాన్నిధ్యంబు పూరించుఫలము
గాధేయవసిష్టఋషులు తమలోన
శ్రీరామమూర్తికి విజ్ఞానమిచ్చి
ఆత్మవిరోధంబు పాపికొన్నారు?

౬

గొప్పవారల పాదరజమైనగాని
ఎంతేసిపనులయిన నిట్టేకావించు
శ్రీరామచంద్రుని దివ్యపాదంబు
రాతినాతిగజేసె ఎంతచిత్రంబో?

# ప్రతిధ్వని

బోడ్డు బాపిరాజుగారు

మానవుని చితిమండుచున్నది; ఆరుచున్నది. కాని హృదయజ్వాల, ద్వేషానలము పుట్టినమొదలు వృద్ధిపొందుచునేయుండును.

తార విధవరాలైన నాడు బంధువులందఱును విచారించుచున్నారు. అన్నగారి మరణమున కేడ్చుచు ఎత్తిపొడుపుగా "ఒదినా! ఎవరి పాపమెవరనుభవింతురు?" అన్న మఱది మాటలు ఏడ్పులసందడిలో చెవులు నిక్కబెట్టి ఆసన్నవైధవ్యమున వసయుచున్న తార విన్నది.

తార ధనికురాలు. వైధవ్య మీకారణమున దూరమునందుండియే భయపడిపోవుచున్నది. దాని పూర్ణానుభవము తారకెన్నడును రుచిచూపలేదు. పాపము! మఱది రాముడు తనతనయ శ్యామతో ఎట్లో కష్టదినములు గడుపుచున్నాడు. వరశుల్కము లభింపదను నిరాశవలన పెండ్లిచేసుకొనుట కెవ్వరు నాయత్తపడలేదు. శ్యామకు పదునాలుగేండ్లు దాటినవి. ఎంత ప్రయత్నించినను రాము డామెకు పెండ్లి చేయలేకపోయెను. తుదకు కాలము చేసెను.

శ్యామ నిస్సహాయ; ఏకాకి అయినది. జీవితమంతయు ఖైదులోనున్నట్లు గడుపుచున్నదామె ఒంటరిగా. గంగానదిఒడ్డుననున్న తమతోటలోనిపూరిగుడిసెలో కాపురమున్నది.

రాత్రులందు తోడుగా నొకవృద్ధురాలామెవద్ద పరుండును. పేరు 'మన్నీ'. శ్యామ ఆమెను 'దాదీ'అని పిలుచును. ఎచ్చటనుండి ఏవిధముగా తెచ్చి తన యన్నపానములకు లోటులేకుండ చేయుచున్నదో వృద్ధురాలెఱుగదు. నెమ్మది నెమ్మదిగా దారిద్ర్యమునకు మిగిలిన చిహ్నములన్నియు విక్రయింపబడి శ్యామగర్భకోశములో ప్రవేశించినవి.

ప్రస్తుతము మామిడితోట వేలంఅగుటకు సిద్ధముగానున్నది.

* *

గంగానదిశీతలశరీరమును కదుష్ణముచేయుటకు బాలాతపము ఇంకను అసమర్థమైయున్నను నవకిసలయములను తిళుకు లీనించినది. వసంతుని శుభాగమనముహూర్తమున కోకిలగాయకుని 'కుహూ' మంగళరావములు చెలరేగినవి. మామిడిపిందెల గుత్తులు తలలూపినవి. ఆమ్రవనమున వసంతఋతులక్ష్మి; శ్యామ కోమలశరీరమున యౌవనలక్ష్మి తాండవించినది.

శ్యామ ద్వారమువద్ద నిలువబడి సోపానములదిగువ సంవత్సరాదిపర్వమునకు స్నానము చేయుచున్నవారిని జూచుచున్నది. సమీపించినకొలది మెల్లెక్కుచు జనసమూహము స్పష్టముగా కన్పడుచున్నది.

మన్నీ వచ్చుచునే చేయిపట్టుకొని—"పదవమ్మా? మనముకూడ స్నానముజేసి వద్దాము." అన్నది.

"రాను, దాదీ! జ్వరమువచ్చునట్లుగా నేమి శరీరము బ్రద్దలగుచున్నది." అన్నది శ్యామ.

మన్నీ నిర్గమించినది.

తార స్నానముజేసి దాసితోగూడ మెట్లపై కెక్కినది. శ్యామతోటప్రక్కనుండియే పోవలసినమార్గము. అచ్చట ఎవ్వరును లేకుంకుటచూచి సంతుష్టితో నూపిరిటీసినది తార. మావిపిందెలతో వ్రేలాడుచున్న కొమ్మకు నామెశిరస్సు తగులుకొన్నది. కొమ్మ క్రోవ మీదికి వంగియున్నది. తార చూచినది, ఎవ్వరును లేరు. చేయెత్తి కొన్నిపిందెలను కోసుకొన్నది. "పిన్నీ! ఇంకాకోసుకో. రేపటి కిదివేలం అయిపోతది" అన్నారు వెంటనే ఎవ్వరో.

అగ్నిబాణములవంటి తారనేత్రములు ఎవరినో దహించివేయుటకు తెరచుకొన్నవి. తిరిగి ఆమెహృదయమున చాలరోజులనాటి యామాట ప్రతిధ్వనించినది. "ఎవరి పాపము ఎవరనుభవింతురు." తార జలదరించినది. రామునికూతు రెత్తిపొడిచినట్లామెగ్రహించినది. పెదవి నొక్కుకొనుచు వెళ్లిపోయినది.

* * *

నూటైదు—ఒకటోసారి.

నూటైదు—రెండోసారి.

నూటైదురూపాయలు—మూడోసారి.

చెప్పటం అయినది. "నాలుగోవంతు రూపాయలు ఎవరు జమకట్టుతారు?" అన్నాడు అమీనా.

"నాల్గోవంతుకాదు. పూరాగా తీసుకోండి. తారపేరరశీదువ్రాయండి" అన్నాడు బలిష్టుడగు యువకుడొకడు. రూపాయిలుదగ్గర పెట్టబడినవి. రశీదు యివ్వబడినది. శ్యామ నిశ్శబ్దముగా మావిచెట్టుక్రింద కూర్చున్నది. ఆమెకేమియు వినబడుటలేదు. డప్పు సవ్వడితో కేవలము "ఒకటి, రెండు, మూడు"యొక్క ప్రతిధ్వనిమాత్రమే చెవులలో మ్రోగుచున్నది.

"పద, మంచిపనైంది. తార అనాథబాలికాశరణాలయము కట్టించియుంచినది. నూటైదుకు కొన్న మూడెకరాలతోట; గంగఒడ్డునఉన్న ఇల్లుకాదు" అన్నాడొక పెద్దమనిషి.

"శరణాలయ మెక్కడున్నదో భగవంతునికెఱుక?" అన్నది వృద్ధురాలుమన్నీ. శ్యామ నిశ్శబ్దముగా వినుచున్నది. సంజప్రొద్దు వ్రాలినది. ఆతోటలో కాపురమున్న పక్షివర్గములు కలరవములతో గూండ్లకు మరలినవి. కాని శ్యామకదలలేదు. తనకుకూడ ఇల్లున్నవిషయ మామె మఱచిపోయినది.

* * *

ముసలిదానితోకూడ అమీనాసాహేబువచ్చి నిలబడినాడు. అమీనా యొక సుందరుడని చెప్పదగిన యువకుడు. పస్త్రీయైనను తప్పక తన్నొకసారి తలయెత్తిచూచి పోవునని యతని సహజవిశ్వాసము. దారిద్రము శ్యామసౌందర్యమును అడ్డగించెను కాని యౌవనమును దాపలేకపోయెను. కుమారయౌవనము క్రీడావిహ్వలమైయుండెను.—"మన్నీ! అడుగుము. నేను రూపాయలిచ్చెదను. ఇంకను ఒకనెల గడువున్నది. రూపాయ లివ్వటంవలన ఏలం ఆగిపోతుంది" అన్నాడు అమీనా. శ్యామ అతని వైపొకసారి తీవ్రముగా చూచినది. విగ్రహాపుష్టిగల యమీనా ఆయనాథబాలికాదృష్టి సహింపలేక నెమ్మదిగా జారినాడు. వర్షాంభస్సిక్తమగుకాష్ఠ మాయెనయనములలో జ్వలించుట మన్నీ చూచినది. అచ్చటనుండి ఇంటికివెళ్ళమని చెప్పుటకు ఆమెకు సాహసము చాలకపోయెను. కొంచెముసేపుండి ఆమెయే వచ్చును లేకున్న అప్పుడే వెంట పెట్టుకొని తీసుకొని వెళ్లవచ్చునని మన్నీ తలపోసినది. తిరిగి ఆమెవచ్చినప్పుడు నిశీథాంధతమసమున నెంత యన్వేషించినను శ్యామకన్పట్టలేదు.

* * *

తారకు ఉత్తరాధికారిగా వచ్చినవాడు ఆమె సహోదరపుత్రుడు ప్రకాశము. ఆకస్మికముగా నైశ్వర్యమబ్బుటచే తరుచు ఎట్లుగా తయారగుదురో అట్లేఅయి ప్రకాశము తనలో తాను నిలువజాలకపోయెను. అత డాపల్లెటూరును మొదటితరగతి బస్తీగాజేసి కూర్చున్నాడు. పూర్వము తారయున్న యింటివద్దనుండి శ్యామతోటవరకు క్రోసెడు దూరము బాగుగా తయారుగావించెను. ప్రాతకొంపపీకించి బంగాళానిర్మించెను. ఉద్యానవనములో పంథలు; లతాతోరణములు వెలసినవి. ఇదియే ప్రకాశబాబు కూర్చుండుతావు. నౌకరు లిందుచే దీనిని 'ఛావనీ' అందురు.

ఆషాఢమాసము. ఉదయమునుండియు చాల ఉబ్బగానున్నది. తూర్పుగాలివలన మేఘమండలము స్థిరత్వముదాల్చినది. వర్షముకురియు సూచనలు ద్యోతకమగుచున్నవి. పక్షివర్గములు అస్తవ్యస్తముగా సంచరించుచున్నవి. పిచ్చిదొకతె గంగాతటమునుండి పైకెక్కుచుండెను. తనపాదవిన్యాసములను ఒకటి-రెండు-మూడు అని అస్పష్టస్వరముగ గొణుగుచు ఆకాశమువంక చూచుచుండెను. తోటతలుపులు తెరచియుండుటచే లోనప్రవేశించినది. మామిడిచెట్లక్రింద తిరుగుచు ఒకటి-రెండు-మూడు-అని లెక్కపెట్టుచుండెను.

తరంగమువలె ఒకగాలివిసరు విసిరినది. ఏటవాలుగా నొకతుంపరజల్లుపడినది. నాలుగైదు మామిపిందెలు రాలినవి. పిచ్చిది కంగారుపడినది. మూటికంటె నెక్కుడు లెక్కపెట్టుట ఆమె ఎఱుగదు. ఇటు తుంపరులలెక్క, అటుమామిళ్ళు. చాలాగడిబిడి అయినది. ఒకమబ్బుతునక వర్షించుచు బయలుదేరినది. పిచ్చిది ఒక్కసారిగా స్వస్థురాలైనది.

మయూరమొకశాఖపై గూర్చుండి షడ్జము నాలపించుచున్నది. ఆస్వరము పిచ్చిదానికి ఎఱకఉన్నట్లు గుర్తువచ్చినది. తిరిగి లెక్క మొదలు-ఒకటి-రెండు-మూడు-ముగిసిన పిదప కొమ్మవైపు చూచినది. ముఖము వికసించినది. మరల-ఒకటి-రెండు-మూడు-ఈ తేప లెక్కలో మిక్కిలి ఉల్లాసము; విస్మయము; హర్షము ముప్పిరిగొన్నవి. ఒకగుత్తికే పండియున్న మూడుమామిడిపండ్లను వృంతముతోకూడ త్రుంచినది. అవి ఊపుచు లెక్కసాగించినది. గిలకపంపుతో ఆడుకొనుపసిపాపవలె పిచ్చిదానితో ఆడుకొనుచున్నది.

తోటమాలి వచ్చినాడు. తిట్టినాడు. కొట్టుటకు చేయికూడనెత్తినాడు. ఉన్మాదిని తనయాటచాలించి నిశ్శబ్దముగా అతనివేపు నిర్నిమేషనయనములతో వీక్షించినది. అతడామెచెయ్యిపట్టుకొని ప్రకాశబాబువద్దకు తీసుకొనివెళ్లినాడు.

ప్రకాశము యక్ష్మరోగపీడితుడై ప్రస్తుతము నిరంతరమిచ్చటనే యుండువాడు. తలగడదిండ్ల సహాయమునకూర్చుండి 'చీకదానా'లో కఫరక్తముల నుమియుచుండువాడు. శల్యావశిష్టమగు శరీరమంతయు కృశీభూతమైనది. ముఖబింబమున దీర్ఘనాశిక, విశాలనేత్రములు తామున్నట్లు మొరపెట్టుకొని నిరూపించుకొనుచుండెను. పిచ్చిదానినిపట్టుకొని మాలీఅతనివద్దకు వచ్చెను.

విలాసుడగు ప్రకాశముచూచినాడు. పిచ్చిదానియౌవనసుగంధమింకను ఆమెను అనుసరించుచునేయుండెను. కాముకుడగు ప్రకాశమునకు నేడాతనిరోగముపై క్రోధమువచ్చినది. వచ్చుటలో పూర్ణముగావచ్చినది. అతడాక్రోషమునణచుకొని పిచ్చిదానివైపు సాగినాడు. తోటమాలి బండబూతుల జంఝామారుతము ఆమెనెదురుకొన్నట్లు చేతిలోని మామిడిపండ్లుచూచి గ్రహించినాడు.

పిచ్చిది"ఇది ఎవరి పాపఫలము? నీవెఱుగుదువా? దీని నెవ్వరనుభవింతురు? చెప్పు-ఒకటి-రెండు-మూడు"అన్నది.

"దొంగతనమును పిచ్చితనముతో కప్పిపుచ్చుటకు చూచుచున్నావు. నీవుకోరినవి కావలసినన్ని దొరకును. దొంగతనముచేయనేల?" అన్నాడు.

ఒక్కసారిగా పిచ్చిదానిప్రలాపము రక్తాంబరముధరించి నయనగోళములలో తాండవించినది. మామిడిపండ్లగుత్తితో క్షయజర్జరమగు ప్రకాశునిహృదయముపై బలము కొలదికొట్టుచు లెక్కపెట్టినది-ఒకటి-రెండు-మూడు-ప్రకాశము తలగడదిండ్లపై బడి సంసయముతో నూరుకున్నాడు. పిచ్చిదినవ్వుచు అక్షయగణనము సాగించినది-ఒకటి-రెండు-మూడు-దానిప్రతిధ్వని తోటలో ముఖరితమైనది.

—అనువాదము.

# అత్తాకోడళ్లు

పురాణం కుమార రాఘవశాస్త్రి గారు బి. ఏ.

౧

కనిపెంచిన తల్లిగానీ, లేకపోతే అగ్నిసాక్షిగా పెండ్లిచేసికొన్న అనుకూలురాలైన భార్యగానీ ఎవరో ఒకరైనా రుచించకపోతే అతనిజీవితం సుఖబాహ్యమైంది. ఒకగృహం దుఃఖమయంగా వుండటానికిగానీ, ఆనందదీపం వెలుగుతూ ప్రకాశిస్తూండుటకుగానీ కారణభూతురాలైంది స్త్రీ. అందుచేత అనేకమంది స్త్రీలహృదయాలు విద్యాగంధముచేత మాధత్వము వహించి పునీతముకావాలి.

"అమ్మా! అమ్మా!" అని పిలుస్తూ బయట ఎండలో నిల్చుని తలుపుతట్టుకున్నాడు కృష్ణమూర్తి. పగలు పదకొండుగంటలవేళ. గడచిన రెండుమూడు రోజులనుంచీ ఒకటేధారగా వర్షపాతమాటచేత గాబోలు ఆనాడు తీక్ష్ణంగావున్నాడు సూర్యుడు.

ఉద్యోగాలుదొరక్క 'క్రెంచిమెంటు' అనే మాటకు కీర్తిప్రబలిపోయిన ఈరోజుల్లో 'ఇల్లు ఎలా గడపటమా?' అనే బాగుప్పతో కృంగిపోయే విద్యాధికులలో కృష్ణమూర్తి ఒకడు. వచ్చేరాబడి సున్నా. బీదసంసారం. అక్కాడికేతేనేగాని ప్రేగులాడవు. ఏంచేస్తాడు? ఏకానికంతల్లోనైనా నాసరే నాలుగు రాళ్ళు దొరకతవీఅంటే పోవడానికి సంసిద్ధుడై వున్నాడు. 'అవూళ్ళో కాఫీహోటలువున్నదా?' షికార్లుపోవడానికి బీచిలాంటిదేమన్నావుందా?' నాటకసమాజాలు, సినిమాలు వున్నాయా?' అని అడగడా బి. యే. చాలారోజులు తిరిగీ తిరిగీ ఉద్యోగందొరక్క చివరకు గుంటూరులో నాలుగు ప్రైవేటు ట్యూషన్లుచెప్పతూ కాలంగడుపుతున్నాడు. ఒకపాతిక రూపాయిలు గిట్టుతున్నాయి. "ఏదో కొంతనయం" అనుకున్నాడు. నాలుగుసార్లు తట్టగా తలుపు తెరుపబడింది. లోపలికి అడుగువేశాడు కృష్ణమూర్తి. అప్పుడేతలుపుతీసి తలవంచుకొని వంటయింట్లోకి వెళ్ళిపోతున్నది అతనిభార్య. వెనుకనుంచి అతనికి కనుపిస్తున్నది ఆపాదుగటెసంచీజడ, సొమ్ములులేకుండా సౌందర్యం గ్రక్కుచున్న ఆమెడా. నిట్టూర్పువిడిచాడు కృష్ణమూర్తి. "ఆమె చాలఅందగత్తె. ఐనా ప్రేమసహితంగాని ఆసౌందర్యమంతా రసహీనంగా వుంది" అనుకున్నాడు.

తలుపుమూల చెప్పులువిడిచి అక్కడ సులకమంచం వాల్చుకుని కూర్చున్నాడు. ఎక్కడోఊరుచివర ట్యూషన్లుచెప్పుకుని వచ్చేసరికి చాలఅలసిపోయాడు. ఒళ్ళంతా చెమటపట్టింది. కళ్ళు తేలిపోతున్నై. నీరసపడ్డాడు.

పద్మావతి ఏవోపనులు చూచుకుంటున్నది వంటయింట్లో. భర్త ఎంతఅలసిపోయాడో గమనించడానికి అతనివేపైనా తపరకూ చూడలేదు, ఏదోవచ్చాడు, కూర్చున్నాడనుకుంది.

కాని కృష్ణమూర్తి కవిహృదయంమాత్రం ఆకాటపడుతున్నది దానికి. ఆమె కటాక్షవీక్షణప్రసారంలో చెమటార్పుకో తలస్తాడు. ఆమె చిరునవ్వు వెన్నెట్లో విశ్రాంతికోరుకుంటాడు. తనజీవితంలో అవి తనకు అలభ్యమని తెలుసు. కాని కోరుకోడంమాత్రం మానివేయడు.

కట్టుకున్న ధోవతిచెంగుతో నుదుటిమీద చెమటచుక్కలు తుడుచుకున్నాడు. అక్కడే ఎదరగోడ కానుకుని కూర్చున్నది అతనితల్లి. కాస్సేపు నిశ్శబ్దంగా వున్నదింట్లో. ఎవ్వరూమాట్లాడలేదు. చివరకు కృష్ణమూర్తే "వంటైందా? మళ్ళీ ట్యూషన్లకు పోవాలి" అన్నాడు.

అతనితల్లి అందుకున్నది: "ఈపాటికప్పుడే ఎల్లాగౌతుంది, బాబూ! వంట. నీపెళ్లాం సబ్బులతో స్నానాలుచేసి, తలదువ్వి, చీర సింగారించుకుని వంటయింట్లో అడుగుపెట్టేసరికి పదిగంటలౌతున్నది."

దీనికి పద్మావతి ఊరుకుందా? "పోనీ, మీరే మడికట్టుకోపోయారు" అని ఒకసమిధ రగిలించింది.

"ఏమిటే, లోపటనుంచి గొణుగుతున్నావు. అయితే, నిన్నూ నీ మొగుణ్ణి కూర్చోబెట్టి ఎల్లకాలం చేసిపెడుతుంటాననుకున్నావా? సాగవు పిల్లా! అవే పాలు."

"ఐతే మీఅత్తేసాలు కట్టిపెట్టండి."

"అదీ! అలాగమాటకు మాటా వప్పజెప్పటం బాగా నేర్పిపంపిందిలే మీఅమ్మ. ఇంకేం, బాగా గడిదేరిపోయావు. ఇలాగైతే చక్కగానే సంసారం చేస్తావు."

"ఓహో, మాఅమ్మనుకూడా రంగంలోకి తెచ్చావూ!"

కృష్ణారావుకు చిరాకనిపించింది. ఏమిటీ అసంధర్భప్రవాదనంతా లేకపోతే. వింటున్నాడు. వాళ్ళ వాగ్ధోరణి ఆపడానికి శక్తిలేదతనికి. చదువుకున్నాడే కాని ఇల్లాంటివ్యవహారాల్లో అనుభవంలేదతగాడికి.

ఎవరిని ఏమంటాడు! విడువుమంటే పాముకు కోపం; కరువుమంటే కప్పకుకోపం. కాస్తతల్లినే మందలించి ఆమె అనేమాటలెన్నో నాపడవచ్చు. కాని భార్యను పరిఅని ఆమెచేత ఒకటిపడ్డా మానవోని. ఐనా కృష్ణమూర్తి భార్యనేకపిరాడు, "నోరు మూసుకో, ఒసే, అతిగా వాగక" అంటూ.

దీనికి మునలావిడజవాబిచ్చింది. "దాన్నెందుకు కోపంచేస్తావు, నాయనా! నన్నే కోపంచేయి. నేనే మీయిద్దరిమధ్యా కనిలాగా తగులుకున్నాను. ఈ కాలంలో కోడళ్ళువచ్చేలోగా అత్తలు ఏనూతయో, గోతయో చూసుకుంటే సుఖం. లేకపోతే—"

"ఎందుకమ్మా అలావుపన్యాసమిస్తావు. ఏమన్నాను నిన్ను!"

"నేనేమిస్తాను, నాయనా! వుపన్యాసాలూ. నా వంటిమీద సొమ్ములన్నీ అమ్మేసి బి.ఏ. దాకా చెప్పించాను నీకు. వుపన్యాసాలిస్తే నీవివ్వాలి. లేకపోతే టక్కుటమార్లన్నీ నేర్చిన నీభార్యఇవ్వాలి. నాదేమిటి, కాటికికాళ్ళు చాచివున్నాను."

"నిన్నేమీఅనలేదమ్మా! నేను."

"ఇంకా ఏమనాలి. అన్నీ నీభార్యచేతనే అనిపిస్తున్నావు. నాబ్రతుకిలాఐంది. ఎందుకు! నాదారినేను వెళ్ళిపోతాను ఏకాశో, రామేశ్వరమో. పెళ్ళాంరాగానే తల్లిముండ విషమైపోతుంది. నీకే కాదు, లోకం తీరుపోయే అంత." కన్నీళ్ళుపెట్టుకుంది ఆవిడ.

ఇంత గందరగోళం జరిగింతర్వాత ఏమిసహిస్తుంది తిండి; నాలుగు మెతుకులుకొరికి బయటపడ్డాడు కృష్ణమూర్తి.

ఇల్లాంటినాటకాలు కృష్ణమూర్తియింట్లో క్రొత్త కాదు. రోజుకు నాలుగైదుజరుగుతూంటై. పెద్దది ఎలాగైనా అత్తగారు, ఏమైనాఅంటే పద్మావతి వూరుకుంటే తప్పేముంది? అలావూరుకోటం ఆపిల్ల స్వభావంకాదు. మాటంటే అభిమానంజాస్తి. మాటకు మాట మళ్ళీ గిరాటువేయవలసిందే. చిన్నప్పుడు మరీ గయ్యాళిగంపగావుండేది. కోపంవస్తే తల్లిని రక్కిపెట్టేది. అత్తగారితో ఇంకా అంతదాకా రాలేదు. మాటల్లోనేవుంది వ్యవహారం.

ఇంట్లో యింత అల్లకల్లోలంగావుండటము కృష్ణమూర్తి మనస్సుకు చాలకష్టంగావున్నది. అందుమూలకంగా అతనిఉత్సాహం పూర్తిగా నశించింది. చదువుకునేరోజుల్లో తన భావిజీవితంగురించి ఎలాంటి హర్మ్యాలు నిర్మించుకున్నాడో అవన్నీ పాతాళానికి కూలిపోయినై. రసహీనమైన కట్టెల తనశరీరం, తన చుట్టూ అంధకారమేట. దుఃఖసముద్రంలో ఏకాకిగా తాను. విషాదగీతాలు వ్రాసుకోటం సాగించాడు.

౨

"ఏమండీ! రేపో ఎల్లుండో మానాన్నవస్తాట్ట. మాకడగొట్టుతమ్ముడి అన్నప్రాశనట; తీసుకవెళ్తానని వుత్తరం వ్రాశాడు. వెళ్తాను."

"ఏం వెళ్ళకపోతే అన్నప్రాశనమాగ్రానికి."

"వెళ్ళాలి. ఉదుగోతప్పించేలాగా మా రెండో తమ్ముడితర్వాత ఎనిమిదేండ్లకు పుట్టుకొచ్చాడు. మళ్ళీ ఒక్కసారి చూచిరావాలి."

"చూడటానికైతే మరోసారి పోవచ్చులే."

"మీ కేం, పడిచావమంటారు ఎన్నాళ్ళయినా ఇక్కడ ఈ చెరలో."

"ఏం చెరవచ్చింది నీకు?"

"మీ కేం తెలుస్తుంది. రోజల్లా వూళ్ళో సంచారం చేసివస్తారు. ఇంట్లో మీ అమ్మగారితో చీవాట్లు పడుతుండాలి నేను."

"ఏమో పెద్దది. ఆ మెమాటలకు నీవు సమాధానం చెప్పడంమానేస్తే తగాదా లేదుగా."

"అనుకున్నారా! అంతమాత్రం ఎదురు చెప్పడం చేతే కొంత ఆగివుంది. లేకపోతే మనిషిని అమాంతంగా మ్రింగివేస్తుం దావిడ."

"పద్మా! చెప్పుతున్నాను; మీ మూలకంగా నా ఆత్మశాంతి నశించింది. సుఖంలేదు."

"నేనుమాత్రం ఏం సుఖపడుతున్నాను?. ఒక చీరా! ఒక సొమ్మా! దేనికీనోచుకోలేదు. పైగా మీ అమ్మగారి శాపనార్థాలూ. చూచారా? నిన్న తలదువ్వుకుని, పొరపాటున పువ్వులుకూడా పెట్టుకుని, తలుపుదగ్గిర నిలుచుంటే, అంటుందికదా! రోజుకు రెండు మార్లు తలదువ్వటం నేర్చావే ఇప్పుడు. ఆ అంట్లు ఎవరు తోముతారనుకున్నావు—చూచి సహించలేని తనంకాకపోతే ఏమిటా మాట!"

"..............................."

"అసలు నా జన్మలో ఎప్పుడూ అంట్లు తోమి ఎరుగను. ఒక్కపనీ చేయదావిడ. అన్నీ నాకే పురమాయిస్తుంది. పైగా చివరకు ఆక్షేపాలూ, చీవాట్లూను. ప్రొద్దున్నే బావిదగ్గర బట్టలన్నీ పడుతూలుపడేలాగు వుతికి, వుతికి నేనువస్తే తానుకుత్రంగా గోడకానుకుని, కూర్చుని, చెంబులతో మమని పురమాయిస్తుంది. తానే చేయకూడదూ ఆపని నాకోసం నిలవవుంచక పోతే. అన్నిటికీ నేనే చావాలా?"

"............"

"మాట్లాడరేం. ఇంతకూ నేను మీ భార్యలా కనుపించడంలేదు. కూలిదానిలా ఉన్నాను. మొన్న మీ చెల్లెలుండిపోయిన రెండు నెలలూ మరీను. 'మంచి నీళ్లు తీసికోనిరా. దొడ్డికిపోవాల నీళ్లు తెచ్చిపెట్టు'—అన్నీ పురమాయింపులు; ఎవరున్నారనో వీళ్లదాసీ లిక్కడ."

"పద్మా! మాటపడితే పడిపోరు. నన్నుచూచైనా సహించుకోలేవా అదంతా? ప్రేమలేదూ నీకు నామీద.?"

"మీరు వేదాంతం చెపుతారు. అసలు మీలో పఋను లేకపోవడంచేతే అందరిచేతా నా కీమాటలు."

భార్యయొక్క పువ్యాపాలకు సమాధానం తోచ లేదు కృష్ణారావుకు. బి. ఏ. ప్యాసైతేమాత్రం ఆ తెలివితేటలు వస్తాయా? షేక్స్పియర్ మీదో, షెల్లీ నిగురించో లెక్చరైతే బనాయిస్తాడు నిరాఘాటంగా.

పద్మావతి ధోరణి ఎక్కువైపోతున్నది. ముసలావిడమీద తప్పిదాలెన్నో బయటకు వస్తున్నవి. ఇంట్లో అత్తాకోడళ్లిద్దరకూ, సహజంగా వాళ్ల మనస్సులు మారిపోయి సహింపుకలగాలిగాని, తనహితోపదేశం పనిచేయదని కృష్ణమూర్తి తలంపు.

ఇక నక్కడ నిలవకుండా చివాలునలేచి ఉత్తరీయం పైవేసుకుని బయలుదేరాడు. 'రమ్మని మానాన్నకు వుత్తరం వ్రాయమన్నారా?' అన్న పద్మావతి ప్రశ్న ఆతడు వినుపించుకోలేదు. తిన్నగా నల్లచెరువుచాయపోయి ఒడ్డుమీద కూర్చున్నాడు.

సాయంసమయం. మెల్లగావీస్తున్న పిల్లగాలికి చిన్నచిన్న అలలు లేస్తున్నై చెరువులో. అప్పుడప్పుడు నీటిపైకి తేలుతున్న చేపలకోసం రివ్వున పైనుంచి దిగుతున్నై పిట్టలు. కృష్ణుడు ఊహాప్రపంచంలో ఊగులాడుతున్నాడు.

"దానికి నామీద ప్రేమనున్నా. నాతలంపులన్నింటికీ విరుద్ధఫలితాలే కలుగుతూండడం నాదురదృష్టం. ఎన్నడూ అనుకోలేదు నాజీవితంలో ఇట్టి మనఃక్లేశాలకు పాలౌతానని.

ప్రతిహిందూగృహమూ అత్తాకోడళ్ల వాగ్వాదంతో మారుమ్రోగ వలసిందేనా? కొడుకుమీద

తల్లికీ, భర్తమీద భార్యకూ ప్రేమ వుండకుండా ఉంటుందా?. ఉంటే ఎందుకలుగుతుంది ఈగృహకల్లోలం.

వెతికివెతికి సౌందర్యరాశిఅని పెండ్లిచేసుకున్నానుదాన్ని. మనసారా ప్రేమిస్తున్నాను. దుఃఖమే నాకు మిగిలింది. ప్రేమించే ఆత్మకు దుఃఖమేనా పరమావధి?

ఇంతకూ కారణం ఎక్కువసంపాదించలేని నాఅసమర్థత అనుకుంటా. ఐతే ధనికుల ఇండ్లలో లేవా ఈకల్లోలాలు. అదీకాక ద్రవ్యానికీ సుఖానికీ సంబంధమేముంది?—కారణంలేదు. తన పెద్దరికం, 'అథార్టీ' చూపించాలని అడుగడుక్కీ తప్పులుఏరి చీవాట్లు పెట్టుతుంది అత్తగారు కోడల్ని. కోడలు మొదటకొంత సహించి వూరుకున్నా చివరకు ఎదురుతిరిగి తీరుతుంది. వాళ్లవైరం సహజం—ఎలుకాపిల్లులకూ, పిల్లీ కుక్కలకూ మల్లే."

ఒక బెస్తవాడు తనవలలోపడ్డ ఒకచేపను విసిరి ఒడ్డుకువేశాడు. కృష్ణమూర్తిసమీపానపడి అది గిలగిలా తన్నుకుంటున్నది. నిద్రలో కలగని లేచినవాడులాగా వులికిపడి నాలుదిక్కులూ చూచాడు ఒకసారి. సూర్యబింబం భూమిచాటుకు పోయింది. సాంధ్యరాగాలు మబ్బులలో ప్రతిఫలిస్తున్నవి. కృష్ణమూర్తిలేచి ఇంటివైపు సాగించాడు అడుగులు.

అతని ఊహలు తెగలేదు. తలవంచుకుని ఆలోచిస్తూ నడుస్తున్నాడు. వీథుల్లోఏమిన్నీ కాఫీహోటళ్ళలో గ్రామఫోనుపాటలైనా అతన్ని ఆకర్షించలేదు. అతను ఇంటికిచేరే సరికి బాగా చీకటిపడింది. అంతా అంధకారమే.

3

పద్మావతి పుట్టింటికిపోయి రెండునెలలైనా లేదు. పోయి తీసికొనివద్దామన్న వుద్దేశము కృష్ణమూర్తికిలేదు. ఆమెతండ్రివినా తీసుకవచ్చి దిగబెట్టిపోలేదు. ముసలావిడమాత్రం రోజూ కోడల్ని తీసుకరమ్మని పోరుతూనేవుంది. "ఉన్నన్నాళ్లూ ఇదరకూ పడదూ. ఇప్పుడు నాకే తీసికొనిరమ్మంటుందేమా?" అనుకున్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తిని ఆకర్షించేదేమీ పద్మావతిదగ్గర కనుపించదు. చివరకు తల్లిపోరువల్లనే అత్తగారింటికి పోయాడు. గుడివాడతాలుకాఆఫీసులో గుమాస్తా అతనిమామగారు.

అల్లుడిమర్యాద సక్రమంగానే జరిగింది. అత్తగారింటికివచ్చి మళ్లీవెంటనే వెళ్లడం బాగుండదని రెండురోజులైనతర్వాత మూడోనాడుసాయంత్రం ఆరుగంటలబండికి ప్రయాణమని చెప్పుతూ భార్యనుకూడా తీసుకవెళ్తానని వెళ్లబెట్టాడు.

అందుకు కృష్ణమూర్తిఅత్తగారు గొంతు సవరించుకుని ఉపన్యాసం సాగించింది. వాళ్లయింట్లో వ్యవహారాలన్నీ అసలు ఆవిడే సర్దుతూంటుంది. కచేరీలో పనిచేసి ప్రతినెలా ఒకటోతారీఖున జీతంరాళ్లు తెచ్చి తనచేతుల్లో పోసేటంతవరకే ఇంటాయన 'డ్యూటీ'. ఇక ప్రతివిషయంలో ఆమే ముందడుగు వేస్తుంది. భర్తమాట సాగనియ్యదు. ఆయనకేమీప్రపంచకజ్ఞానంలేదని ఆమెఊహ. అదితెలిసి ఆయన సాధ్యమైనంతవరకు మౌనముద్రలోనే వుంటాడు. ఆమె ఎంతచెపితే అంతా. కూర్చోమంటే కూర్చోటం. నిల్చోమంటే నిల్చోటం. గవర్నమెంటు వుద్యోగస్తుడైనా యింట్లో నౌకరుమాత్రుడే.

పద్మావతిని తీసుకవెళ్తానని కృష్ణమూర్తిఅనగానే మామగారు మాట్లాడలేదు. అత్తగారే మొదలుపెట్టింది. "అబ్బాయీ! నీవు ఎక్కువగా చదువుకున్నావు, మాఅమ్మాయి సుఖపడుతుందని నీకిచ్చాము. ప్రేగుతీసి నీమెళ్లో వేశామన్నమాట. ఇప్పటికైనా నీతప్పేమీలేదు. కాని మీఅమ్మదగ్గరమాత్ర మాఅమ్మాయి కాపురం చేయలేదు. అంతా నీకు తెలిసేవుంటుంది. అల్లారుముద్దుగా పనీ, పాటా చెప్పకుండా పెంచుకున్నపిల్లఅది. పదిహేనేండ్లైనా పూర్తిగా నిండలేదు దానికి. ఆరళ్లుపడలేదు. మీఅమ్మను విడిచి వేరే మీయిద్దరూవుంటే పిల్లను పంపటానికి మాఅభ్యంతరంలేదు. కాదంటవా, ఇక్కడే మాతో వుండు,

ఈలోగా మీమామగారు నీ వుద్యోగానికి ప్రయత్నిస్తుంటారు."

కృష్ణమూర్తికి కోపంవచ్చింది. తనతల్లినివిడిచి వేరే వుండాలా? అలాకాకపోతే పిల్లింట్లో అనాథలాగా పడివుండాలా? అసంభవము. ఆత్మగౌరవంలేనివాడా కృష్ణమూర్తి.

ఎంతో అవమానపడ్డట్లు సిగ్గుపడ్డాడు. కోపోద్రేకంకూడా కలిగింది. కాని అణచుకున్నాడు. ఎవరితోనూ ఎదిరించి పోట్లాడేశక్తి లేదతనికి. పాపం, అమాయికపునైతికుడు.

వెంటనే అక్కడనుంచి లేచిపోయి ఒక గుఱ్ఱపు బండి మాట్లాడితెచ్చాడు. బండివాడిచేత తన సూటుకేసు బండిలోపెట్టించాడు. తానుకూడా బండిలో ఎక్కుతూ చివరసారి అత్తగారింటివేపుచూచాడు. పద్మావతి గుమ్మందగ్గిరనిల్చొని చూస్తున్నది. అతని విశాలనేత్రాల్లో ఒక భయంకరమైన తెగువ వ్యక్తమగుతున్నది. పొడుగూ, పొట్టీకాని బలిష్టమైన అతని యౌవనాకారం ఆమెహృదయాంకితమై, ఆఛాయ ఆమె జీవితాంతంవరకూ మాసిపోలేదు.

జట్కావీథిమలుపు దాటిపోయింది. గుఱ్ఱము మెడకు కట్టిన గజ్జెలమ్రోతమాత్రం వినిపిస్తున్నది. పద్మావతి గుమ్మందగ్గిరే నిల్చున్నది. గజ్జెలచప్పుడు తగ్గింది. సన్నపడి సన్నపడి వినపించలేదు. పద్మావతి హృదయంలోమాత్రం మారుమ్రోగుతూనేవున్న గజ్జెలమ్రోత లోపలికిపోయింది పద్మ. పగలుగడచింది. చీకటిపడింది. ఆకాశాన నక్షత్రాలు మొలచినై. పద్మ హృదయంలో ఏదో భయంగావుంది. గుండె కొట్టుకుంటున్నది. కారణం ఆమెకే అవగాహనకాదు. ఆరాత్రిపనుల్లో తల్లికి సాయపడలేదు. భోజనంకూడా మానేసింది.

పది పదిహేనురోజులు గడచినై. ఒకనాడు పద్మావతి తల్లితో గుంటూరుపోతానని చెప్పింది. ఆమె కోప్పడ్డది. పద్మ పట్టుపట్టింది. 'అలాగైతే చూస్తూ చూస్తూ బావిలో దూకు' అంటూ విసుక్కుంది తల్లి.

పద్మావతి గుంటూరు చేరేసరికి, అక్కడ కృష్ణరావులేడు. పద్మావతి గుండెలు మరీకొట్టుకుంటున్నవి. వణుకుతూ సంగతంతా ముసలావిడతో చెప్పింది. ఇంటికిరాక కృష్ణుడుఎక్కడకుపోయాడో? అత్తాకోడళ్లిద్దరూ ఒకరిచేతుల్లో ఒకరు వాలి ఏడ్చారు.

# కన్నీటికణము

కర్లపాలెం కృష్ణారావుగారు

ఘోరకష్టాల ననిశంబు గోరుకొందు
నమితదుఃఖాల కేను యాహ్వానమిడుదు
శోకమే నాకు ముదమునుజూపగలదు
యేడ్చుకొలదిని బొందెద నెంతొహాయి
కంట నొకకొన్నిబిందువు ల్గారెనేని
రాలిపోవును హృదయభారంబుకొంత
నయనముల నీటిచుక్కలు నడచెనేని
శాంతిచేకూరు మిగుల నాస్వాంతమునకు
సుప్రసన్నతకలిమిచే నేనుమిగుల
కష్టమునగల్గుసుఖమును గాంచినాడ
శోకమునకున్న హాయిని జూచినాడ

నీకు వందనమమ్మ కన్నీటికణమ!
అలజడియెలేనిశూన్యంపుటర్ధరాత్రి
వెక్కివెక్కి నే నేడ్చుచు పొక్కుచుండ
బుజ్జగింపగవచ్చితీ వోజ్జవోలె
నీఋణంబెట్లుదీర్తు కన్నీటిధార!
హృదయకుహరానహత్తి యేమేమిగలవో?
అతివిషాదపరంపర లలముకొనెనో?
తీవ్రతామసముండెనో తెంపులేక?
సతత మానందసందోహచయమొగలదో
వివరముగతేల్చిచెప్పు వివేకమతివి
నీవెగా కెవ్వ రమ్మ! కన్నీటికణమ!

## గొల్లపిల్ల   కొండపల్లి గోపాలరావు హరిరామలింగ శాస్త్రిగార్లు

జిలుగుందోలుబిగింపు లేనడములో సింగారముంగార వె
ల్పలకుంద్రోసి స్వతంత్రమందగమనోల్లాసమ్ము లాలింపఁ జే
తులఁగ్రైసేసిన పూసగాజులపనల్ తూర్పెత్తు రంధ్రమ్ములం
బోలుపౌ పిల్లనగ్రోవి నూదికొనెదూర్పుల్ మేనినూగింపగన్.

అనుగకాయబుఱ్ఱ యొఱపై కుడిమూపునవ్రేల నెన్నడో
గాని వియోగమందనివికాగపుదుడ్డును చంకనొప్ప సం
ధ్యానవమల్లికాశుభగమైన మొగమ్మున స్వేదబిందుసం
తానముగ్రమ్మ నిన్నుగనిసన్ ముదమయ్యెడు గొల్లపిల్లరో!

పాలునుబియ్యముంగలిపి పాయసముంబచనమ్ము సేసి గో
పాలకుమారపంక్తులకు నడ్డనసేసెడికేళి నీవు శం
పాలతవోలె భాసిలెదు బాల! యటోగద యానుపూర్విన
చ్ఛీలల బుద్ధులెప్పుడు విశిష్టనిధుల్ పచరించు టబ్రమే!

నీమురళీనినాదమట నిద్వయసంగవిలోలలోకనో
ద్దామకిరాతమానసగతస్ఫుటవాంఛల వమ్ముసేసి హిం
సామలినాఘరాశి కెడసల్పెడి వారలనెంత పున్నెమో
యీమహనీయసంజ్ఞ నెపుడెట్టులు నేర్పితి జీవకోటికిన్?

పాణినికాజలేని పరిభాషలు నీమురళీనినాదమం
దానికగొన్నవమ్మ బరువైన యొడందకులోంగి యాలు దూ
రానఁబరించు లేగలఁదలంచి నినుంగని తోకలెత్తి యం
బానిసదమ్ముసేసెడి భవచ్చరితమ్ము పునీతమెంతయున్.

ఈమధుమాససంపదల కేకవిభోగినిపీవ గోగుపూ
ప్రామినకొప్పు క్రొంజిలుగుపైటపయిన్ పగమోరగిల్లి శం
పామిళితాంబుదమ్ముగతి భాసురమై మిఱుమిట్లుగొల్పె నీ
నేమములో జనించినవి నిర్మలగాథలు పద్యరూపముల్.

తల్లులఁబిల్లలంగలుపుదానవు నీమధురంపుదృక్కులన్
చల్లనిదైన యీపవనచారిమపీచులుపీచి నామదిన్
పెల్లుగఁబొంగఁజేసి తెగఁబెట్టి వినూత్నపథాంతరమ్ములం
దెల్లఁజరింపఁజేసెడిగదే! లతకూనరో; గొల్లపిల్లరో!

ఆమాగాణపుటెల్లదాటినవి నీయూలు అమ్మరో! చూడుమా!
పై మార్గమ్ము లగమ్యముల్గద మరల్పంజాలు నీగానసం
జ్ఞామాధుర్యము గ్రోల నాచెవుల కాజ్ఞాపించుమింకొక్కమా

రోమందాక్షవతీ! త్వదీప్సితము నేఁడో రేపు సిద్ధించెడున్.
ఈమలుసంజ నీకు ననుఁగేయని యీపెబురస్కరించి సు
శ్రీమతి యాంధ్రలక్ష్మి దయసేసిన స్వాగతపత్రికన్ ద్విజ
స్తోమము పాడెడిన్ చెవులతోఁదగు వియ్యముగాఁగ గొల్లపి
ల్లా! మరలింపు మాలగములన్ నిజమాతృవచోనుబద్ధవై.

# దివ్యబోధ

నగలులేవు నాకు నగుబాటటంచును
కుందఁబోకు మదిని కోమలాంగి!
యశమునిచ్చునట్టి యాభరణంబులు
కాంత! దలఁప నీకుఁ గలవుధరణి.
దేవుఁడిచ్చి దివ్యాభరణములు
దీప్తితోడ మిగులఁ దేజరిల్లు;
నరయఁగ నవి యెల్ల నమరు నీలోపల;
వేడ్కమీఱ వాని వెలఁది! వినుమ:
శిరమునధరింపనీకును చిగురుఁబోడి
పావనంబయినది పతిభక్తి గలదు;
దానికీడువచ్చు నగలు ధరణిలేవు;
దానిధరియింప నీకీర్తి దనరు నతివ!
తరుణి! తెలియంగరాదె శాంతంబనునగ:
దాని నీముక్కుచిగురెన దాల్పనగును;
దానిధరియించువారి కిధాత్రియందు
సాటివారలు లేరెందుఁ జాటిచూడ.
తెల్లపాడిముద్దులు తెరవ! తెల్లఁబోవ.
నవని చెంపసరముకన్న నధికముయి
వెలయుఁ గర్ణభూషఁగోనుమ వేడ్కమీఱ:
నదియు సదుపదేశశ్రవణంబ సుమ్మి
తమ్మిలపుగంధమున్ మించి తనరిదొప్పు-
కీర్తిగంధమునిచ్చును కీరవాణి!
సత్యభాషణమ్మనిదాని చాన! యంద్రు;
దాని సేవించువారలు ధన్యతములు.

కంటెబంగారుగొలుసుల కన్న జగతి
సుందరంబైనదీ నగ సుదతి! దలఁప;
కాంత! ప్రేమతోడాల్పుమి హృదయమందు;
భూతదయయంద్రు దీనిని బుణ్యమతులు.
వన్నెవన్నెగాజులు నీకు వన్నెఁదేవు,
దానమనియెడిదదియిచ్చు ధరణిఁగీర్తి;
హస్తభూషణంబదిసుమ్మి హంసగమన!
దానికర మొప్పఁగరమందుఁ దాల్పఁదగదె?
సింహపునడుమఁబోలు నీచిన్ని నడుము
నకు నలంకారమైయొప్పు నడుమువంచి
సర్వగృహకృత్యముల్ నీవు నిర్వహింప;
దానిసతతమ్ముధరింపఁ దనరుఁగీర్తి.
కడియముల్ వెండిపట్టాల కంటె నెన్న
ఘనతరంబయి యొప్పెడుఁ గలువకంటి!
ధర్మపథవర్తనంబంచు దానియంద్రు
దాని నీకాలినుంపుమి, ధన్యవగుదు.
తెరవ! యొక్కొక్కనగ నెంచి తెల్పనేల?
నీవు నీమేనధరియింప నిలువుతొడుగు
గల; దదియెతృప్తి; దీక్షతో పొలఁతిదాని
ననవరతమునుధరియింప నగునుయశము.
ప్రకృతిసిద్ధము లవి యెల్ల పడఁతి! వినుమ,
విద్యచేతను మెఱుఁగించి వినయమొప్ప
దీక్షతో నీవు ధరియింపు; దీప్తియలర
నతులసౌభాగ్యముల్ నీకు నగునుభువిని.

# దుర్గామందిరము

శ్రీమతి దేవులపల్లి జగదాంబగారు

౧

భామ యింట్లో వంటచేయుచుండెను. ప్రజానాథు "లా" పుస్తకము చదువుచుండెను. శ్యామ, మున్నా ఒకరితోనొకరు పోట్లాడుచుండిరి. "నాన్నా! నా బొమ్మ తీసుకొన్నది. చూడు" అన్నది శ్యామ. "అమ్మా! నా మిఠాయి శ్యామ తినేసింది" అన్నది మున్నా. ప్రజానాథు విసుగుజెంది "భామా! వంటింట్లో అటుకు పోవడమేనా, పిల్లల్ని చూడు" అనెను. "నా చేతిలో పనివున్నది. మీరు వకమారు చదువుకట్టిపెట్టి పిల్లలను వోదార్చ గూడదూ! యేం! నాకే గ్యారంటీ అనుకున్నారా! అన్నది భామ. ప్రజానాథు మారుమాటాడలేదు. కోపము అణచుకొనలేక దిగ్గునలేచి పుస్తకముమూసివైచి కాలేజీపార్కులోనికి వెళ్లిపోయెను.

౨

శ్రావణమాసము. సాయంకాలము. ఆకాశము నిర్మలముగా నుండెను. గ్రంథావలోకనముకంటె ప్రకృతావలోకనమే ప్రజానాథునకు ప్రీతిగానుండెను. కొంతసేపు ఆయన నీలాకాశము వీక్షించుచుండెను. కొంతతడవు బంగారుఛాయదాల్చిన వృక్షములను చూచుచుండెను: తరువాత విశాలమైన మైదానముపై ఆటలాడుకొను బాలురను గాంచుచుండెను. అంతట అపచ్చికబయలుపై ఒక కాగితపుపొట్లము కనబడెను. వెంటనే ఆపొట్లము యేమైయుండునో చూడమని మనసుబుట్టెను. తక్షణమే మనస్సాక్షి పొట్లము యేదైన నీకేమి? నీదికాదుగదా! అని సమర్థించెను. కాని మనసు మరల్చుకొనలేక లేచి, అచ్చటకుపోయి పొట్లము నెత్తి దానిలో నేమున్నదోయని విప్పిచూచెను. కన్నులు మెరసేటట్టు తొమ్మిదిగిన్నీకాసులు! వెంటనే ఆశబాధించెను. అయినను తెలివితెచ్చుకొని, అయ్యో! యిది పరులధనముకదా! యెవరుపొరపాటున జారవిడిచిరో దీనినిమనము దాచకూడదని అంతరాత్మ బోధించెను. ఈపొట్లము మనము యిచ్చటవిడచిపోయిన ఎవరైనను తీసుకొని పోవుదురేమో! అందుచే దీనిని జాగ్రత్తపరచి పోలీసుఠాణాలో నప్పచెప్పిన బహుశా హక్కుదార్లకు అందవచ్చును అని నిశ్చయించెను. ఆగడియయందు చీకటిపడుటచే ఠాణాకువెళ్లలేక ఉదయమువెళ్లుటకు నిశ్చయించెను. ఇంటికి దారిబట్టెను. ఇంటికిపోయినపిమ్మట భామ తనపెనిమిటిజేబులోని పొట్లమువిప్పి, తొమ్మిది గిన్నీకాసులుచూచి సంభ్రమముతో ఎవరివండీ? అని ప్రశ్నించెను. ప్రజానాథ్ నావి అని ఆమెచేతిలోనివి అందుకొనెను.

భామ:—హాస్యముమాని నిజముచెప్పండి.

ప్రజానాథ్:—తోవలో పొట్లముతో దొరికినవి.

భామ:—మీరు అబద్ధము చెప్పచున్నారు. ఎక్కడదొరికేయి?

ప్రజానాథ్:—నిజముగానే చెప్పచున్నాను. పార్కుదగ్గిర దొరికినవి.

భామ:—నాతోడు! అని పెనిమిటిచేతిలో కాసులులాగుకొనే ప్రయత్నము చేసినది.

ప్రజానాథ్:—చేతిలోనివి లాగుకుంటావేమి!

భామ:—యిచ్చెయండి. నాదగ్గిరవుంచుతాను.

ప్రజానాథ్:—కట్టిపెట్టు. పోలీసుఠాణాకుపోయి వీటివిషయమై రిపోర్టుచేసి దాఖలు చేయవలెను.

భామ:—(తెల్లబోయి) మనకు దొరికినధనమునకు రిపోర్టెందుకు?

ప్రజానాథ్:—వాహ్వా! ఈతొమ్మిదికాసులకొరకు మర్యాద పాడుచేసుకోమనెదవా?

భామ:—సరే. అయితే ప్రొద్దున వెళ్లండి, యీరాత్రివేళ మీరువెళ్లిన, తిరిగి వచ్చేసరికి చాలాలేటుఅవుతుంది. నేను వంటరిగావుండలేను.

వ్రజనాథ్:— మంచిది. ప్రొద్దుటే వెళ్లెదను. పొట్లము జాగ్రత్తగా ట్రంకుపెట్లో దాచుము అనిలేచి, భోజనము చేసి విశ్రమించిరి.

భామ:—చేతులారా దొరికినధనము రెండుకు వదిలేస్తారు. నాకు యిచ్చేయండి. చాలారోజులాయి నాచిధైయను చేయించుకుందామని మనసుఉన్నది.

వ్రజనాథ్:—నీమెడలో ఛేయినుకొరకు నామెడలో వురితాడు వేసుకోమంటావా?

౩

ఉదయముననే కాఫీతాగి పోలీసుఠాణాకుపోయే ప్రయత్నములో వ్రజనాథ్ బట్టలు వేసుకొనుచుండెను. అంతలో అతనిస్నేహితుడు, మున్షీగోరేలాల్ వచ్చి తన సంసారపుచిక్కులుచెప్ప మొదలుపెట్టెను. చివరకు తాను చాలాడబ్బు యిబ్బందిలో ఉన్నాననియు యేలాగైనా, రు 30-లు సర్దుబాటుచేయక తప్పదని దీనముగా ప్రార్థించెను. వ్రజనాథ్ భాగ్యవంతుడు కానప్పటికి స్నేహముకొరకు, డాబుకొరకు తను యిబ్బందిపడైనా సర్దుతూవుండేవాడు. కాని నిర్మొగమాటముగా తను యివ్వనని తనవద్ద లేదని చెప్పలేకపోయేవాడు. అంతట భామవద్దకువెళ్లి "నీవద్ద ముప్పైరూపాయిలువుంటే యియ్యవలెను. మున్షీగోరేలాల్ అడుగుచున్నాడు" అనెను.

భామ:—నావద్ద రూపాయిలులేవు.

వ్రజనాథ్:—వుంటాయి నిశ్చయంగా, గమ్మత్ చేస్తూయున్నావు.

భామ:—గమ్మత్తే అనుకోండి!

వ్రజనాథ్:—అయితే అతనికి యేమనిచెప్పమంటావు?

భామ:—యింట్లో రూపాయలులేవని చెప్పండి. మీచేతకాకుంటే నేజెప్పెదను.

వ్రజనాథ్:—చేతకాకపోవడమేమి? నేను చెప్పగలనుగాని నమ్మడు.

భామ:—నమ్మకపోతే పోనీయండి. మనకేంబాధ?

వ్రజనాథ్:—రాత్రీపగలు స్నేహముగావుంటూ అంత నిర్మొగమాటముగా వుండలేను.

భామ:—సరే! మీకు యేలాగుతోచుతే ఆలాగుచెయ్యండి. నాకు తెలియదు. నాదగ్గిరలేవని చెప్పేను-లేవు.

వ్రజనాథ్చాలావిచారించి లేవనిచెప్పుటకు సిగ్గుపడి తనసందుకుపెట్టెతీసి అందులోని రెండుగినీ్నలు యిచ్చి "రేపుమళ్లీ నీవుతప్పకుండా యిచ్చివేయవలెను. లేనియడల నాఆబోరుదక్కదు"అనెను.

గోరేలాల్ అవి జేబులోవేసుకొని 'ఎంతమాట! అవుసరంగడపేవు. రేపు సాయంకాలము కచేరినుండివస్తూ తోవలో నీసొమ్ము నీకుయిచ్చివేస్తాను" అనిలేచి తనయింటికి వెళ్లిపోయెను.

౪

ఆరోజు వస్తుతారీకు. వ్రజనాథ్ సాయంకాలము 5-ఘంటలుమొదలు వీధివైపు కళ్లుకట్టుకొనెను. చేతిలోవున్న వుత్తరము చదువుటకుకూడా తీరికలేక ప్రతి 5-నిముషములకు వీధిలోనికిదృష్టి సాగిస్తూయుండెను. అట్లాగాచూస్తూవుండగానే ఆరుకొట్టింది. విసుకుజెంది కాళ్లునొప్పియెత్తి కుర్చీతెచ్చుకొని వరండాలో గూర్చొని యెదురుచూచుచుండెను. 7-గంటలు వినబడెను. ఎక్కడా గోరేలాల్ వత్తాలేదు. కుర్చీనుండి లేచి వీధిలో రోడ్డుపైవచారు మొదలుపెట్టెను. దూరమునుండి యెవరో గోరేలాల్ మోస్తరుగా టోపీపెట్టు

కొని వస్తూయుండె కొంచెంతఆశపడి దగ్గరకు వచ్చినతర్వాత తెల్లబోయి వెనుకకు మరలిపోయెను. రాత్రి 9-గంటలవరకూ ఇట్లు వీక్షించెను. అంతట యింటిలోనికిపోయి మతిలేనివానివలె భోజనముచేసి దీర్ఘాలోచన మొదలుపెట్టెను. బహుశా గోరేలాల్ పరాకున మరొకదారిని ఇంటికి పోయియుండునని నిశ్చయించి వానియింటికిపోవుట బయలుదేరి అడుగులు లెక్కపెట్టుకొనుచు వీధిలోనుండి గోరేలాల్ యింటివైపుచూచెను. ఒకవేళ గోరేలాల్ తనను చూచి యింతరాత్రివేళ సొమ్ముకొరకువచ్చితి ననుకొనునేమో అని మొగమాటముపడి వెనుకకు పదిఅడుగులువైచి తిరిగి తనలో ధైర్యముతెచ్చుకొని, ఆయనను చూచుటకువచ్చితినని సొమ్ముకొరకుకాదని చెప్పవచ్చునని దృఢపర్చుకొని మళ్లీ గోరేలాల్ గుమ్మములోనికివెళ్లి మెల్లగా తొంగిచూచెను. గోరేలాల్ భోజనముచేసి తాంబూలము వేసుకొనుచుండెను; ఆయనభార్య జీతంయావత్తూ ఖర్చుఅయిపోయెగదా ప్రజనాథ్ గారిసొమ్ము యెట్లుతీర్చెదరు అని ప్రశ్నించెను. ఇప్పుడేమితొందర! రేపు శెలవుపై పోవుచున్నాము. వచ్చేసరికి మూడునెలలు రమారమీ అగును. అప్పటిమాట చూచుకోవచ్చును. అని జవాబుచెప్పెను. ఆమాటలు ప్రజనాథునకు వజ్రపుపోటులవలె తగిలెను. ఎవరో ముఖముపై చెంపకాయ వేసినట్లు కళ్లుజిగేల్మనెను. వరండానుండిదిగి నిరాశ, కోపము జట్టుకొని యింటికి ధ్యాసములేకుండా చేరుకొనెను.

౨

ప్రజనాథునకు రాత్రి నిద్రపట్టలేదు. ఒకప్పుడు గోరేలాల్ ధూర్తతనమునకును, ఇంకొకప్పుడు తన అమాయకత్వమునకును కోపము తెచ్చుకొనుచుండెను. అహో! యేబీదవారిధనమో కదా! ఈసొమ్మువిషయమై వారు యెట్టియిబ్బంది పడుచున్నారో! అయినను దీనిగురించి యిప్పుడు కోపించినగాని విచారించినగాని లాభములేదు. భామమొదటే యివ్వవద్దనిపోరినది. జీతంలో సొమ్ము మిగల్చవలెనంటె ఖర్చులకు సమముగా సరిపోవుచున్నది. ఏదైనా కఠినపరిశ్రమచేసి వొక్కమాసములో ఈసొమ్ము పూర్తిచేయవలెను. కోర్టుకాగితములు తెచ్చి రాత్రిళ్లు తర్జుమాచేసి రోజుకిరూపాయి సంపాదించినను నెలనాటికి గోరేలాల్ కియిచ్చిన సొమ్ము పూర్తికాగలదు. అని నిశ్చయించి పగలు తనమామూలుపనులు చూచుకొంటూ, రాత్రి పన్నెండుఒంటిగంటవరకూ కాగితములు తర్జుమాచేయుచుండెను. భామ యీశ్రమచూచి సహించలేక "మీరు ఇంతగా కష్టపడిన మీశరీరమునకు జబ్బుప్రవేశించును. చాలా బాధపడిపోతారు. మీకు సొమ్ముఅవసరమైనయెడల నావస్తువయేదైన తాకట్టువుంచి సొమ్ముసర్దుబాటు చేసుకొనుడు. వ్యవహారముపట్ల మొగమాటపడకూడదు. మీరు అప్పుడే నీరసించిపోయినారు అనెను. అప్పుయివ్వవద్దని భామచెప్పినను వినక గోరేలాల్ కుయిచ్చి తిరిగి భామవస్తువ తాకట్టుంచుట ఆయనను అవమానకరముగాతోచెను. అందుచే ఎట్టిశ్రమలనైన తను పొందుటకు దృఢపర్చుకొనెను. ఇట్లు 25-దినములు శ్రమపడి రు 25 లు సంపాదించెను. యింక 5-దినములలో సొమ్ము పూర్తిచేయుదునుగదాయని సంతోషించుచుండెను. కాని తానొకటితలచిన దైవమొకటితలచునన్నట్లు 26-వ దినము సాయంకాలము యింటికిరాగానే చలితో ఉష్ణమువచ్చెను. రాత్రిభోజనము చేయలేనని భామతో చెప్పెను. మామూలుగా కాగితములు తర్జుమాచేయుటకు కూర్చొనెను కాని ఉష్ణతీవ్రము సహించలేక మంచముపై సొగిలబడెను. ఆవుష్ణము రెండుదినములవరకు వదలలేదు. వైద్యునకు కబురుపెట్టెను. వైద్యుడు మందులుయిచ్చుచుండెను. ఇంట్లో డబ్బు వదలిపోవుచుండెను. కాని జబ్బువదలలేదు. ఈమాదిరి 20-దినములు గడచేసరికి డాక్టరుగారి బిల్లుఅద్దెలక్రింద మందులఖర్చులక్రింద నూరురూపాయలు ఆయెను. ప్రజనాథ్ మంచముపై దీనదృష్టులతో నీరసముగా పడియుండెను. భామకు యేమియుదారితోచలేదు. దిగులుచెందుచుండెను. అయ్యో! యేబీదలధనము మనయింట్లోనుంచబట్టె వాళ్లవుసురు మనకు ఈవిధము

నాతిగిలెనాయని భయపడుచుండెను. ఆపదలప్పుడు దైవముతప్ప దిక్కెవ్వరుతోచరు. చివరకు దుర్గామందిరమునకుపోయి ఆమెనుపూజించి తనభర్తను నిమ్మళింపజేయుటకు శరణువేడ నిశ్చయించెను. ఆదినము ఉదయమునసే పెనిమిటికి మందుయిచ్చి తనబిడ్డలనిద్దరిని వెంటనిడుకొని దుర్గామందిరమునకు జనెను. లోపల దేవిని జూచుటతోడనే ఆమెకు పకవిధమైన భయముజనించెను. కండ్లుమూసుకొని చేతులురెండుజోడించి “తల్లీ! మా అపరాధము క్షమించి నా పెనిమిటికి నిమ్మళింపజేయుము”అని దీనముగా వేడుకొనెను.

అంతట “పరాయధనము యిచ్చివేయుము నీకు నేమముచేకూరు”నన్నట్లు ఆమె చెవులకు వినబడెను. అంతలో వేరొకస్త్రీవచ్చి నిరాశతో శోకదేవతవలె, దేవిమూర్తికి ఎదురుగా నిలువబడి రెండుచేతులు జోడించి బిగ్గరగా “తల్లీ! నాధనము నెవరైతే దాచియుంచినారో వారికి సర్వనాశనముగావించుము. నేను, నాపిల్లలు మలమల మాడుచున్నాము”అని విలపించెను. ఆపలుకులు భామచెవులను ములుకులవలె తగిలెను. దేవివైపు చూచేసరికి తీవ్రముగా “పరాయధనము దాచకుము. ఇచ్చివేయుము. లేనిచో నీకు సర్వనాశనము సంభవించును”అనుచున్నట్లు ప్రతిధ్వనించెను. భామలేచి నిలువబడి ఆస్త్రీతో అమ్మా మీసొమ్ము నెవరైనా తీసుకొన్నారా?

స్త్రీ:—ఔను. అవునమ్మా.

భామ:—యెన్నిరోజులక్రిందట.

స్త్రీ:—రమారమి నెలపదిహేనురోజులక్రిందట.

భామ:—యెన్నిరూపాయిలు?

స్త్రీ:—పూరా నూటయిరువై.

భామ:—యేలాగు పోయినవి?

స్త్రీ:—యెక్కడనో పొట్లముతో జారిపడిపోయెను. నాభర్త పటాలములో సిపాయిగా పనిచేసి పరలోక ప్రాప్తింజెందెను. యేడాదికి అరవైరూపాయిలు “పెన్షన్” మాకుదొరుకుచున్నది. రెండేళ్ల “పింఛను” పక్కనూరు దొరికినది. ఖజానాలో గిన్నీకాసులు యెనిమిదియిచ్చిరి. అవి పొట్లముచుట్టి మొలను పెట్టుకొంటిని. ఎచ్చట జారెనో తెలియదు.

భామ:—ఆ పొట్లము నీకు దొరికిన నాకేమి యిచ్చెదవు!

స్త్రీ:—లావుయియ్యలేను. ఇరవై రూపాయిలు యిచ్చెదను.

భామ:—రూపాయిలు యేమిచేసుకొనెదను? అంతకంటె విలువైన పదార్థముయియ్యి.

స్త్రీ:—నాజన్మవున్నంతకాలము మీపేరు పొగడుకొంటాను.

భామ:—నాభర్త జబ్బుతోనున్నారు. ఆయనకు నిమ్మళముగానుండుటకు ఆశీర్వదించుము.

స్త్రీ:—ఆయనకు నాసొమ్ము దొరికినదాయేమి?

భామ:—ఔను. ఆరోజు మొదలు మీకొరకు ఆయన వెదకుచునే యున్నారు.

ఆస్త్రీ సంతోషములో కూర్చొని కొంగుచాపి, దేవిని “మాతా! ఈమెను, కాపాడి ఆరోగ్యప్రాప్తి చేయుము” “అని ప్రార్థించెను. అప్పుడు భామ దేవివైపు చూచేసరికి కరుణదృష్టితో “నీవు యింటికిపొమ్ము. నీకు శుభమగును” అనునట్లుతోచెను.

౬

ఒకనాటి సాయంకాలము ప్రజనాథు, అతనిభార్య టాంగాపై పూర్వపరిచితురాలగు ఆస్త్రీ యింటికి ప్రయాణమైపోయిరి. సొమ్ము చాలావరకు మందులక్రిందను డాక్టర్ల ఫీజులక్రిందను వ్యయమైపోయెను. గోర

బాలునకు యిచ్చిన రెండుగినీ్న కాసులసొమ్ము పూర్తిచేయుటకుతోచక విచారించుచుండెను. అది భామచూచి తన కమ్మలజత అమ్మివేసి ఆసొమ్ము పూర్తిచేయుటకు భర్తను ప్రోత్సహించెను. కమ్మలజతను విక్రయించి మొత్తము పూర్తిజేసిరి. ఆవస్తువు చేయించినవాడైనా ఆమె అంత సంతోషపడలేదు. ఎనిమిదిగినీ్న కాసులు తులశమ్మ (ఆస్త్రీపేరు)కుయిచ్చివేసి విలంబమునకు క్షమింపప్రార్థించిరి. ఆమెయు భర్యాలను మనస్పూర్తిగా ఆశీర్వదించెను. శెలవుగైకొని గృహోన్ముఖులైరి. వ్రజనాథు యింటికిచేరి వాలుకుర్చీపై విశ్రమించెను. ఇంతలో గోరేలాల్ తనస్నేహితుని చూచుటకువచ్చెను. వ్రజనాథ్ ఆయనను చూచి మొగము త్రిప్పుకొనెను.

గోరేలాల్:—సోదరా! మీశరీరములో ఎట్లున్నది.?

వ్రజనాథ్:—ఇప్పుడు నింపాది గాఉన్నది.

గోరేలాల్:—నన్ను క్షమింప ప్రార్థన. మీసొమ్ము వాపసు చేయుటకు ఇంతఆలశ్యము చేశినందుకు మిక్కిలి సిగ్గుపడుచున్నాను. కారణము. ఆరోజునే యింటినద్దినుండి అర్జంటుగారమ్మనమని ఉత్తరమువచ్చినది. తమతో చెప్పుటకు టైములేకపోయినది. ఇప్పటివరకూ అచిక్కులనుండి తేలలేకపోతిని. ఇదిగో తమ సొమ్ము తెచ్చితిని.

పై శాంతవచనములు వ్రజనాథు కోపముచల్లార్చెను. చాలాజబ్బుపడ్డాననియు,ప్రస్తుతం తెరిపిగానున్నదనియు చెప్పెను నాసొమ్ము విషయమై సర్దుకొనుటకు మీరు కష్టపడియుండవచ్చును. తమకు అవకాశములేనిచో ఇంకొకప్పుడు యియ్యవచ్చును అని స్నేహభావముచూపెను. గోరేలాల్ వందనములుచేసి శలవుతీసుకొనెను. రూపాయిలు పట్టుకొని లోనికిపోయి వ్రజనాథ్ భామతో చెప్పెను "గోరేలాల్ యిదిగో రూపాయలు యిచ్చివేసెను."

భామ:—ఆరూపాయిలు మనవికావు. తులశమ్మవి. పరాయధనము దాచినందువల్ల బుద్ధివచ్చినది.

వ్రజనాథ్:—తులశమ్మసొమ్ము పూర్తిగాచెల్లించితివే!

భామ:—యిచ్చివేస్తేమాత్రము! ఇదిఆమె ఆశీర్వాదఫలితము.

వ్రజనాథ్:—అయితే నీకమ్మలజతమాటయేమి!

భామ:—కమ్మలజత చెవులకుఅక్కరలేదు. దేవిపలుకులు కలకాలము చెవులలోనుండి పోయినవి.

—అనువాదము.

# పుత్ర ప్రేమ

తాయి శేషగిరిరావుగారు

వీరు డొకడర్జునునికుమారునివలె
నాలమొనరించి రణసీమ నంతరించె
అతనిదేహమునీక్షించి యతనిభార్య
కడిదివగచేత కన్నీరు గార్చుచుండె.
ఆమెనీక్షించి చేడియలంద రప్పు
డేడ్వకుండిన నక్కాంత యీల్గుననుచు
నామెనెట్లున నేడుచు నటులజేయు
గట్టియత్నంబుసలిపిరి పట్టుదలను.
తొలుత నావీరుగుణగణంబులనుజెలులు
పొగడవొచ్చిరి కాని యామగువమాత్ర

మొక్కసారియు మాటాడకుండె నకట!
కదలకుండెను స్వర్ణవిగ్రహమువోలె
అంత మరియొకనెలజాణ యచటజేరి
ప్రబలవీరుని మోముపై బట్టదీసె
ఎంతజేసిన నక్కాంత ఏడ్పులేక
కదలకుండెను స్వర్ణవిగ్రహమువోలె.
ముసలిదాదియొకతె వానిపుత్రుదెచ్చి
యామెపాదంబులందుంచునంత నామె
కన్నుగవ నశ్రుకణములు గార్చజొచ్చె
"మనెద తనయుడ! నీకొర" కనుచునేడ్చె.

# శిథిలప్రేమ

ఓలేటి సీతారామమూర్తిగారు

[ప్రణయజీవులై పక్షిదంపతులవలె పాడుకొందామనుకున్నారు అనార్కాళీసలీములు. సూక్ష్మబుద్ధియగు అక్బరుచక్రవర్తి వీరిప్రేమప్రవృత్తినిగ్రహించి ఉగ్రుడైనాడు. అనార్కాళి బంధింపఁబడెను. తుద కామె నిరాశచే ఆత్మహత్యకు పాల్పడెను. భగ్నహృదయుఁడగు సలీము ఆమెగోరీపై వలవలవాపోయినాఁడు]

జాలిగఁ బ్రేమభిక్షకయి సాచితి నాకర మామహూర్తమం
దే లలితార్ద్రయౌవనము నెల్లను నాకయి ధారవోసి ము
గ్ధాలసవీక్షహాసరుచి హర్షవిభూతి నొసంగినా వనా
ర్కాళి! తదీయలీలలు తలంచిన నాయెద వ్రక్కలయ్యెడున్.

మొగ్గఁగట్టిన మనప్రేమపొలుపు పూవు
దళములను విచ్చి నగఁబోవు తరుణమందె
యీ హతాశాగ్ని నెలకొని హృదయవీథి
శిథిలశోభార్తి నిట్టూర్పు సెగలనించె.

నాయెద నీసుధాప్రణయనందనపుష్పరహఃపథాన నా
శాయుతనీలిపక్షముల నల్లనఁజేరి విహారసౌఖ్యశో
భాయుతలీలల న్విరియఁ బ్రాణసఖీ! మనప్రేమవృత్త మె
న్నోయుగముల్ హసించునని యూరక నేఁదలపోసితింగటా!

అమృతవికసితప్రేమశూన్యమ్ము నాదు
హృదయమనియెంచి శోషిల్లి యేడ్చియేడ్చి
కుసుమకోమలి! బ్రదుకెల్ల కూలిపోవ
వెడలితవ? నాఁటిరజనీగభీరవీథి.

మనతొలికౌఁగిలింత నవమాధురు లింకను నీసమాధిలో
నెనసి వెలార్చి, పొలుచుఁగృశించెను నీదురదృష్టజీవిహృ
ద్వనము దహించుచున్నవి; సుధామధురాంగి! భరింపలేను, శాం
తినిబడయంగ నీకరణి నీకయి యేడ్చెద వేయిగొంతులన్.

# మాతాపుత్ర ప్రహసనము

శ్రీమతి నుసర్లలక్ష్మీనరసమాంబగారు

కామాక్షమ్మ వంటచేస్తూ 'బ్రహ్మం!' అనిపిల్చింది-పైమీద గుడ్డవేసుకుని యెక్కడకో వెళ్లాలనుకుంటూవున్న బ్రహ్మం ఆపిలుపుతో వంటయింట్లోకి వచ్చాడు. 'రా కూర్చో యెక్కడికి వెడుతున్నావు?' అంది కామాక్షమ్మ. 'యెందుకుపిల్చావ్' అన్నాడు బ్రహ్మం.

కా:—విన్నా, మాట్లాడాలని పిల్చాను. నీపెళ్లామేదీ?

బ్ర:—దొడ్డికివెళ్ళిందికాబోలు, యెందుకు?

కా:—అబ్బేనాకెందుకు? పనిచెయ్యనా పాటచెయ్యనా? పూరికేఅడిగాను దానినడతేమీబాగాలేదు. నీతో కాస్త చెపుదామనేపిల్చాను. నేను చెప్పితే బొత్తిగావినవు.

బ్ర:—ఏంచేసిందేమి? చెప్పు చంపేస్తా.

కా:—ఏంచేసేదేమిటి? ఏమన్నాఅంటే అత్తగారు కోడంట్రికము పెట్టింది అంటుంది. మధ్యనిష్టూరం నాకు. మీరూ మీరు బాగానేవుంటారు. నువ్వులు నూనె పక్కటే తెలుసులాడే వేరుగాని.

బ్ర:—ఏంచేసిందో చెప్పు డొక్కచీరేస్తా.

కా:—ఆ! చీరావులే. ఆ తెలివితేటలు నీదగ్గరవుంటే అది యిల్లాయెందుకుంటుందీ? నీకంట్లో కాయిఆనీ, నీవు అందమైనవాడవుకావనీ, అప్రయోజకుడవనీ, అమాయకుడవనీ కీలుబొమ్మనాడించినట్లు ఆడించేస్తోంది. నీకు తెలియడంలేదుకాబోలు.

బ్ర:—అది చేసేపనులు అన్నీ చెప్పు. ఈవాళ నా మజాకాచూడు.

కా:—ఏమిచెప్పను? మాలకూడు యింట్లోకలుస్తోంది. మడికట్టుకుని అన్నంతినమంటే తినదు. చాకలిది తెచ్చినబట్టే శుభ్రంగావుంటుందిట. విన్నావా? మొన్న వైద్యుడు చేయిచూస్తే ఆబట్టతో యిల్లంతా ముట్టుకుందిగదా, డాక్టరు బ్రాహ్మడైతేమాత్రమేమి? వాడెంతమందిముట్టువాళ్లని, బాలింతవాళ్ళనీ, చూసివస్తాడో! గాజులు మనకి పనికిరావేఅంటే వినక మొన్న గాజులు వేయించుకుందిగదా పైగా గాజులసెట్టిని ముట్టుకుందిగదా స్నానమేనా చెయ్యలేదు. ఇట్లాఅయితే యెల్లాచెప్పు, నాయనా! అంటే కోపంవస్తుందిగాని మడీఆచారం అసలేలేదు సరిగదా ప్రొద్దున్నే కాఫీ అలవాటుగదా. అది లేకపోతే వుండలేదట. విన్నావా? కాళ్లతీపులట, కడుపుమంటలు, తలనొప్పెట. ఏకాదశిలేదు, అమావాశ్యలేదు, పండగలేదు, పర్వములేదు. దిక్కుమాలినసంత. ప్రొద్దున్నే త్రాగికూర్చుంటుంది. దీనికాఫీతగలెయ్య. డబ్బుఅంతా దీనికోసమే అయిపోతోంది. ఎక్కడనుంచివస్తోందో యేమీఅక్కర లేదుగదా, నన్ను గానట్టు పూరుకుంటుంది. ఆకాఫీ నేతెచ్చియియ్యనంటే నిన్ను చంపేస్తుందేమిటి? నీవు అనవుగాని. నాకెందుకులే అయినా మీరూ మీరూపకటే. నీవుకూడా అలవాటు చేసికున్నావు గదా ఆపాడుకాఫీ.

బ్ర:—సంగతంతా విన్నానుగా, దానిపనిచేస్తానుగా.

కా:—అందుకనేపిల్చాను. (కళ్లనీళ్లుపెట్టుకుంటూ) చిన్నప్పటినుంచీ అష్టకష్టాలుపడి పెంచి పెద్దచేసి యీదౌర్భాగ్యురాలిచేతిలో పెట్టేను. అది వచ్చినతర్వాతే నాయింటికి లక్ష్మితొలగింది. ఆమారాజు చచ్చి స్వర్గాన్నున్నారు. ఆయిన చెప్పనేచెప్పేరు యీపిల్ల మనకత్తులోకలవదని. నీవంటే ఆపేక్ష, గౌరవం లేనేలేదు దానికి. నేచస్తే అన్నమేనా పెడుతుందో పెట్టదో. నీవు అమాయకుడవు రామచంద్రుడివంటివాడివి. నిన్ను తీసుకువెళ్ళి ఆరాక్షసికిచ్చి పెళ్ళిచేశాను. (కళ్ళుతుడుచుకొని) అయ్యో! రామా! యేంకట్లు? యేంబొట్లు? యేమిసిగలు? యేమిపువ్వులు? యేమిజాకట్లు? దీని షోకుమండా!

నిండాపన్నెండేళ్లు వెళ్లాయో లేదో అప్పుడే యింతపోకిళ్లా నేర్చిందో. సానింట్లో పుట్టవలసిందే కాని సంసారింట్లో పుట్టాలసింది కాదురా నాయినా! నీకెక్కడదొరికిందో. ముందు అబ్బ స్త్రీపిల్లమనకొద్దో అంటే 2000 వేలు కట్నానికాసించి మీనాన్నే చేశారోయి. తండ్రీ! మనం దానితో వేగలేకుండా వున్నాము. నడుస్తూనడుస్తూకూడా పాటలు పాడుతుందిగదా. సిగ్గేనాలేదు. ఏపిల్లలేనా పాడమంటే పాడకుండా యెంతో బెట్టుచేస్తారు. ముచ్చటవుతుంది. అల్లాకాదిది. పాడమన్న దేతడవు. సిగ్గుంటేనా? ఇంతసిగ్గుమాలినదాన్ని యెక్కడాచూడలేదు. మొన్న చెరువుదగ్గర నాపేరుచెప్పి అవిడకోడలు యెంచక్కాపాడింది వాళ్ళయింట్లో అని యెవ్వరో కాపులు చెప్పుతుంటే తల పొట్టలో పెట్టుకున్నాను. నాకెంతో సిగ్గనిపించింది ఇది-అంతా నాకర్మం-నీవుచెప్పి నీవొద్దిలో వుందుకోనే తెలివితేటలు నీకు లేందే అదెల్లాలొంగుతుంది-మావాడు మేము గట్టిగామాట్లాడినాయెరగను - యెల్లాచేసుకుంటావో నీయిష్ట మబ్బాయి! జాగ్రత్త.

రామబ్రహ్మముభార్య కాపురానికి రాకుండానే తండ్రి చచ్చిపోయాడు. తల్లివద్ద రామబ్రహ్మానికి భయమెక్కువ. అవిడచెప్పినమాటకి యెదురుచెప్పడు. ఆమెవాక్యములు వేదవాక్యము లతనికి. కామాక్షమ్మ పైకి మాట్లాడనట్లే వుంటుంది కాని ఆమె అనుకున్నపని సాధించితీరుతుంది. అసాధ్యురాలు అంతాకుత్రిమమే కొడుకు అమాయకుడుకదాఅని కోడలిమీద లేనిపోనివి కల్పించిచెప్పి కొట్టిస్తూవుంటుంది. వాళ్ళదొడ్డిలో వేపచెట్టువుంది. అక్కడికి తీసుకువెళ్ళటం. ఇటికెలురెండు వేసుకు కూర్చోటం. తల్లీకొడుకులు తలలోతలలు పెట్టుకొని వాలుకలు కొరుక్కోటం. తర్వాత మునుగుసవరించుకుంటూ చల్లగా ఆమె యింట్లోకిరావటం. ఆఅబ్బాయి వెళ్ళి ఆఅమ్మాయి తాళంపట్టడం-యిది రోజూ మామూలు-అట్లాజరుగుతూన్నా అప్పుడప్పుడామె కొడుకుమీద కోప్పడి-నీవు చచ్చేవు. నీకు ధైర్యములేదు-అంతానాసొమ్ము తినేవాళేగాని నామాట వింటారా? నీకు నే విషమైపోయాను-పెళ్ళాంవలలో చిక్కుకుపోయావు-నీవు దద్దమ్మవు-అనిసాధింపారంభిస్తుంది-యికపద్మావతి సంగతేమిటంటే పద్మావతి. చిన్నపిల్లప్పుడే 6 సంవత్సరముల వయస్సునందే ఆఅమ్మాయి పితామహిచూడాలని వివాహంచేశారు. చాలాడబ్బుగల సమ్మంధమేయేరారు-రెండువేలు కట్నంయిచ్చి లాంచనములు జరిపి వైభవముగా పెండ్లిచేశాడామెతండ్రి. పద్మావతి పన్నెండుసంవత్సరముల వ్యక్తురాలై అత్తవారింటికి వచ్చింది-ఈపన్నెండుసంవత్సరముల పిల్లకి సంసారములో ఎంతఅనుభవముంటుందో వూహించుకుందాము. పైగా కాపురానికి వచ్చేవరకూ స్కూలుకువెళ్ళి చదువుకుంటూవుందిగాని యింతచాకిరీచేసి బండలాపడి వుండేదికాదు-ఆఅమ్మాయి మంచితెలవిగది. పాట, పద్యం, చదువు, కుట్టు అన్నీబాగావచ్చును. చిన్నపిల్ల అయినా భారతభాగవతాలు చక్కగాచదివి తండ్రిని నాయినమ్మని కూర్చోపెట్టి అర్థంచెప్పేది. ఉన్నవూరు బస్తీయేగనక అనేకగ్రంథాలు తండ్రితెప్పించి చదివించేవాడు కావుననే పద్మావతి పన్నెండు యేళ్ళకే మంచిజ్ఞానంసంపాదించింది-అత్తవారింట్లో ఈఅమ్మాయి చాలాఅణుకువుగా వుంటుంది కాని అత్తగార్కి నచ్చలేదు-పెనిమిటి తెల్వితక్కువవాడు. పైగా తల్లియెంతచెప్పితే అంత. ఆఅబ్బాయికి పెండ్లయి కొంతకాలానికి మసూచికంవచ్చి కంట్లోకాయికూడావేసింది. మనషి వికృతంగా మారిపోయాడు. అసలే తెల్వితక్కువ. అందులో ఆకాస్తతెలివికూడా పోయింది. పద్మావతి సంగీతంపాడితే వాళ్ళకి అసహ్యం. అవును శ్రావ్యముగ పాడుతూంటే శ్రావణానందముగా వింటానికికూడా పెట్టి పుట్టాలేగదా. పద్మావతి అత్తగారింటికి వచ్చిందిమొదలు పుస్తకం చేతపట్టలేదు-అల్లలేదు, కుట్టలేదు, పాడలేదు. ఇవ్వన్నీ యిక్కడ పనికిరావు. (పందిబురదమెచ్చు పన్నీరుమెచ్చునా) అని ఆఅత్తకి ఈకోడలునచ్చదు. నిజానికి పద్మావతి మంచితెలివిగలది గనకనే ఆయింట్లో నెగ్గుకొస్తోంది. పెనిమిటి తెలివితక్కువ అయినాఅత్తగయ్యాళి అయినా

తనకేవిధమైన సంతోషసౌఖ్యములు లేకపోయినా పక్కమాకైనా పుట్టినింటికి తెలుపకుండా పెనిమిటంటే చాలాభక్తితో వుంటోంది-అమ్మలక్కలంతా పద్మావతికే మమ్మా అదృష్టవంతురాలు యేతెల్వితక్కువవాడైతే మాత్రమేమి అన్నవస్త్రాలకులోటులేదు, కోపమొచ్చి రెండుకొట్టినా ఆపేక్షగానే వుంటాడమ్మా! అత్తగారు మహాసాధు అని చెప్పుకుంటారు.

మధ్యాహ్నము మూడుగంటలైంది. రామబ్రహ్మం కుర్చీలోపడుకున్నాడు తల్లిచెప్పినమాటలు తలుస్తూ. భార్యనెల్లా బాధించడమా అనికాబోలు ఆలోచిస్తున్నాడు. అమాయకురాలు పద్మావతికి ఈసంగతి యేమి తెలుస్తుంది? మామూలుగా కాఫీకాచి తీసుకువచ్చింది. రామబ్రహ్మంకి భార్యనిచూడగానే పళ్లుపుడికింది-కోపంగా కళ్లెర్రచేసి 'మధ్యాహ్నంకూడా కాఫీయెందుకుచేసేవు?' అన్నాడు.

ప:—రోజూచేసినట్లే ఈవేళా చేసేను-మొన్నఒకరోజు లేకపోతే మీకు తలనొప్పివచ్చిందికదూ. అప్పటి నుంచి పాలువుంచుమన్నాను.

రా:—(యింకాకోపంతో) నాతలనెప్పితోనెందుకు? నాకక్కరలేదు. కాఫీ నీవేత్రాగు. నాకని వంకపెట్టి నీవుత్రాగుతూ—నీఆటలు బాగాలేవు. నీవు రేపటినుంచి కాఫీమానేసెయ్యి. నాకుకావలిస్తే నేచేసుకు తాగుతాను.

ప:—అట్లాగే, రేపటినుంచి చెయ్యను. ఈరోజుకి పుచ్చుకోండి.

రా:—ఈ ఆటలెన్నాళ్లు ఆడతావో చూస్తాగా నీసంగతంతా తెలిసిందిలే. నాకక్కరలేదు. నాయెదుటనుంచి అవతలకుపో.

పద్మావతి మాట్లాడలేదు. ఆమెకి యిటువంటికోపము యెప్పుడూ మామూలే. అక్కడనుంచుంటే బాజాలుపడతాయిని కాఫీ అక్కడవుంచి వెనక్కితిరిగింది.

రా:—వెళ్లమంటే మాట్లాడకుండా వెడుతున్నావో యెంతనిర్లక్ష్యము. నీ నిర్లక్ష్యమంతా అణుస్తాలే! నిన్ను పెళ్లిచేసుకోటంవల్ల నాపరువుప్రతిష్టలు పోతున్నాయి-దరిద్రమొఖానివి దాపరించావు.

మగనికి యెందుకో గట్టికోపంవచ్చిందని పద్మావతికి తెలిసింది-దగ్గరగావచ్చి 'నామీదనాకోపం యెందుకో చెప్పండి-నావల్ల నేరముంటే తెలియజెప్పితే దిద్దుకుంటాను అంతేగాని కోపంచేయటం అనవసరం-' అంది.

"ఛీ! వూరుకో, యింకామాట్లాడుతున్నావు. నీవల్లనేరం వుంటేచెప్పాలా? నాకంట్లోకాయని, నేను అందంగాలేనని నన్ను అగౌరవంగా చూస్తున్నావుట. బొత్తిగా సిగ్గులేకుండా వుంటున్నావుట. సిగ్గులేక యింకా కారణం చెప్పమంటావు. ఇటువంటి వేషాలువేశావంటే డొక్కచీరేస్తా.'

"నేను యేమీయెరగను. మిమ్మల నగౌరవంగాచూచేదీ, గౌరవంగాచూచేదీ మీకు తెలియదూ? మీతో యీ అసత్యం కిట్టక యెవ్వరో..."

"ఆ తెలుస్తూనేవుంది నీ ప్రవర్తన. అందుకనే అంటున్నాను. నీవు చక్కనిదానవని చదువుకున్న దానివని తెల్విగలదానవని గర్వము. అన్నీ మా అమ్మే చెప్పింది. నేనూ చూస్తూవున్నానుయెందుకుఅని వూరుకుంటే మీరిపోయావు."

"నన్ను అన్యాయంగా ఎందుకు అంటారు. నేనుచేసిన తప్పేమిటో మీయెదుట మీఅమ్మగార్నే అడుగుతానుకండి రోజూ యీ బాధపడలేకుండావున్నాను. ఇరవదినాల్గుగంటలూకోపమేనా? నాకర్మం."

"ఇదిగో నోరుముయ్యి. భయంభక్తిలేదు నీకు. ఎదిరించి మాట్లాడుతావు. మాఅమ్మని అడుగుతావా సిగ్గు లేక? ఫో. అవతలకుఫో. నిన్నుచూస్తే నా పళ్లుమండుతుంది."

చేతులుపట్టుకుని "యిదిగో వూరికే నన్ను తిట్టకండి. మిమ్మల్ని అగౌరవంచేస్తే వారు అగౌరవంకాదూ? నావల్లతప్పంటే క్షమించండి. వాకిట్లోఅత్తగారున్నారు. మనముపోట్లాడితే బాగుండదు. కాఫీపుచ్చుకోండి" అని కప్పు దగ్గరగా పెట్టింది.

"ఛీ! గాడిదా మాట్లాడుతావు. నీకాఫీ యెవరిక్కావాలి" అనిచేత్తో కప్పుతీసుకుని పద్మావతి మొగాన్ని వేసికొట్టేడు—పాపము పద్మావతి నుదురు గాజుపెంకులు చీరుకుని నెత్తురుగారింది. వేడికాఫీకి ముఖముకాలి పోయింది-ఆమెకి దుఃఖమాగలేదు. కూలబడిఏడ్చింది-రామబ్రహ్మం కోపం యింకా రెండుదెబ్బలు వీపుమీద కొడితేగానిపోలేదు. తర్వాత యివతలకొచ్చి పళ్లు పటపటకొరుకుతూ వెళ్లిపోయాడు. ఈచరిత్ర కామాక్షమ్మ వత్తులు చేసుకుంటూ వాకిట్లో కూర్చుని వింటూనేవున్నది.

పద్మావతి యిదే మొదటిసారి అత్తింటికి రావటం. శ్రావణమాసంగదా అనితండ్రి తీసుకు వెళ్లటానికి వచ్చాడు. కాని పంపిచటం మాతాపుత్రులకి యిష్టంలేదు. అత్తగారినడిగితే కుఱ్ఱాడినడగండీ అంది. కుఱ్ఱాడి నడిగితే మాఅమ్మయిష్టంఅన్నాడు. పద్మావతి తండ్రితో వెడతానని యేడ్చింది పాపము. తండ్రి ధైర్యంచెప్పి ఈతల్లికొడుకులసందున యేసంగతి తేలనందున వచ్చినత్రోవనే చక్కాపోయాడు. శ్రావణమాసంలో పద్మావతికి పసుపుకుంకానికైనా వెళ్లనీయలేదు-మంగళవారం చీరకట్టుకుని పేరంటానికి వెడతానని పెనిమిటిని అడిగింది. ఆయన 'నేనమేశావే మాఅమ్మతోచెప్పేవా?' అన్నాడు. 'ఆచెప్పేను. ఆమె మాట్లాడలేదు. మీరువెళ్లమంటే వెడతా' అంది-'అట్లాగా మా అమ్మ మాట్లాడకపోతే నేనూ మాట్లాడను నీవూ వెళ్లక్కరలేదు పెద్దపట్టుచీర సింగారించావుగాని యీపాటికి చీరదాచుకో. ఇల్లాగే బట్టలన్నీ పాడుచేస్తున్నావని మాఅమ్మ చెప్పింది. కాని నేను వూరుకున్నాను. ఛో. విడిచిరా. చీరదాచుకో' అన్నాడు. పద్మావతికళ్లనీరు కారుస్తూ చీరతీసికొనివెళ్లి పెనిమిటి పెట్టిలోదాచిపెట్టింది. దెబ్బలు తగలలేదుకదా అనిసంతోషించింది పాపము-పద్మావతి తండ్రివచ్చి వెళ్లినప్పటినుండి ఆమెకికోడంట్రికము యెక్కువైపోయింది. పైగా తండ్రి యింటికిచేరి వుత్తరంరాస్తే యీఅమ్మాయి చదివిందిట. 'అదిగో వాళ్లనాన్న వ్రాసినవుత్తరంచదివింది. జవాబు కూడావ్రాస్తుందేమోరా నీతోచెప్పకుండా. యిటువంటి వుత్తరాలు చదవటంవ్రాయటం మాయింట్లోపనికి రావని ఖండితంగా చెప్పేయ్యి' అనితల్లిగారి అర్డరుఅయింది. ఆరోజు జ్వరంతో పడుకుంది పద్మావతి. వైద్యుడు, మందు లేదు సరికదా పెనిమిటి 'మీనాన్నవ్రాసిన వుత్తరం చదివేవుట నీవుదొంగతనంగా. నాతో చెప్పకుండా జవాబుకూడా వ్రాశావుట. నీవెందుకువ్రాశావు?' అనిఅడిగేడు. 'నేనుచదివినిమాటనిజమేకాని జవాబువ్రాయలేదు-ఆవుత్తరం మానాన్న చేరినట్లు మీకేవచ్చింది. మీరింట్లోలేరుగనాఅని కార్డుకదాఅని నేను చదివేను అంతేకాని నేనేమీవ్రాయలేదు' అంది. అంతే యింకేముంది-ఆ అమాయకురాలిని ఆ జ్వరపీడితను పట్టుకుని కొట్టేశాడు. కొట్టియివతలకొచ్చి గదితలుపు పైన గొళ్లెంపెట్టి చక్కాపోయాడు. దెబ్బలకి తాళలేక పద్మావతి పడిపోయింది. స్మృహతప్పిపోయింది. సాయంకాల మాయెను తెలివివచ్చింది-దీపాలుపెట్టేరు. తన గదిలోకూడా గుడ్డిదీపముండటం తెలుసుకొంది. మంచినీళ్లుఅనినెమ్మదిగాఅంది-కాని ఆస్వరము-నాలుకనుండి, యివతలకురాలేదు. గొంతుఆరుకుపోయింది. మంచినీళ్లుయిచ్చేవారెవ్వరు? దెబ్బలుకొట్టినతర్వాత దీపం పెట్టటానికి అత్తమాత్రం ఆగదిలోనికివచ్చి దీపంపెట్టి వెళ్లిపోయింది. పద్మావతి అట్లాగే నెమ్మదిగా ప్రాకి తలుపుతెరవబోయింది. కాని ఆవలగొళ్లెముంటే యెట్లావస్తుంది? రాలేదు. అంత నాఅమాయకురాలు కళ్లనీళ్లు కారుస్తూ తల్లిదండ్రులని తలచుకుని-భగవంతుని ధ్యానంచేస్తూ, దీపందగ్గరకు వెళ్లింది-కిరసనాయిలు బట్టనిండాబోసుకుని అంటింపుకున్నది. కొద్దిసేపటికే జ్యోతిఆరిపోయింది. నిశ్శబ్దం-నిశీథం-నిర్మలం. పద్మావతి కష్టాలు నాటితో గట్టెక్కివాయి. కామాక్షమ్మ కొడుక్కి మళ్లీపెళ్లి చేయాలని ప్రయత్నంచేస్తూంది-కానిపిల్లనిచ్చేవారుభయపడుతున్నారు. మెత్తనికత్తి, మేకవన్నెపులి—యీమెతో సంబంధ మెవరు చేస్తారు?

# ఆత్మప్రబోధము

సీరిపి ఆంజనేయులు గారు

"నేను కోటీశ్వరునిరాణి నై ననేమి?
యాత్మవిభుఁ డెనలేని స్నేహాభిమాన
నిరతి నిరతము నన్ను మన్నింప నేమి?
యీమహాశోకజలధిఁ దరింపఁగలనె?
వినుతనాకంబు శ్రావస్తిఁ దనరెనేమి?
యొలసి బహుచేటికాకోటి కొలువనేమి?
యెన్ని సుఖగతులకు దారియున్న నేమి?
యెరియు నీ దుఃఖవహ్ని భరింపఁగలనె?
వరుని గుణవయోధనముల నరసెఁదల్లి;
తరుణమునఁ బెండ్లిసేసె నాతండ్రి; తగిన
తఱిని గులపుత్త్రినొసంగియుఁ జెఱిచెదైవ;
మకట! యీగర్భశోక మెట్లడఁచుకొందు.
నాయనుఁగుపట్టి; యగునెలఁనాటిబిడ్డ;
కమలకోరకమృదుల దేహమునఁ జెలఁగు
ముద్దులసుతుండు మరణించె; పెద్దలార!
యెద్దియే నౌషధమున రక్షింపరారె!"
అనుచు శోకాకులస్వాంతయై, యెలుంగు
హెచ్చఁ; గంటికి మంటికి నేకధార
గాఁగ నేడ్చుచు, నిజభుజాగ్రమునఁ దనదు
కందు మృతదేహ మది వ్రేలఁ గాంతయోర్తు,
చెలువ మెడఁబాసి నెమ్మోము జేవురింప,
వీడి క్రొవ్వెద వెన్నున విరిసియాడ,
నడుగు తొట్రిల, వాడల నంటి కదలె;
నద్దియే కిసగౌతమి యనెడునారి.
ఆమె వీసువక యింటింటికరిగి, యట్లు
దీనవదనాబ్జయగుచు నర్థింప, జనము
విగతజీవుల బ్రదికించు వెరవు జగతిఁ
బూజ్యమన, నేఁగు నెలఁత యూర్పులుఘటిల్ల
జనుల పల్కులయెడల విశ్వాసమెడల,
నాత్మనపగతతృష్ణయగుచు, నిండు
మంచుకొండను వీథుల మలయు నామె
నరసి, సన్న్యాసి యొకఁ డిట్లనియెఁ దఱిసి:
"దేవి! యెందులకిట్టు లార్తిని వహించి
తిరుగ? నల్లదె! చేరువగిరి వసించు
బుద్ధభగవాను దరిఁజేరఁ బొమ్ము తండ
సుమ్ము నీవు వేఁడెడు నౌషధమ్మొసంగు."
అంత నాయింతి వంత యావంత యుడిగి
మదిని జెదరెడు ననువులఁ గుదుటనిలిపి
'బ్రతుకు నాచిన్ని తండ్రి; యిప్పలుకు సత్య'
మనుకొనుచుఁ జేరె నామె గిర్యగ్రభూమి.
అరసె నాలేమ హిమవన్నగాగ్రసీమ
చిరతపోరతిఁ బరఁగు శంకరుని కరణి
నిశ్చలావ్యయోరుసమాధినిష్ఠఁ దనరు
సారయోగప్రసిద్ధు శ్రీశాక్యబుద్ధు.
తనసుతునిడించి యోగిపాదముల దరిని
వేఁడె "నాప్రాణములు వీఁడె మీరు
జీవములఁ గూర్చు నౌషధసిద్ధులగుట
పుత్త్రభిక్ష నర్థించెదఁ బుణ్యమూర్తి!
ప్రేమభరమునఁ బెరిఁగి యొప్పిదమునించు
కందునకు వేగమే మేలిమందువోసి
లీల బ్రదికించి నాదుప్రాణాలునిల్పు
మోదయాంభోధి!"యంచు నాయువిదపొగిలె.
కన్నులరవిచ్చి, బుద్ధు డాగరితఁగాంచి,
'అతులశోకరసాధిదేవతయ యిట్లు
లాకృతివహించి వచ్చెనో' యంచు నెడఁద
నెంతయును వింతయును జింతవంతనిగుడ,
"తల్లి! యెచ్చోటనే నన్నదమ్ము, లాలు
మగలు, దలిదండ్రు, లనుఁగుబందుగులు, నెవ్వ
రెప్డుమరణింపరో యట్టియింటినుండి
తెమ్ము పిడికెఁడుతిల లౌషధమ్ముకొఱకు,"

వనిన గౌతమి యింతింత యనఁగరాని
సంతసము మంతనమ్మున గంతుకొనఁగ
శిశుకళేబరమునుగొని చేరి నగర
మందు నింటింటఁ దిలలఁ జేరాసపడిగె.
ఎందు నాయింతి కవి లభియింపవయ్యె
నగరవీథుల; బత్నినో నాయకునినో
భ్రాతనో సుతనో మాతనో బాంధవులనో
యోటువోవని గృహము లేకుంటఁజేసి.
పట్టణమ్మున నెల్లెడఁ జుట్టితిరిగి,
యందఱకు మృతి సామాన్యమగుటెఱింగి,
తనకు మరణమ్ము నిక్కమమ్మనితలంచి,
యాత్మనెంతయు వైరాగ్య మంకురింప
నెమ్మదినిఁగల యమ్మలికమ్ముఁ దొలఁచి,
ప్రీతి నొలికి వాతికిఁ దనూజాతునొసంగి,
యవని నెయ్యది శాశ్వతం బనువిచార
మెసఁదఁబొడమ నప్పుడఁతి తర్కించె నిట్లు:
"సకలవస్తుసంతతియు నశాశ్వతంబ
యీయనిత్యత్వ మెయ్యెడనేని నొక్క
గ్రామనగరాన్వయములకె కలుగఁబోదు
నిఖిలజనములు సురలు ననిత్యులగుట."

ముదిత యిటులెంచి, బుద్ధుని మ్రోల నిలిచి,
'దేవ! దొరకవుతిలలు; నాతిలలవలని
కార్యమునుబూర్తి యయ్యె; నక్కజముఁగొల్పు
నశ్వరంబగు జగముచందంబ' టన్న.
తన్వి కిటుబోధసేసె తథాగతుండు
"ప్రబలజలవాహినిని జనపదచయంబు
లీనమగురీతి, మృత్యువులోన మర్త్య
కోట్లు లయమగు సతతము కోర్కులూని.
"సంతు-జనకుండు-బంధులు-జ్ఞాతు-లన్య
లేని, మరణదేవతను వారింపలేరు,
శీలసంశుద్ధుఁడగుచు నీలీలఁ దెలియు
పండితుఁ డొకండె నిర్వాణపదముఁబొందు."
చాలనీబోధత త్త్వవిజ్ఞాన మొరిమఁ
గూర్చ, గౌతమి యప్పు డాసరునికరుణ
నియతి, నుపసంపదను భిక్షుణీవ్రతంబుఁ
బూని, యుక్తార్థమిమ్మయి బుద్ధిఁ దెలిసె.
ప్రేమచేఁబుట్టె శోకంబు పెంపుఁగాంచు
తనరు ప్రేమచే భయము నుత్పన్నమగుచుఁ
బ్రేమబంధవిముక్తుఁడౌ నామనుష్యు
నెట్ల శోకంబు భయము బాధింపనేర్చు?

# కర్మసరోవరము

శ్రీమతి అయ్యదేవర బాలా త్రిపురసుందరమ్మగారు

౧

అది సంధ్యాసమయము. భానుఁడు నభోమండలమంతట సంచార మొనరించి పశ్చిమటికొండలలోనికి దూరుచుండెను. శుకపికాదుల కలకలధ్వనులు మారుమ్రోగుచుండెను. శకుంతసంతానములు తమతమ గూండ్ల వైపు బారులుదీరి పోవుచుండెను. చల్లనిలేమావిగున్నలక్రింద విహరించు యువకులు కాసారములనుండిలేచు పిల్లవాయువుల నాస్వాదించు చుండిరి.

ఔరింతసంస్థానాధీశ్వరుని దుర్గప్రాకారమందుఁ జిత్రవిచిత్రశసిల్పులచేఁ జెక్కఁబడిన బొమ్మలు సంధ్యాకాంతులలో లీనమై శిల్పకారులఁ బ్రావీణ్యత జాటుచుండెను. పద్మినీకాంతుఁ డస్తమించెను. కమలములు ముకుళించెను. రాకాసుధాకరుఁ డుదయించెను. కలువలు వికసిల్లెను.

దుర్గప్రాంగణమందుఁగల నొక యుపవనమునందు యిర్వురు స్త్రీలిట్లు సంభాషించు చుండిరి.

కర్మదేవి—అమలా! క్షత్రియస్త్రీలమనన్నులు క్షాత్రతేజమునకు నివాసస్థలములు గదా!

అమల—అమ్మా! సత్యము నీసంకల్పము దృఢమైనది. సాధుమహాశయుని నామమే నిత్యముజపించు చుంటివి. నీబోటి వీరాంగనలకు మారుమాట యుండునా!

క—అమలా! సత్యముగ్రహించితివి: సాధుపరాక్రమమువిన్నదాది మనస్సాతనియందే లగ్నమైనది. నాగూరుమొదలు సింధునదివరకు జయించిన వీరుడు అప్పుడప్పుడు మాతండ్రిగారు సాధునిగూర్చి పెద్దగాఁ జెప్పెడివారు.

అ—తల్లీ! నీతండ్రి నిన్ను మందరాధిపతి రాజాచండ్ పుత్రుఁడగు అరణ్యకమలున కీయసంకల్పించినాడు. లగ్నముకూడా నిశ్చయమైనట్లు చేటివార్తలు దెలుపుచున్నవి.

క—ఎట్లెట్లు? అరణ్యకమలునకు నన్నీయసంకల్పించిరా? నాదురదృష్ట మేమనవచ్చు? అతడెంతపరాక్రమశాలియైనను, వీరాధివీరుడైనను నే నతని పరిణయమాడను.

అ—అమ్మా! నీతల్లిదండ్రులమాటఁ దిరస్కరింతువా? వారిమాట వినకున్న నీకు ముప్పువాటిల్లకతప్పదు.

క—అమలా! తాతకు దగ్గులు నేర్పుచుంటివా? వీరక్షత్రియాంగనకు నీతులు నేర్పుచుంటివా?

ఆడి తప్పని రాజపుత్ర స్త్రీలకు కళంక మాపాదించుచుంటివా? పతిభక్తిసేవాధురంధరులై, పతివ్రతామతల్లులై, పవిత్రవంశసంభూతలై, పతిపాదపూజావలంబకులై, పతియే దైవము, పతియే గురువు, పతియే మోక్షము, పతియే సర్వాలంకారశోభితము, పతియేసర్వమని, ప్రాణములకైనను వెనుకంజవేయని భారతవీరాంగనల శౌర్యానలమింకను జల్లారలేదు. ఏనాడు సాధుమహాశయుని క్రీగంటిచూపులు నాచూపులలో లీనమయ్యెనో ఆనాడే మాయిర్వురుతనువు లేకమైపోయెను. కలమునకు రెండుపాళీలున్నను వ్రాతఫల మొక్కరూపమేగదా? అమలా! నీవు నాతండ్రికి బోధించి, నాయభిప్రాయ మెరింగించి, వారిప్రయత్నము భంగము గావించి, నామనోరథ మీడేర్పుము.

ఇంతలో లో నుండి రెవరో వీరినిద్దర బిలువగానె గృహములోని కేగిరి.

౨

మనకథాకాలము అయిదవ శతాబ్దప్రారంభము. ఈకాలమందు మార్వాడదేశమందు డౌలతసంస్థానమొండుగలదు. ఇదియొక చిన్నసంస్థానము. ఈసంస్థానాధీశ్వరుడు మోహెలరాజా మాణిక్యరాయలు. ఇతడు సద్గుణసంపన్నుడు. విఖ్యాతపరుఁడు. నలుబదేండ్లప్రాయముగలవాడైనను యుద్ధములందారితేరి సాటి రాజపుత్రులలో మేటియై దానకర్ణునిమించు దాతయని యాప్రాంతములలో జెప్పుకొనబడెడువాడు. సుందరమైన వక్షస్థలము, మెలికలుదిరిగిన మీసములు, విడదరొమ్ము, విశాలమైన ఫాలముగల్గిన వీరుఁడాటచేఁ గాఁబోలు రాజసింహుఁడను బిరుదునామ మీతనికుండెను.

మాణిక్యరాయలపుత్రికయే కర్మదేవి. ఈమె చిన్నప్పటినుండి విద్యనభ్యసించి, యౌవనవతికాగానే కత్తిసాము, బాణవిద్యలందారితేరి సుగుణసమన్వితురాలై, సౌందర్యఖనియై, ఒప్పులకుప్పయై యాప్రాంతములందుఁ బేరెన్నిక గాంచెను.

అప్పుడప్పుడు వీరింటికి రాణా రంగపుత్రుఁడు సాధునామధేయుఁడు అతిథిగా వచ్చెడివాడు. సాధుమహాశయుఁడు సజ్జనశీలుఁడు. సింహపరాక్రముఁడు. సుందరుఁడు. ఆప్రాంతమందలి శత్రువీరులలోఁ బోరాడుచు, దుర్గముల స్వాధీనముజేసికొనుచు మార్గవశమున మాణిక్యరాయల గృహమునకు వచ్చుచుండెడివాడు.

కర్మదేవి సాధుమహాశయుని పరాక్రమమువినుచు, నాతని సుందరవదనారవిందము గాంచినపుడెల్ల హర్షాంబుధిని నోలలాడుచుండెడిది. సాధువును కర్మదేవిని గాంచుటతోడనే పులకాంకితుఁడై ప్రేమమయదృష్టులఁ బరికించెడివాడు. ఒకరినొకరు గాఢముగాఁ బ్రేమించిరి. ఈసంగతి మాణిక్యరాయలకు తెలియక

తనకుమార్తెకు వివాహముఁజేయ సంకల్పించి మందరాధిపతియైన రాజాచండ్ పుత్రుఁడైన అరణ్యాకమలునకీయ నిశ్చయించెను.

అరణ్యాకమలుఁడును కర్మదేవి సౌందర్యమును, సాహసౌదార్యములను చెవులారవిని ఆమెతోడి సహవాసము స్వర్గావాసమని స్వప్నావస్థలయందుసహితము భ్రమించుచుండెడివాడు.

ఎట్టకేలకు మాణిక్యరాయలు కర్మదేవి మనోనిశ్చయం బెరింగి, అరణ్యాకమలునకు తనయనివ్వక సాధు మహాశయునకే తన తనయనిచ్చి పాణిగ్రహణమహోత్సవము జరిపెను.

ఈవార్త అరణ్యాకమలుని చెవులకు ములుకులవలె నాటెను. ఈతడు మహోగ్రుడై అవాథంగమునకుఁ జింతించుచు చేఁజిక్కినపక్షి రెగిరిపోయెనని విచారగ్రస్తుఁడై, ఎట్లనను "నన్ను వమానపరచిన సాధునిచంపిన గాని నే క్షత్రియుడగాను" అని శపథముచేసి సాధుమహాశయునికుత్తుక కత్తిరింపవలెనని పగసాధించుటకై వేచియుండెను.

సాధుమహాశయుడు కర్మదేవిని వివాహమాడి కొద్దిరోజులకు మామగారి సెలవుబొంది భార్యాసమేతుఁడై తనరాజ్యమునకువెడల సంకల్పించి విశ్వాసపాత్రులగు 700ల వీరభటులతో కర్మదేవిని వెంటనిడుకొని బయలు దేరెను.

3

అరణ్యాకమలుని సేనలకు సాధుమహాశయుని సేనలకు పోరాటము ప్రారంభమయ్యెను. పదాతులు పదాతులతో, సేనాధిపతులు సేనాధిపతులతో, అశ్వికదళము లాశ్వికదళములతో ఘోరసంగ్రామము జరుపుచుండిరి. ఎచ్చట చూచినను రక్తప్రవాహములే! ఏమూలజూచినను ఎముకలగుట్టలే. ఏవైపు పరికించినను గాయములుపొంది పొర్లాడుచున్న శూరులకళేబరములే. ఏరట్టుచూచినను వీరులమొండెములు రక్తప్రవాహములో జీలియాడుచుండెను.

సాధు మహాశయుని సేనలు చెల్లాచెదరై పోయెను. సాధు మహాశయుడు యీమారు కర్మదేవివైపు కడ పారిచూపుల బుజ్జి ననుజ్ఞబొంది మహోగ్రుడై, తీవ్రకోపాగ్నిజ్వాలలు రేగుచుండ కరవాలము ఝళిపించుచు, అరణ్యాకమలునితో ద్వంద్వయుద్ధము చేయుచుండెను. ఇర్వురు సమానవీరులౌటచే భీమశల్యులభంగి పోరాడు చుండిరి. వీరిపోరాటము అత్యద్భుతముగా నుండెను.

కొంతవడికి గదాయుద్ధము ప్రారంభించిరి. ఇర్వురిశిరములు వ్రక్కలైనెత్తుటేర్లు ప్రవహించు చుండినను, వారిపౌరుషము ఏమాత్రము తగ్గలేదు. ఇట్లు చాలసేపుఁబోరాడి యిర్వురు మూర్ఛనొంది ధరణిపైవ్రాలి దీర్ఘనిద్ర జెందిరి.

అంతట కర్మదేవి సాధుమహాశయుడుమరణించుటఁ గాంచి, తనమనోహరుని గలియుటకై సంకల్పించుకొని కరవాలముదీసి తన వామభుజమును తెగవేసి యొకభటునకిచ్చి వానితో నిట్లనియె: "దీనిని నీవు నామామగారికిచ్చి యిట్లని విన్నవింపుము: మీకోడలు వీరస్వర్గమలంకరించినది. ఈలోకమునకు, మీకు కాన్పింపదు. భర్తతో సురలోకమున హాయిగా కాలక్షేపమొనర్చును. కొడుకును, కోడలును స్వర్గమునందు సుఖులైయున్నారు."

ఇట్లుచెప్పి మరియొకభటునిపిలిచి రెండవచేయి నరుకుమని యాజ్ఞయిచ్చెను. వాడెంతసేపటికి నరకకుండుట గాంచి కఠినమైన యాజ్ఞయిచ్చెను. భటుడు రెండవచేతినికూడా నరకెను. అంత నామె పుట్టినింటి నుండివచ్చిన మరియొకభటునిపిల్చి "నీవీహస్తము గొంపోయి తండ్రిగారికి పుత్రికారత్నము కానుకగానం పెనుము." అనుచు నావీరబాల చితిని చేర్పించుకొని భర్తృప్రేతము చితిపైనుంచి తాను చితిపైగూర్చుండి చితికి నిప్పంటించుకొనెను. అగ్నిహోత్రుం డామెను భస్మీభూతముజేసెను. అప్పటినుండి ఆమెకీర్తిచంద్రిక లెల్లెడ వ్యాపించెను. పుత్రశోకమువలన రణరంగదేవు కోడలిహస్తమున కగ్నిసంస్కారముచేసి యాస్థలమందొక సరోవరమును త్రవ్వించెను. ఇప్పటికి ఆపవిత్రసరోవరమును "కర్మసరోవర"మని పిలుతురు.

# శాంతమతి

కీ. శే. ఆలూరు వాసుదేవయ్యగారు

ఇవ్విధంబుండఁ బ్రశాంతమహారాజు తనమంత్రి మృతినొందుటఁజేసి యమ్మంత్రివోలె నొకఁడేని సుగుణసంపత్తిగలవాఁడు లభింపకపోవుటకతన నొకదినంబు చింతించుచుండు సమయంబున రాజుభార్యయగు నిందిరాదేవివిచ్చేసి భర్తంజూచి"నాథా! ఏలచింతించెదరు?" యనియడుగ నారాజేంద్రుండు భార్యతో "ప్రేయసీ! మంత్రిలేని రాజ్యంబొకతటఁ జిక్కులకు హేతువగును. కాఁబట్టి తగినమంత్రి యిందాఁక లేమింజేసి యాలోచించువాఁడ" ననఁగ నయ్యిందిరాదేవి వినియిట్లనియె:

"ప్రాణేశా! నడవడియందును, వంశమునందును, మనస్సునందును, మాటయందును, కార్యమునందును, సత్యధర్మములయందును, సముచితజ్ఞానమునందును, ధైర్యసాహసౌదార్యదృఢత్వములయందును, రాజభక్తియందును శ్రేష్ఠుఁడయినవాఁడు మంత్రిత్వమునకు నొప్పుచుండునుగాని, తదితరులు నిష్ప్రయోజనంబు. కావున నాకిపుడొకటిదోఁచె. అయ్యది వినుండు వివరింతు; "సత్యమేవజయతే నానృతం" అనునార్యవచనమువలె సత్యము జయించుచున్నదనియు నసత్యముజయింపదనియు, సత్యధర్మంబులనుండి శుభమునొందవచ్చుననియు, పరధనంబెపుడుగాని నాశమొనర్చుననియు, లోకమునందు సన్మార్గంబువలననసమానకీర్తికల్గుననియుఁదలంచి యానాఁడు కంఠాభరణంబు గొనివచ్చియిచ్చినవానిని రావించి మాటాడి మంత్రిపదవి నొసంగుటయే మేలని తోఁచుచున్నది." అనినవిని రాజేంద్రుఁడు "కాంతా! యెంతయు మంచిసంగతినెఱింగించితివి. అతనినిరావించి యాతనికీర్తి పాటించి సమర్థుండనితోఁచిన పక్షంబున నతనికమాత్యపదవి నొసంగెద"నని సేవకులంబిల్చి యుత్తరంబొకండు వ్రాసియిచ్చి యిట్లనియె: "భటోత్తములారా! రెండుమాసము లపుడు కంఠాభరణమును దెచ్చియిచ్చిన వైశ్యకులసంభూతులగు దంపతులను మీరు చూచియున్నారుగదా? వారీయూరనెందుఁగలరో విచారించి యటకేగి యియ్యుత్తరంబిచ్చి యాభానుగుప్తుఁడనువాని నందలంబునంగొనిరండు"అనిచెప్పఁగా వారట్లువోయి యుత్తరంబు భానుగుప్తునిచే నొసంగుటంజేసి యతనికదివఱకు వ్రాయుటకుఁ జదువుటకు బాగుగఁ దెలియకుండినను లక్ష్మీకటాక్షంబువలన నసమానవిద్యాబుద్ధు లొసంగుటంజేసి యుత్తరంబును బాగుగఁజదివికొని శాంతమతింబిలిచి యిట్లనియె:

"కాంతారత్నమా! ఈపురీశుండగు ప్రశాంతమహారాజచంద్రుండు నాతో రహస్యవచనంబులు గొన్ని మాటాడవలయునని యుత్తరంబు వ్రాసియున్నవాఁడు. అతనియుత్తరువుచొప్పునఁబోయివత్తు"ననఁగ, సంతసంబున శాంతమతి భర్తతో "నాథా! యాభూనాథుండేమి యడిగినను భయంపడక ప్రత్యుత్తరంబులిండు. లక్ష్మీకటాక్షంబున మనకు సకలకార్యంబులనుకూలంబులగును. పోయిరండు"ని చెప్పుటంచేసి భానుగుప్తుఁడు పల్లకీయందుఁ గూర్చుండి రాజ

మందిరంబునకేగి రాజునకు నమస్కరించె. రాజేంద్రుఁ డాభానుగుప్తుని సగౌరవంబున నుచితాసనాసీనుంజేసియిట్లనియె:

ప్రశాంతమహారాజు భానుగుప్తునకు మంత్రిత్వమిచ్చుట

"ఓ భానుగుప్తుఁడా! మానవునకు నుత్తమంబగు ధనము సత్యము. అట్టిసత్యధనంబువలన నెట్టియిక్కట్టులయినంబోలంగు. సత్యధనములేని మనుజునిజన్మంబు జన్మంబుగాదు. వానిదేవుఁడుదయఁజూడఁడు. సత్యముదప్పినచో సకలజనులవలన నిందింపఁబడుచు దుర్గతిపాలగును. "నాస్తి సత్యసమోధర్మో, ననత్యాద్విద్యతేపరం" అనునార్యోక్తివలె సత్యంబునకు నీడైన ధర్మములేదు. సత్యముకంటె శ్రేష్ఠమయినదేదియు లేదుగదా! కాఁబట్టి నీయందట్టి సత్యధనంబుండుటంబట్టి ధన్యుండవు. దానంజేసి రావించితి.

శ్లో॥ నధైర్యేణవినాలక్ష్మిర్న శౌర్యేణ వినాజయః
నజ్ఞానేనవినా మోక్షో నదానేనవినాయశః॥

అనుధర్మవచనమువలె, ధైర్యములేనియెడ సంపదకల్గదు. శూరత్వములేనిచో జయముసంభవించదు. జ్ఞానములేకుండిన నపవర్గసుఖంబుగల్గదు. దానముసేయకుండినచోఁ గీర్తి పొందుటరుదు. అట్లు మంత్రిలేని పక్షంబున రాజ్యతంత్రంబులు జరుగవు. కాఁబట్టి మంత్రివర్యుఁడు మృతినొందుటంజేసి యానాటంగోలె నామనోభీష్టంబుంగని ప్రవర్తించువాఁడును, సత్యధర్మపరాయణుండును, రాజ్యతంత్రస్వతంత్రుండును, నిజరాజపక్షకార్యదక్షుండును, ధీవిచక్షణుండును, విపక్షశిక్షాధ్యక్షుండును, స్వరాష్ట్రజనసంరక్షకుండును నగు శుభలక్షణచరితుండు మంత్రిపదవికి లభింపకున్నవాఁడు. కట్టకడ నీవు సత్యధర్మంబుల నుత్తముఁడవనియు, సత్యంతశాంతిస్వాంతుండవనియు మనంబునఁదలంచి యమాత్యపదవి యొసంగెద. ఎవ్వఁడు రాజభక్తికల్గి సుఖమొసగూర్చువాఁడో వాఁడుఁగదా యమాత్యవర్యుండు! మఱియు నిర్ధనుని యాటోపంబును, సత్యవచశ్శీలాదులు లేని నరజన్మంబును, ధాన్యము ఫలింపనిభూమియును, దంపులేనికోటయును, ధనములేని వర్తకంబును, కులహీనుని బంధుత్వంబును ఎట్లు నిష్ప్రయోజనమో యట్లు మంత్రిలేనిరాజ్యంబు శోభింపదు. కావున నీవీనాఁటనుండి రాజ్యతంత్రస్వతంత్రుఁడవై యశస్సునుబొందుము." అనవుడు భానుగుప్తుండు విని తనమనంబున "ఆహా! యిట్టిపదవికిఁ దెచ్చిపెట్టినది యాపాలమున్నిటిపట్టియగదా? యేమి యాలచ్చినేసరు? ఆలక్ష్మికిదయకల్గుటకు శాంతమతియొనర్చిన పూజావిశేషమో? ఏమి యాశాంతమతి గుణవిశేషము! శాంతమతి నాకు భార్యయగుటంజేసి యీపదవికివచ్చు భాగ్యంబుగల్గె. ఇంతకుఁ గారణభూతురాలుశాంతమతి. జగంబున నెట్టివానికింగాని భార్య గుణవతియై విద్యాధికురాలై యుండినచో నంతకంటె సౌఖ్యము నాకలోకంబునరుదు. మఱియు.

శ్లో॥ వశ్యాత్సుతా విత్తకరీచ విద్యా నీరోగతా సజ్జన సఙ్గతిశ్చ
ఇష్టాచ భార్యా వశవర్తినీచ దుఃఖస్యమూలోద్ధరణాని షట్చ॥

అనునట్లు స్వాధీనులైన పుత్త్రులును, ధనంబునిచ్చెడు విద్యయును, రోగంబులేక పోవుటయును, సజ్జనసాంగత్యంబును, గుణవతియగు భార్యయును నివియైదును మనుజునకు దుఃఖమూలమును బెల్లగించునవిగదా! కాఁబట్టి విద్యయు, గుణమును, సమయోచితజ్ఞానమును, సత్యధర్మంబులును, గలభార్యాసహితునకు నుత్తమలోకతిరస్కారసౌఖ్యంబు లభింపకమానదు. శాంతమతిమనోధైర్యంబునకు లక్ష్మిమెచ్చి యిప్పదవియందు నన్నుఁ దెచ్చిపెట్టెఁగదా? యని సంతసంపడుచు నారాజేంద్రునితో నిట్లనియె:

“రాజేంద్రా! దేవరవారి యానతిచొప్పున రాజ్యతంత్రంబులు బాగుగ నడపెదను. మఱియు గురువును సేవించుటవలన నాయువును, రాజు నానతి మీఱక సేవించుటవలనఁ గీర్తియు సంపదయును, మిత్త్రుని సంగాతంబువలనఁ బీడాపరిహారంబును, సజ్జనసందర్శనంబువలనఁ బురుషార్థంబును గల్గునని పెద్దలు చెప్పుదురు గదా? దానంజేసి నేనట్టివాఁడనైనను రాజును సేవించుటచేతఁ గీర్తియు సంపదయుఁ గల్గక పోవునే?” అనఁగ రాజేంద్రుఁ డాభానుగుప్తునితో “భళా? భానుగుప్తుఁడా? వణిగ్వంశయశస్సు సానఁదీర్చిన జాతిరత్నమువలెఁ దుఱంగలింపక మానదు. అదిగదా వంశనిర్ణయము? అమాత్యపదవికి సంబళ మెంతయని యడుగలేక రాజును సేవించుటవలనఁ గీర్తియు సంపదయుఁ గల్గకపోవునే యని యొకవిధమయిన చమత్కారవచనము సూచించుటంజేసి నీవు సమర్థుండవనియు నన్యుల మనంబులకు బాధకల్గించక రాజ్యతంత్రంబులు బాగుగ నడపించుదువనియుఁ దెలియఁబడుచున్నది. కాఁబట్టి మాసంబునకు నేనూఱువరహాలు చొప్పున నిచ్చుచున్నాఁడను. మఱియు నాయాజ్ఞ చూడఁ బనిలేదు. చేయఁదగిన రాజ్యతంత్రంబులు జరుపుము.” అని రాజాజ్ఞను బొంది పల్లకియందు గృహంబునకేతెంచి భార్యతో రాజు తనకొసంగిన మంత్రిపదవి విశదీకరించె. అంత శాంతమతి సంతసించి భర్తతో నిట్లనియె:

“నాథా! పదవికిదగిన సదనంబుకావలయు. మంచిరత్నము నిత్తడిం బొదిగినట్లు యీగుడిసెనుండుట కేవలంబుగనున్నది. మన కీగుడిసె మంచిదైనను జూచువారికిఁ బరిహాసాస్పదంబు. ఎందైనఁ దగిన మందిరం బొకండు నేర్పాటుసేయుం”డని చెప్పె. అతండట్లు కానిమ్మని రెండుమాసంబు లాగుడిసెంగాఁపురంబుండె. ఇవ్విధంబుండ నూరిలోని జనంబులు భానుగుప్తుని మంత్రిపదవింజూచి యొకరికొకరిట్లనికొనిరి: “చూచితిరే? నిన్నలేక మొన్న యీయూరికన్నంబునకుఁ గష్టపడుచువచ్చి యొకగుడిసెఁగాఁపురముచేరినవాని యదృష్టము? అతనికంటె నెంతయు బుద్ధియందు బుధునివలె నొప్పువారెందఱో యుండఁగా నెవరికైన నప్పదవి గల్గినదే? యనువారును, మఱి కొందఱు కాదుకాదు రాజింటఁబోయిన యమూల్యకంఠాభరణంబు కాకతాళీయన్యాయంబున వీరి కెట్లనో లభించుటంజేసి యయ్యాభరణం బపహరించు శక్తి చాలనందున నాభూషణంబునకు రాజు చాటించిన సంగతి విని రాజుకడకేగి యయ్యాభరణం బిచ్చినందున రాజెంతయు సంతసించి

యమాత్యపదవి యొసంగినవాఁడు. లేకుండిన నుప్పమ్ముకొనువాని కాగొప్పపదవి లభించుటెట్లు అనువారును, మఱికొందఱు మీరు చెప్పిన కారణముగాదు. రాజునలనఁ బురంబంతయు వరలక్ష్మీవ్రతమునాటికి వీథిగుమ్మములు దెఱవఁగూడదని యుత్తరువు గోరిన హేతువువలన నాలక్ష్మీదేవి యానాఁడు ప్రసన్నురాలై సమస్తభోగంబు లనుభవించుమని వరంబిచ్చియుండును. కాకున్న నీలాగు సమధికపదవి లభించునే అనువారును, మఱికొందఱు మనమేల యూరక లేనిపోని యూహాలెంచవలె అట్టి మహాపదవి ననుభవించు నదృష్టముండుటంబట్టి యనుభవింపగలండు. అదృష్టము లేక యనుభవింపఁగలఁడే యనువారును, మరికొందఱు సరిసరి! యీభానుగుప్తుని భార్యయగు శాంతమతి మహాపతివ్రతాశిరోమణి, ఆమె సద్వర్తనంబునకు నిట్టి పదవి భర్తకులభించుట యొకగొప్పగాదు అని యనుకొనుచుండిరి.

ఒకనాఁడు ప్రశాంతమహారాజు మంత్రియగు భానుగుప్తుని చూచి "మంత్రివర్యా! యీపురంబున నెచ్చట కాఁపురంబుండువాఁడవు?" అనుగుటం జూచి భానుగుప్తుఁడు, "దేవరా! నాకింతకు మంచియిల్లు లభింపలేదు. నేను గడుపేదవాఁడనగుటంజేసి తగిన యొకగుడిసెను గాఁపురంబున్నవాఁడ. రెండుకాసులు సంపాదించిగదా యిల్లు కట్టుకొనవలె? కాసులేక యెట్టికార్యముం జేయనగునే? విషస్య తైలస్యనకిఞ్చిదంతరం, మృతస్య సుప్తస్యనకిఞ్చిదన్తరః" అనునట్లు విషంబునకు నూనెకుం దారతమ్యము లేదు. చచ్చినవానికిని నిద్రించెడువానికిని తారతమ్యములేదు. అట్లు ధనహీనునకును మృతినొందినవానికిని తారతమ్యములేదు. కాఁబట్టి జగంబున ధనసంపత్తి లేమికంటె వేఱ నరకంబొకండు లేదు. అట్టి ధనముసంపాదించు నుపాయమునందుఁగూడ, నహింసకార్యంబులచేతను, సత్యమార్గము తప్పకుండను, లభించినది చాలునను తృప్తిచేతను, సంపాదింపవలెఁగాని; యన్యుల నిష్కారణకృత్యంబులొనర్చి బాధించి దబ్బరలాడి దురాశచే సత్యముదప్పి సంపాదించుటకంటె నట్టడవియందు వివేకములేని మృగంబునకాహారం బగుటమేలు. అట్టి క్రూరబుద్ధి కలిగిన మనుజుని జన్మంబు జన్మంబగునే? కాఁబట్టి దురాశవలన ధనము సంపాదించినను, హటాత్తుగ నిండిన చెఱువుదెగినట్లు యాధనంబునకు నొకవిపత్తురాకమానదు. చిత్తశుద్ధికి మించిన యాచారములేదను సామెతవలె ఎవఁడు సత్యముదప్పక దురాశలేక యీశ్వరుఁడిచ్చినది చాలునని తలంచునో వాని ధనంబునకు విపత్తురాదు. కాఁబట్టి యీశ్వరుఁడే కాలంబున కెట్టియన్నంబిడునో యట్టియన్నము భుజించి యతఁ డిచ్చెడు నీడ నుండవలయును. ఆభగవంతుని తోడ్పాటుకుఁ దగిన యదృష్టముండినచో నన్నిసుఖంబు లనుభవించవచ్చును. అదృష్టము లేక యూరక యొకనాఁడు కాసిచ్చి యేనుఁగనెక్కితిరిగిన మాత్రాన రాజగునే?" అనఁగ రాజువిని "మంత్రివర్యా! నీనీతిమాటలకు సంతసించితిమి. మంత్రిపదవినుండి యిప్పట్టణంబునఁ గేవలమగు చుట్టుగుడిసెం

గోపురంబుండుట నాకు నపయశంబు గావున నీవీదినము లక్ష్మీవిలాసంబను హర్మ్యంబునం జేరుము. నీ కాహర్మ్యం బుచితంబుగ నొసంగితి, నందులకెట్టి సందియంబునొందకుము." అని చెప్పుటంజేసి భానుగుప్తుఁడు సంతసించి యా దినము శాంతమతిందోడ్కొని లక్ష్మీవిలాసంబునఁ గాపురంబుండె.

అనంతరము భానుగుప్తుఁడు. లక్ష్మీకటాక్షకారణంబునఁ గ్రమంబుగ లోకులకు హితమైన నడవడియును, వినయముతోఁ గూడిన సత్యవాక్కును, సద్బుద్ధియును, అనింద్య జనస్నేహంబును, సాహసౌదార్యంబులును, దనరారి జనులకందఱకును రాజేంద్రునకును, నలహరిశ్చంద్రుల యమాత్యులకంటెను నుత్తముఁడని తోఁప, రాజ్యతంత్రంబులు నిరంకుశాజ్ఞాచక్రంబున నిర్వర్తించుచు, ధననాయకునిధనాగారంబులందు ధనంబు కొఱంతయయ్యె నని రాజేంద్రుం డద్భుతంబంది పొగడ ధనాగారంబులం గొఱంత పడకుండ ధనంబుం జేర్చి కట్టకడ జనులెల్లరు రాజును మఱచి భానుగుప్తుఁడ రాజేంద్రుఁడనునట్లు సర్వస్వతంత్రంబు వహించి యశోవిభూతింగాంచె.

ఇవ్విధంబుండఁ గొంతకాలంబునకు శాంతమతి తనయభీష్టంబు చొప్పున సమూల్యాంబరరత్నాభరణంబులు భర్తవలనం బొంది యలంకరించుకొని యాలక్ష్మీవిలాసంబున నాలక్ష్మీనారాయణులవలె నిష్టభోగంబు లిద్దఱు ననుభవించుచుండిరి.

ఇవ్విధంబుండ నక్కడ మణిపురంబున నచ్యుతగుప్తుండు దురదృష్టమువలనఁ బలువిధంబులగు కష్టంబులు ప్రాప్తించుటంజేసి యెల్లసిరులం గోల్పోయి భార్యాపుత్త్రికలతోడ నాయూరు విడచి యందందుఁ గ్రుమ్మరుచు నెందుఁగాని జీవనంబు జరుగమికిఁ బుత్త్రియగు శాంతమతిందలచుకొని భార్యయగు భద్రవతింజూచి యిట్లనియె:

అచ్యుతగుప్తుఁడు భార్యాపుత్త్రులతోడ శాంతమతి కడకు వచ్చిచేరుట

"ప్రాణేశ్వరీ! ప్రాణంబువోలెఁ బెంచిన శాంతమతిని కేవల మొకదారిద్రునకిచ్చి వివాహంబుచేసి దానిపై నుండిన కోపావేశంబున నిలువెడలించితి. అబిడ్డ నాకుఁజెప్పిన యదృష్ట విషయ మిక్కాలంబునకు నిక్కంబయ్యె. ఆహా! చెవిటివానికి సంగీతంబును, గ్రుడ్డివానికి సౌందర్యవతియగు భార్యయును, శవంబునకుఁ బుష్పాలంకారములును, బుద్ధిహీనునకు నలంకారశాస్త్రంబును, మూర్ఖునకు ధనంబును,కోపిష్టునకు హితవచనంబులు నెట్లు నిష్ప్రయోజనములో నట్లు నాకాశాంతమతి మాట లక్కాలంబునఁ బ్రయోజనములని దోఁపదయ్యెఁ గదా? ఇపు డాబిడ్డ యెందున్నదో తెలియలేదు. అదెందుండెనో యచ్చోటు పరిశీలించి దానింజూచి వత్తము." అని చెప్ప నాభద్రవతి యిట్లనియె:

"ఆత్మేశ్వరా? గతజలసేతుబంధనమువలె శాంతమతికొఱకు నిపుడు పశ్చాత్తాపపడనేల? ఇపు డాబిడ్డయెందున్నదో విచారించుకొని పోయిచూచి వత్తము. అదృష్టమును గుఱించి యాబిడ్డతోఁ జర్చించి కట్టగడఁ బట్టునట్టి చుట్టుగుడిసెగాని కట్టుపుట్టముగాని లేనివాని

కిచ్చి దానింబంపితిరి. కాలంబువోవును గడమాటనిలుచు ననుసామెతవలె ఆహా! యీతఁడు కఠినగుణములో పిచ్చికపై బ్రహ్మాస్త్రము ప్రయోగించినట్లు కూఁతుమాటకుఁ బ్రతిజ్ఞ చేసి యీలాగునఁ జేయునే? యని లోకులనునట్లు చేసినందులకు మన యదృష్టము మాత్ర మిపుడెట్లున్నది? అట్టి ప్రతిజ్ఞ కాలంబున నేను.

శ్లో. యాతుభర్తరి శుశ్రూషా తయాస్వర్గం జయత్యుత
నైవయజ్ఞః క్రియాః కాశ్చిత్ నశ్రాద్ధం నోపవాసకం॥

అను ధర్మవచన మొకకాలంబున మనపురోహితోత్తముఁడగు పశుపతిశర్మగారు ఏ యోఁషిది తన భర్తను దైవముగాభావించి యెదురాడక సేవించుచున్నదో యాస్త్రీకి యాగముగాని, వ్రతముగాని, శ్రాద్ధోపవాసములుగాని, మఱియే కర్మలుగాని పనిలేదనియు, నట్టి వ్రతముననుండిన స్త్రీ నిశ్చయంబుగ స్వర్గమును జయించుననియు, స్త్రీకి భర్తయ సుభూషణంబనియు, నెట్టి విపత్కాలంబునంగాని భర్త నాశ్రయించియుండవలెననియు, భర్తయాజ్ఞ దాఁటకయుండవలెననియు నిట్లు పతివ్రతాధర్మంబు లుపదేశించియుండుటంజేసి యది నాస్మరణకువచ్చి మాటాడ వెఱచితి. ఇంతకు నీశ్వరాజ్ఞ యీలాగు నుండఁగా మనమేమి చేయవచ్చును?" అని చెప్ప, నావల నచ్యుతగుప్తుండు "భద్రవతీ! మద్యపానంబు చేసినవాఁడును, చోరమార్గప్రవర్తనుండును, వారకాంతాప్రియుండును, ధనికుండును, విద్యావిహీనుండును, పరద్రవ్యాపేక్షకుండును, పరనిందాసక్తగలవాఁడును, అసూయాపరుండును, జడచిత్తుండును, ఆఖేటవిహారుండును, ఈపదిగురు నెప్పుడుం గాలాకాలంబులును, హితాహితవచనంబులును, పాటింపని కేవలమూఢులు. కాఁబట్టిన కుందేటికి మూఁడుకాళ్లను సామెతం బరిపాలించువారు. తమ కార్యంబులును, దమ యోచనలును, తమ కాయువును, తమ సుఖంబులును, తమ సంపదలును శాశ్వతంబుగ నుండుననియు, చంద్రసూర్యులు నశింతురుగాని, తాము నశించుట లేదనియును నిశ్చయాత్ములై మైమఱచి యుండుట నైజముగదా? కాఁబట్టి నాధనగర్వాతిశయంబున నాయదృష్ట మీరీతిగ నెప్పుడుండునని తలంచి యాబిడను గరుణించక తృణీకరించి యట్లు చేసితి. తలదగిలి తేగదా తడవిచూచుకొందురను సామెతవలె నాకిపుడు దురదృష్టము వాటిల్లి నందులకుఁగదా శాంతమతి యొందున్నదని తలంచవలసిన హేతువయ్యె. జగంబున జనులు "తమ కాపద వచ్చిన కాలంబున జోస్యులను, వైద్యులను, మిత్రులను, పనివాండ్రను, రాజకీయోద్యోగవర్యులను, మంత్రతంత్రజ్ఞులను, సద్గ్రంథపారాయణులను, గృహపార్శ్వదులను వెదకి వారికడకేగి తమకార్యములను దెల్పి కార్యానుకూల్యమార్గంబులు దెలుసుకొనుటయు వేఁడుటయుఁ గలదుగాని యాపదరానికాలంబునం గంటఁజూడరు. అట్లు నాదురదృష్టకష్టకాలం బెట్లు తరింపనగునో యెవ్వారింబోయి వేఁడువాఁడ? కానిమ్మింతకు దేవుని దయగాని నే నేమి చేయఁగలను?"అని వగచి భార్యాపుత్రులందోడ్కొని యుండును శాంతమతి జాడను విచారించుకొంచు నాయానగరంబులు ద్రిమ్మరుచుండె.

—కొదువ.

# వఱదనే యనంటి మొక్క మొఱ

గీతిక

కవికొండల వేంకటరావుగారు

నే పచ్చపచ్చగున్నాను ముత్తైదువా!

నే పిల్లల్తోవున్నాను ముత్తైదువా!

నే మువ్వటాకు నున్నాను ముత్తైదువా!

నే లంకవిఱిగి వఱదబడితి ముత్తైదువా!

నీవు టెంకాయ విసరబోకు ముత్తైదువా!

నామువ్వాకు చినిగిపోవు ముత్తైదువా!

నా కోటాకు పైకిరాదు ముత్తైదువా!

నా పిల్లజెల్ల విడిపోవు ముత్తైదువా!

నే తల్లక్రిందులై పోదు ముత్తైదువా!

నన్ను బ్రదుకు వదలలేదు ముత్తైదువా!

తిన్న యరటిపళ్లు త్రేంచు ముత్తైదువా!

చేరడేసికళ్లు నీవి ముత్తైదువా!

జాలిచూపుచూడు నన్ను ముత్తైదువా!

బారపొడుగు చీర చెఱగు ముత్తైదువా!

దారివేసి నన్నులాగు ముత్తైదువా!

కొప్పుదిన్నఁబెట్టుకున్న ముత్తైదువా!

అప్పుడీర్తు నాయుపోఁగు ముత్తైదువా!

# తెలుఁగు దేవళము

శ్రీ వేంకటసుబ్బారావు చౌదరిగారు

తనదుసౌందర్యమునను ముగ్ధతనుజెంది
మధురరసాస్వాదనోన్మాదమధువుపోలె
చేరవచ్చినవాధుని జీరి భావి
సౌఖ్యజీవితమునకును స్వస్తి చెప్పి
తల్లియాజ్ఞలనాదట దాల్చి ఘోర
కదనమున కప్పగించి నిష్కామమైన
వీరధర్మంబు నెరపి శాశ్వతయశస్సు
గన్న మాంచాల యెచ్చోట గణుతిగాంచెనో,

రావువారికార్యమపూడి రణమునందు
రక్తధారలు యేఱులై శక్తులుడుఁగ
ముప్పతిప్పలు బెట్టి సమున్నతముగ
రాజ్యమేలిన నాయకురాలు వీర
కాంత యెచ్చోట ప్రబలవిఖ్యాతిగాంచెనో,

అలపరాసుఫిరంగి దెబ్బలకుయోడి
కూలిపోనున్న బొబ్బిలికోటలోన
క్షత్రధర్మంబు మెఱయ పవిత్రమైన
వీరరుధిరంబుజల్లిన వెలమకాంత
పూర్ణగర్భిణి, రమణమ్మ, పూతచరిత
శౌర్యలక్ష్మిని యెచ్చోట చూరగొనెనో,

కాకతీయసామ్రాజ్యాధికారమూని
దేవగిరి యేలు యామహాదేవరాజు
బలములను చించి చెండాడి పాఱఁద్రోలి
శిల్పవిద్యాభివృద్ధి నశింపకుండ
ద్రవ్యమెంతెంతో పలుమారు ధారవోసి
రమ్యమైన సువర్ణాక్షరములతోడ
దేశచరిత కమోఘమౌ దీప్తిగూర్చి
తేజరిల్లిన రుద్రమదేవి వీర
నారి యేదేశమందు జన్మంబుగాంచెనో,

అట్టిపావనమైన యాంధ్రదేశ
సోదరీబృందమా! యశోభిలాలుక
వెలుగుచుండిన తెలుగు దేవళముజేరి
వీరగంధాక్షతలుజల్లి వీరమాత
శబ్దమునకు ప్రయత్నంబు సలుపరమ్మ.




# వస్త్రముతో చెట్టు

శ్రీమతి కంకిపాటి రుక్మిణమ్మగారు

లైటురోజు, గోల్డెన్ఆరంజి ఈరెండుకలర్లలో $\frac{1}{4}$ గజం ఒకరకం, $\frac{1}{4}$ గజం ఒకరకం సిల్కుగాని, లేక తెల్లఆర్గండీ $\frac{1}{2}$ గజంతీసి 2 పేలికలుగాచించి, ఒకదానికి రోజుపౌడర్ రంగులో అద్దేది, ఒకదానికి దానిమ్మచక్కలు బాగదంపి ఒకచట్టిలో నీళ్లు కొద్దిగాపోసి వుడకనిచ్చి, గుడ్డ దానిలోతడిపి ఒకరోజు వుండనిచ్చి ఎండవేసిన చాయ బాగుగఅంటును. తయారుచేసుకున్న వస్త్రములను అర్ధణాఅంత చదరముపేలికలుగా చింపుకునేది. ఒక్కొక్కదానిని నాలుగుప్రక్కల సన్నగా ఒక పొరనమడిచి దూపోగు తిత్తికి వాయుదారం పోసినట్టుకుట్టి తఱువాత రెండుదారముల కొనలుపట్టి లాగినయెడల మల్లెమొగ్గవలె ఏర్పడును. దానికి రెండువరసలు దారంచుట్టి గట్టిగా టాకావేసివుంచేది. ఇట్లనే అన్నితయారుచేసుకొని 4 లుగేసి మొగ్గలు పువ్వువలెపట్టుకొని నాలుగుకొనలుచేర్చి టాకావేసివుంచి, అంగట్లోఅమ్మె తంతిచుట్ట తెచ్చుకొని కాల్చి చెట్టుకొమ్మకు ఎంతనిడుపుకావలెనో అంతముక్కలుతుంచుకొని, ఆకుపచ్చ నెట్టయిదారంగాని వులన్ కానితెచ్చి ఒక్కొక్కకమ్మిచివరన నాలుగుచేర్చిన పువ్వులు ఒక్కొక్కరకంపెట్టి ఈపచ్చదారంపెట్టి మొదలులావుగా కొస సన్నగాచుట్టి తయారుచేసుకునేది. ఒక గొడుగుకమ్మి మట్టసంగావిరిచి దానికి ఈకొమ్మలుపెట్టుతూ దారంతో కదలకుండా గట్టిగాచుట్టివుంచి, కంఠంకురుచగా కొంచెంబొంగురుగా వుండేసీసా ఒకటి తెచ్చేది. జాజిచెక్కపొట్టు సన్నగడ్డివలె నుండుదానిని, ఆకుపచ్చపౌడర్ ఒకఅణాది తెచ్చి కొద్దిగాఒకటంబ్లరులో నీళ్ళుపోసి వుడికించి అందులో ఈపొట్టుతడిపి ఆరపెట్టవలె. ఆపొట్టు సీసాలో అడుగునపోసి ఈచెట్టును జాగ్రత్తగా సీసాలోపలచొప్పించి శ్రవణంతో లోపల బాగచక్కచేసి మూతికికార్కుబిగించి పైన లక్కమోరు చేయవలె. లేనియెడల రామబాణములుగోనప్రవేసించి పాడుచేయును. ఇట్లు తయారైన సీసా మేజామీదవుంచిన అలంకారముగా నుండును.




### —రాయలసీమ చక్కెరపొంగలి—

గంధసారము (సువాసనగల) చేబియ్యము 1 సేరు, పొట్టుపీడని పచ్చి (వేగని) పెసరపప్పు $\frac{1}{4}$ సేరు, చిక్కని ఆవుపాలు $2\frac{1}{2}$ సేర్లు, చక్కెర అర సేరు, (కొలత) మంచి నేయి అర సేరు, ఏలకులచూర్ణ మొక తులము; సిద్ధము చేసియుంచుకొనుము. పైజెప్పిన యొక సేరు సువాసనగల చేబియ్యము పైపొట్టుపీడని పావు సేరు పెసరపప్పును జేర్చి చక్కగా కడుగుము. నీరు వంచివైచి యాపదార్థ మొక గుడ్డపై నీడనారంబోయుము. తరువాత ప్రాయిపై బాణలినుంచి సన్నగా మంటచేయుము. బాణలి వేడిరెక్కుటచూచి యందులోఁ దగుకొలఁది నేయిపోయుము. ఆరఁబోసిన పెసరపప్పుతోడి బియ్యమందులో నెఱ్ఱఁగా సువాసన వేయుదనుక వేయించిడింపుము. రెండుసేర్ల బియ్యము ఉడుకఁగల పాత్రలో చిక్కనియావుపాలు $2\frac{1}{2}$ సేర్లు పోసి, ప్రాయిమీఁదనుంచి మంటవేయుము. పాలు సలసల కాఁగుటచూచి, వేయించి యుంచిన పెసరపప్పుతోడి బియ్యమందులోఁ బోయుము. పొంగురాకుండ గరిటెకాఁడలోఁ దఱచుఁ ద్రిప్పుచుండుము. బియ్యము మెత్తగ నుడుకుఁబట్టినదిచూచి, యందు పావుసేరు నేయియు, ఏలకులచూర్ణ మొకతులము వైచి కలియఁద్రిప్పుము. మంట తగ్గించుము. ఒకటి రెండు నిముషములైన వెనుక నందులో నర సేరు (కొలత) చక్కెరవైచి, బాగుగాఁ గలియఁద్రిప్పి మూఁతవైచి దింపియుంచుము. దీనినే మాప్రాంతముల చక్కెరపొంగలి యందురు. అంతకంటె క్షీరాన్నమనుటబాగు. ఇది భుజించుటకెంతయు రుచ్యముగనుండును. పుష్టికరమైనది.

—సీరిపి సావిత్రమ్మ.

### —తేనెతొలలు—

గోధుమలు విసరి సన్నటిరవతీసుకుని ఉంచుకొనేది. రెండుఅర్ధాకులనీటినిఁ ప్రాయ్యిమీద మరుగనిచ్చి, ఒకఅర్ధాకురవ నీటిలోబోసి బాగవుడ్చేది. అందులో కొద్దిగా జీలకర, ఇంగువ తనుమాత్రము వుప్పు, రెండుఅర్ధాకుల బియ్యపుపిండి, వుప్పినరవలో బోసి, బాగ గరిటెతో కలిపి, రెండు నిమిషములు మూసివుంచి, తరువాత తేనెతొలలపీటలో పెట్టి పిండి నేతిలోకాల్చిన చాలారుచిగానుండును. నోట వేసిన కరిగిపోవును.

### —ముత్తసరి—

ఒకఅర్ధాసు పెసరపప్పుకు సుమారు ఒకఅర్ధాకు, ఒకటిన్నరనీళ్లు ప్రొయ్యిమీద మఱుగనిచ్చి పప్పువేసి వుడకనిచ్చేది. సున్నమువలె విరియబడును. అందులోకి తగినవుప్పు జీలకర రెండుఅర్ధాకుల బియ్యపు పిండిపోసి పైవిధముగనే వుప్పి మణుగుపూలపీటలో పిండి నేతిలోకాల్చినట్లయిన కూటుముత్యములవలె నోటవేసిన చూర్ణముకాగలవు. ఇష్టమువున్నవారు వుప్పువేయక చేసిఁ చక్కెరపాకులోవేసి భుజించిన రుచిగానుండును.

—కంకిపాటి రుక్మిణమ్మ.

### —గరిశలు—

అరవీశడు ఎండుకొబ్బరిచిప్పలు తెచ్చి కోరవలెను. వీశెడు పంచదార, వేయించిన శనగపిండి

అర్ధసేరు, అర్ధసేరువేయించిన జీడిపప్పు, అర్ధసేరువేయించిన బాదముపప్పు, అర్ధసేరు ద్రాక్షపండ్లు, అర్ధసేరు కిసిమిసిపండ్లు, ఒకఅణా యాలకులపొడి. పైనచెప్పిన వస్తువులన్నియు కలిపి ఒకగిన్నెలో ఉంచవలెను. ఒకవీసెడు మైదాపిండితెచ్చి నీళ్ళలోతగునంత ఉప్పువేసి ఆనీటితో గట్టిగాకలిపి ముద్దగా చేయవలెను. ఆముద్దనుంచి చిన్ననిమ్మకాయపరిమాణముగలపిండితీసి పూరీవలె అప్పడము కఱ్ఱతో చేయవలెను...తరువాత గిన్నెలోనుంచిన పొడుమును ఒకపూరిలో పూరీగరిటతో రెండుగంటెలుపోసి, ఆపూరినిమడిచి పూరీచక్రముతో మడచినవైపున నవిషీచెక్కవలెను. ఈవిధముగ అన్నియుమడిచినతరువాత ఒకపొయ్యిమీద బాణలిపెట్టి ఆబాణలిలో ఒకఅరవీసెడు నేయిగాని నూనెగానిపోసి కాగినతరువాత అయిదారుచొప్పున వేసి ఎఱ్ఱగా ఉడికినతరువాత రెండుఅరుకలతో తీయవలెను. ఇవిభుజించిన చాలారుచిగ నుండును. ఈగరిశలు రెండుమాసముల వరకుచెడక శుభ్రముగా నుండును.

—పొట్లూరి వాసంతికమ్మ.

— బాలూసాయి —

ఒకవీసె మైదాపిండితెచ్చి దానిలో ఒకఅణాకాసుఎత్తుగల సోడాగుండను కలుపవలయును. (సోడాగుండ ఎక్కువఅయిన రొండల బాలూసాయి విడిపోవును.) మైదాపిండిలో సోడాగుండ కలిపినతరువాత దానిని నేతితో పొడిపొడిగా కలుపవలెను. పిమ్మట దానిలో అరసోలెడు పెరుగు తగినంత నీరుపోసి కలుపవలెను. (పెరుగు నీరు ఒకేసారి పోయవలెను) ఒకవీసె పంచదారతెచ్చి జిలేబీపాకము (లేతపాకము) తీసి ఒకచోట పెట్టుకొనవలెను. కళాయిలో నేయిపోసి పొయ్యిమీదపెట్టి సలసల కాగినతరువాత దించివేయవలయును. ఇదివఱకు ముద్దకలిపిన మైదాపిండి నిమ్మకాయలంత ఉండలుగా చేయవలెను. ఒక్కొక్కఉండ ఎడమఅఱచేతిలో పెట్టుకొని కుడిఅఱచేతి క్రిందిభాగముతో మధ్యభాగము లోతుపడునట్లు నొక్కవలయును. అట్లు నొక్కినవానిని పైచెప్పిన క్రిందకుదించి చల్లార్చిన నేతిలోవేసి తిరుగ పొయ్యిమీద పెట్టవలెను. (మరుగుచున్న నేతిలో వేసినబాలూసాయి విడిపోవును.) ఎఱుపుడోలుగా వేగినతరువాత బాలూసాయినితీసి పంచదార పాకములోవేసి నానినపిదప భుజించవలయును.

—యశోదాబాయి.

— శ్రీకండి —

ఒకసేరుపెరుగు దళసరిబట్టలో వడియకట్టి ఒకరాత్రంతావుంచవలెను. నీరంతయుపోయి ముద్దపెరుగు నిల్చును. అది పకకళాయిపాత్రలోగాని, చీనామట్టిపాత్రలోగాని పెట్టుకొని అర్ధసేరుచీనీ అందులోపోయవలెను. $\frac{1}{2}$తులం కుంకుమపువ్వు $\frac{1}{4}$ జాపత్రి $\frac{1}{2}$తులం చిన్నయేలకులు నూరి కలుపవలెను. బాదం, పిస్తా, అక్రోడ్ కలపవలెను. కొద్దిగా పచ్చనిరంగు (పసుపు) కలిపి చేతితోబాగా మర్దనచేయవలెను. అప్పుడు తినుటకు యోగ్యముగా, రుచికరముగా తయారగును. మహారాష్ట్రబ్రాహ్మణులు చాలాప్రీతిగా నుపయోగింతురు.

— ఉసిరికాయమురబ్బా —

పెద్దవుసిరికాయలుతెచ్చి నీళ్లలోపోసి మూడురోజులు నానపెట్టి పిదప అవి పైకితీసి, దబ్బనముతో గంట్లుపెట్టవలెను. పిమ్మటఅవి సున్నపుతేటనీటిలో రెండురోజులు వుంచవలెను. తరువాత మంచినీటితో కడిగి నీళ్లలోవుడికించవలెను. పాతికకాయలకు సేరు పంచదారచొప్పున, పంచదారలో మూడవవంతున నీరుపోసి పాకము $1\frac{1}{2}$అంగుళము తీగసాగేవరకుతీసి పైకిదింపి, వుడికివుంచిన ఉసిరికాయలు అందులోవేయవలెను. దానిలో కేసరిఅరకుగాని కుంకుమపువ్వుగాని కొద్దిగా కలుపవలెను. పిదపదానిని మూతగల గాజుపాత్రలో నిలవయుంచుకొనవలెను. ఇది చాలా ఆరోగ్యకరమైనదియు, పుష్టికరమైనది.

— జేసీర్ పువా —

మెత్తని 1 సేరు శనగపిండి $\frac{1}{2}$ సేరు పంచదార పానకం $\frac{1}{2}$ సేరు పాలు కొద్దిగా నేయి, కిస్‌మిస్, ఏల

కులు, యివియన్నీ పళ్లెములో ముద్దగాకలిపి బాగా మర్దించవలెను. పొయ్యిమీద కళాయిలో నేయి పెట్టి మరగనిచ్చి బడియాలుమాదిరిగా వేచవలెను ఇవి చాలారుచిగా నుండును.

—దేవులపల్లి జగదాంబ.

## —బద్ర పేణీలు—

బొంబాయిరవ్వ 1 శేరు జల్లించి పాలు నెయ్యి తగినంతఉప్పువేసి గట్టిగా కలుపవలెను. కలిపిన ముద్దను శుభ్రమైన తడిగుడ్డకు చుట్టి 2 గంటలు ఉంచవలెను. తరువాత ఆముద్దను రోటికి నెయ్యిరాచి మెత్తగా దంచవలెను. మంచి నిమ్మకాయంత ముద్దలు చేయవలెను. బియ్యపుపిండి దంచి మెత్తగా పడకొట్టి ఎండబెట్టి ఉంచిన ముద్దలను ఒక్కొక్కటి బియ్యపుపిండిలో పొర్లించి పళ్లెముమీద సన్నగా రేకులు చేసుకోవలెను. గిద్దెడు నేతిని బాగాకాచి మెత్తగాచేసిన బియ్యపుపిండిని కొద్దిగావేసి తేనెవలె కలపవలెను. కలిపినపిండిని సన్నగాచేసిన రేకులమీద కొద్దిగావేసి రేకు అంతా రాచి గుండ్రముగాచుట్టి పళ్లెముమీద అప్పడాలకఱ్ఱతో పూరీచేసినవిధముగానే కొంచెము దళసరిగా తట్టవలెను. అరకుండా వేయించినయెడల పొంగి చాలా రుచిగావుండును. అరినయెడల పొంగవు. అన్నివుండలు యీ విధముగానే చేయవలెను. సవాశేరు చక్కెర మెత్తగానూరి ఉంచవలెను. బాణలి పొయ్యిమీద పెట్టి అరవీసెడు నెయ్యి కాగినతరువాత చేసి ఉంచిన పేణీలనువేయించి పళ్లెములో పెట్టి మెత్తగాచేసిన చక్కెరను 2 వైపుల చల్లవలెను. ఇట్లు చేసినయెడల అవి చాలా రుచిగానుండును. ఇవి జాగ్రత్తగా పెట్టినయెడల 15 దినములుండును.

—కోకా పారిజాతము.

## —బిస్కట్స్—

40 తులములు మైదాపిండి 2 టీస్పూనుల బేకింగ్ పౌడరు, 10 తులముల వెన్న, తగుమాత్రము ఉప్పు, కొద్దిగా కాగిన పాలువేసి ముద్దఅవునట్లుల కలిపి మర్దన చేయవలెను. ఆముద్దను బిళ్లలుచేసి దానిని కోకోడబ్బా మూతపెట్టి అద్దిన ఎడల రౌండుగా బిస్కట్లుమాదిరి వచ్చును. ఆబిళ్లమీద శుభ్రమైన పుల్లతో అరుకంతలు పొడవవలెను. ఈవిధము ముద్ద అంతయు తయారుచేసికొనవలెను. ఒక పెద్దబోగవాణిలో సగమువరకు శుభ్రమైన తెల్లని యిసుకపోసి పొయ్యిమీదపెట్టి మంట పెట్టవలెను. పైన ఒకపళ్లెములో నిప్పులుపెట్టి వుంచవలెను. ఇసుక బాగా కాలిన తరువాత చేసిఉంచినబిళ్లలను ఇసుకపోసిన బాగావాణిలోపట్టే అంత శుభ్రమైన పళ్లెములో పట్టినన్ని బిళ్లలుపెట్టి ఇసుకలోఉంచి నిప్పుల పళ్లెము మూతపెట్టుచుండవలెను. అవి తయారైనది చూచి తీసుకొని తక్కినబిళ్లలను యీవిధముగానే తయారుచేసికొనవలెను. ఇవి చాలారుచిగా ఉండును. రెండు వారములవరకు నిలువవుండును.

—కోక పారిజాతమ్మ.

## —పెరుగుసుకీలు—

అర్థశేరు గోధుమనూకను వుప్మాచేసి దానిని పొన్నకాయలంత ముద్దలుగచేసి ఒక పళ్లెములో నుంచుకొనవలెను. తరువాత 2 శేర్ల పుల్లటిపెరుగునందు తగినంతవుప్పువేసి కొలదిగ పసుపు, పచ్చిమిరపకాయలను సన్నగతరిగి ఆపెరుగునందు కలుపవలెను. కొలదిగ మెంతులు, ఆవాలు, ఎండుమిరపకాయలు, కరివేపాకు, ఆపెరుగునందు తిరుగబోతవేయవలెను. ½ శేరుమినపపప్పు, ½ శేరు బియ్యముకలిపి విసిరినపిండిని, నీళ్లు, కొలదిగవుప్పువేసి బూరెలతోపువలె కలుపవలెను. బాణలిని పొయ్యిపైనుంచి అందుకొంత నేయిపోయవలెను. అదిబాగుగా కాగిన పిమ్మట, వుప్మాముద్దలను ఈతోపులోముంచి బాణలిలోవదలవలెను. అవి బాగుగా వేగిన పిమ్మట పైనవ్రాసిన ప్రకారము తయారుచేసియుంచుకొనిన పెరుగునందు వేయవలెను. 15 నిమిషములు బాగుగానానిన వెనుక యుపయోగించవలెను. వాటిని పెరుగుసుకీలందురు.

—పాకల చంద్రకాంతామణి.

# మాతృప్రేమ

శ్రీ ఘటి శాయిరత్నమాలగారు

జబ్బుతో మంచంమీద పడుకొనివుండికూడా లీలని ముద్దులాడేది అమ్మ అపరిమితంగా. తనచేతుల్తో లీలని పెంచటానికిలేదే అని విచారించేది ఒక్కొక్కప్పుడు.

ఒనాఁడు లీల తాతగారూ, అమ్మమ్మా లీల తల్లిదగ్గరకూర్చుని మాట్లాడుతున్నారు ఇంకా జబ్బు తగ్గలేదేనని విచారంగా. ఇంతట్లో లీల గంతులువేస్తూ ముద్దుమాటలతో 'అమ్మమ్మా!' అంటూ పరుగెత్తుకొచ్చి వాళ్ళోపడుతుంది.

'ఛీ! పాడుపిల్లా! నీవేనక్షత్రంలో పుట్టావో, మీఅమ్మ అలాజబ్బుతో బాధ పడుతోంది. తల్లిని మంచం ఎక్కించావు. దరిద్రపుబిడ్డవు' అంటూ విసుక్కుంది అమ్మమ్మ.

లీల బిక్కమొహంతో లేచి నిలుచుంది.

ఇంతలో లీలఅమ్మ ఒక్కఅదటున మంచంమీద లేచికూర్చుని 'నా బంగారుతల్లీ! రావే! అమ్మా! నిన్నెవరేమన్నారురా?' అని వొళ్ళో కూచోపెట్టుకుని తలనిమురుతూ తల్లివంక రోషారుణనేత్రాలతో చూస్తూ 'అమ్మా! నేను బ్రతికివుండగానే నాతల్లిని అనరానిమాటలంటున్నారే. నాకు జబ్బుచేస్తే అది నాకర్మం. కాని ముక్కుపచ్చలారని నాముద్దుబిడ్డ యిందుకు తిరవాది కాదు. ఇంకా దాని అదృష్టంవల్ల నేనింతవరకూ జీవించివున్నాను లేకపోతే ఎప్పుడో ఎగిరి పోయేది ప్రాణం. నాబిడ్డని మీరేమన్నా అంటే నేను సహించలేనమ్మా! అంది గద్గదస్వరంతో. అమ్మమ్మ అదిరిపోయింది. 'లేదమ్మా! నీమీదగల ప్రేమచేత అలాఅన్నాను. అంతే నాకు దానిమీద ప్రేమలేకనా?' అంది మెల్లిగా.

'నువ్వు నూరుచెప్పు వెయ్యిచెప్పు నామీదగలప్రేమలో సగమైనా నా బిడ్డపైన నీకు వుండదు. అబ్బా! నాచిట్టితల్లి నెంతమాటన్నారు. నాలీలకొరకు నేను తప్పకబ్రతికివుండాల్సిందే. లేకపోతే మాఅమ్మ కెన్నికష్టాలో' అని కంటతడి పెట్టి తన బాహులతలో లీలని ప్రేమాలింగనముచేసికుని చిన్ని చెక్కుటద్దాలు వేనకువేలుముద్దులతో నింపేసింది. అప్పటినుంచీ సరిగ్గా మందులుత్రాగటం బలమైన ఆహారంతీసుకోటం మొదలుపెట్టి త్వరలో ఆరోగ్యంపొందింది ఎంతోకష్టపడి లీలకోసరం ఆహా! మాతృప్రేమ?




# దేశీయ గీతము

గరిమెళ్ల సత్యనారాయణరావుగారు

[బల్గేరియా రాజ్యపు ఆర్థికమంత్రియగు సెవిల్లీయనువతడు ఆదేశమునకు దిగుమతియగు పవుడరులు, బ్రష్షులు, రంగుముద్దలు, సారాయీలు మొదలగువానిపై నూటికి 10 చొప్పున సుంకములను విధించి, వాటి దిగుమతినాపి, ధనము దేశమును తొలగిపోకుండా చట్టమునొకదానిని చేసెను. ఇందు కాదేశపు స్త్రీపురుషు లందరును మిగుల సంతోషించి అతనిపై స్తుతిగీతములను వ్రాసి పాడుకొనుచున్నారు. ఇట్టియేర్పాటు మనదేశమునకుకూడ ఎంతయావశ్యకమో మనదేశపు సుందరులే నిర్ణయింపవర్తులు. ఆదేశస్థులు పాడుకొనుచుండు ఒకగీత మీదిగుచను ఆంధ్రభాషలోని కనువదించి వ్రాయబడినది.

పల్లవి

మంచిపనిచేసితివి, సెవిల్లీ! మావీపున పంచేటి భారమును వదలించినావు భళి ||మంచి||

చరణములు

అందాలకోసమయి మేము పన్ను
లందించుశక్తిలేము
సారాయిపని పట్టినావు ద్రాక్ష
సారంబులను నెట్టినావు
పవుడరులపడగొట్టినావు స్త్రీల
వదనంబు చూపెట్టినావు
ముగ్ధముఖముల చెలువునట్టి
రంగుముద్దలెల్లను దులిపిపెట్టి
క్రుంగుపురుషుల నడుముపట్టి
నిలువకుండునట్టు చేసితివి భట్టీ!
ఆశవలముంగురుల ఉంగరపు మెలికలకు
అంగుచేయుటకై మాయర్థమింక తొలగదు ||మంచి||
కృత్రిమపు సాధనలుమాని, దుఃఖముల బ
చిత్రజలముల కడిగిరేని, అంగనల
విచిత్రశోభలు వెలుగుగాని, అందములు
మాత్రమింతయు తరుగబోవు
బ్రష్షుకయ్యెను తగినశాస్తి ముఖము
పౌడరుల వెలయయ్యెజాస్తి ఇంక
తప్పుకను పెలుగు మాతశాస్తి తగ్గ
నప్పులకు నిక జబర్దస్తీ. ||మంచి||
కూడికలు సేయుడికపైన, ధనము
కూడపెట్టుడు పెట్టిలోన, అప్పు
పీడమానపు డింకపైన, మీకు
మేడలును మిద్దెలును, మించుపై భోగములు
కూడు, బల్గేరియా గొప్పఖ్యాతినిబొందు. ||మంచి||

# ఆతడు

ఎకవల్లి రామమూర్తిగారు బి. ఏ.

ఆతఁడొకయోగపురుషుఁడు. ఆశాంతరములాతని యశశ్చంద్రికలను చవి జూచినవి. సత్య, శౌచ, యహింస లాతనిసొమ్ములు. దరిద్రనారాయణులకు అధిష్ఠానదేవత యయ్యు కుబేరునితలదన్నిన ధనవంతుఁడు. అరువదినాలుగేండ్ల ముదుసలియయ్యు వీరాంజనేయుని వీర్యగుణసంపత్తి. తొస్సివాఁడయ్యు బాసకాఁడు. సౌందర్యశీలుఁడుగాకయును విశ్వము నాకర్షించుకొను మోహనమూర్తి.

ఆతఁడొకమహాత్ముఁడు. ప్రపంచమునంతకును ఆదర్శపూరుషుఁ డాతఁడు. ఆతనిది విశ్వమానవమతము. విశ్వసౌభ్రాతృత్వ మాదివ్యపురుషునియభీష్టము. స్వాతంత్ర్య మాతనిజన్మహక్కు; స్వరాజ్య మాతనినోములపంట. 'శత్రు'శబ్ద మాతని నిఘంటువున గానఁబడదు.

ఆతఁడొక యుగపురుషుఁడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ మాతనివ్రతము. దేవపూరుషుఁడౌట నాతని నుడులు నిగమములు—చయిదములు శాస్త్రములు. జితేంద్రియత్వముచే బ్రపంచ మాతనికిమిథ్య; సిద్ధపురుషుఁడౌటచే స్వర్గమాతనికి కరతలామలకము. భారతీయుఁడయ్యు విశ్వమానవుఁడు. 'సబర్మతీ' యాశ్రమవాసియయ్యు సర్వాంతర్యామి.

* * *

కారాగారబద్ధుఁడయ్యు గణ్యతసేయని బుద్ధదేవుఁడు. భౌతికముగ అయశ్శలాకముల వెనుక యస్వాతంత్రుఁడయ్యు, మానసికస్వర్గమనుభవించు మహాత్యాగి. నరునిరూపమున నారాయణునిలీలల బ్రదర్శించు నాట్యకాఁడు.

మోహనచందుని మోముముందర విశ్వమంతయు నొకమారు 'గజగజ' లాడినది, అపవిత్రమూర్తి సత్యాగ్రహమునకు.

ఆ ప్రాయోపవేశప్రారంభము ప్రజల హృదయకుహరములయందు వీరముల నలంకరించినది.

ఆ లీలామానుషవిగ్రహముసమక్షమున ఈజగ మొకలీల!

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## జోలపాటలు

శ్రీమతి బి. యల్. సావిత్రమ్మ గారు

ఊరుమంచిదమ్మ ఉభయకావేరి
వాడమంచిదమ్మ వైష్ణవులవాడ
అయ్యమంచివాడు వెంకటప్పయ్య
అమ్మమంచిదమ్మ అలమేలుమంగ
అలమేలుమంగమ్మ ఆడినపసుపు
అప్పయ్య కోనేట తెప్పలై తేలు
అప్పయ్య కోనేట తెప్పలై తేలు
ఆళ్వారుకోనేట అలుగులైపారు
చిన్నారిమువ్వలే చిరుతగంటల్లు
పన్నంగశయనుడూ యేవీథినాడు
పన్నంగశయనుడూ నాగశయనుడు
పాల్దాగె అమ్మాయి పానుపున ఆడు
వుద్దిమద్దికాయ ముందాటికురులు
ముద్దాడరే పేరువద్దిమామల్లు
పాలమద్దికాయ పాపాటకురులు
పాల్దాగలే పేరుపాపఅన్నల్లు
అమ్మాయి అన్నల్లు యెటువంటివారు
రాజ్యాలుయేలేటి రామలక్ష్మణులు
కొండాలన్ని పిండిగావలెను
గోపాలకృష్ణుడూ కొడుకుగావలెను
మామిళ్లల్ల పండ్లుగావలెను
మదనగోపాలుడే మామకావలెను
నిద్రబో అమ్మాయి నీలివచ్చేను
నీలిజంగం వెంట బూచివచ్చేను
అందారిమామల్లు చందమామల్లు
మా అమ్మతమ్ముళ్లే నీకుమామల్లు
యేలమ్మయేడ్చేవు యెలవారిపట్టి
పాలక్కయేడ్చేను పమిడమ్మవలెను
తూరుపున వొకమామ చూడావునంపా
పడమటన వొకమామ పాడావునంపా
దక్షిణాన వొకమామ జన్నావునంపా
వుత్తరాన వొకమామ వురదాళ్ళంపా
ఈ ఆవు ఆ ఆవు దొడ్లోకితోలి
పితకరా అన్నయ్య బిందెల్లపాలు
తాగవేఅమ్మాయి నీబొజ్జనిండా
ఒడ్డేలపోడవేల వళ్ళిసొమ్మేల
చంకబిడ్డాలేని చక్కదనమేల
జోలక్కజొన్నబువ్వ నాకువరిబువ్వ
యేడ్చేటి అమ్మాయికి యెట్టావుపాలు
జోలబాడుకృష్ణ! జోకొట్టురంగా
నిద్రబో బలభద్ర! రాముతమ్ముడివి.

౨. కథలు

## నుదుటి వ్రాలు

శ్రీమతి గంటి రామసుబ్బలక్ష్మి గారు

పూర్వం మనదేశంలో ఒకరాజుండేవాడు. రాజుకి రత్నంలాటి కూతురుకలదు. రాజు రాజగురువుని రప్పించి అమ్మాయి జాతకంచెప్పమన్నాడు. అతడు చక్రంవేసి 'ఓప్రభూ! నాకు దేవిడీమన్నా చెప్పనని

వాగ్దానంచేస్తే, తమపుత్రిక జాతకంఉన్నదున్నట్లు చెప్తానన్నాడు. గురువు రాజాజ్ఞపొంది "మీకుమార్తె అడుక్కుతింటుం"దని పలికాడు. రాజుగారు అమ్మాయికి ఆవ్రాత తప్పించగలననుకొని, గురువుమాటలకు పరిహాసంగా నవ్వాడతడు. అమ్మాయిని ఒకరైనీ ఒకచోటుంచిన ఎవరిని అడుక్కోదని ఊహించాడు రాజు. పిల్లను పదేళ్లప్పుడు ఒకమేడలో ప్రవేశపెట్టాడు. అవసరమైనసామానులు, భోజనపదార్థములు పంపించేవాడు. రాచబిడ్డ ఒకప్పుడు బొమ్మలతో ఆడేది. మరొకప్పుడు పాటలుపాడేది, ఇంకొకప్పుడుపరుండేది. ఆపిల్లభోజనసమయమందు ఆపదార్థములను ఒక్కొక్కటి ఒక్కొక్కబొమ్మదగ్గర ఉంచేది. ఆడబొమ్మను "అమ్మా! నాకడుపుమండుతూంది అన్నంపెట్టించండని," మగబొమ్మను "అయ్యా! నాకు త్రఅన్నంలోకి పులుసైనా ఒడ్డించండని" అడుక్కునేది. అప్పుడు అమ్మాయి వాటినితీసుకుని, అమ్మాఅయ్యా ఇచ్చినట్లేసంతోషించి భోజనంచేసేది రోజూ. ఒకనాడు రాజు పిల్లప్రవర్తన పరీక్షించుటకు మేడెక్కాడు. తలుపుతాళంతీసి లోనప్రవేశించాడు. రాజు బొమ్మలను బిచ్చమెత్తుచున్న పిల్లనుచూచి నిశ్చేష్టుడయ్యాడు. అతడు అమ్మాయి నుదుటివ్రాలు తప్పించలేననుకున్నాడు. పిమ్మట గురువుని శ్లాఘించాడు. ఆరేళ్లకు అమ్మాయిపెద్దదైంది. రాజు "మాకుమార్తెకు బిచ్చమెత్తు స్వభావంతప్ప అన్నిలక్షణములు మంచివే. అందుకుసమ్మతించిన రాకుమారుడే ఆమెను పెండ్లాడవలె"నని స్వయంవరం చాటించాడు. అంతట ఒకబీదరాజొకడు ఆమెను వివాహమయ్యాడు. కులాచారంప్రకారం పెండ్లికుమార్తెను తీసుకువెళ్లాడతడు. ఇంక ఆలుమగలు ఊరూరు తిరిగి బిచ్చమెత్తి జీవించేవారు. ఇప్పటి రాచబిచ్చగాండ్రు వాళ్లసంతతివారేమో! కథకంచికి, మనం ఇంటికి.

# రాజుగారిభ్రాంతి, రాణిగారియుక్తి

శ్రీమతి ఎస్. హెచ్. అలిమేలుమంగతాయార్ గారు

ఓనాడు రాజుగారు మృగాల్ని వేటాడడానికి వారి పట్టణానికిదగ్గరగాఉన్న ఓమహారణ్యానికి బయలుదేరేరు. చాలామృగాల్ని సంహరించేరేమో ఎంతో అలసిపోయి ఆయాసంతీర్చుకోడానికి పరివారంతో గూడా చెట్టునీడకిచేరి ఏవో వేటాడినభోగట్టాలు మాట్లాడుకుంటున్నారు. ఇలాఉండగా వాళ్లకికొంత దూరంలో, ఓనిండుచూలాలైన కొండమనిషి నెత్తిమీద కట్టెలమోపుమోసుకువస్తూ మార్గమధ్యాన్ని ప్రసవమయ్యేచిహ్నాలు కనిపించడంచేత మనరాజుగారూవాళ్లూ కూర్చున్నప్రదేశానికి కొంతదూరంలో ఉన్న చెట్టుకింద ఆకట్టెలమోపునుదింపి, పైవాళ్ళకుకనుపించకుండా ఉండడానికి కట్టుకున్నకోక చెంగు చెట్టుమొదటినుండి తనుకూర్చున్నదాకా చుట్టుకుని తనకుతానే పురుడుపోసేసుకుంది. ఇదంతా రాజుగారుచూసి నివ్వెరపడిపోయేరు. పూర్ణగర్భవతి! ఇంతదాక కట్టెలుమోస్తూనే ఉంది! ఇప్పుడు-ఈఅరణ్యమధ్యాన్ని-నిస్సహాయంగా-సునాయాసంగా—ఈ చెట్టుకింద ప్రసవించింది! ఇంకా పురిటిరోజులు రెండుమూడు నెలలున్నాయనగానే మనవాళ్లని అడుగుతీసి అడుగుపెట్టనియ్యంగదా! పురుడొచ్చేవేళకి దాదులూ వైద్యులూ ఓ వేనవేలమంది ఉండాలి. ఈకొండదానికి ఏవైద్యులున్నారని పురుడొచ్చింది! మనవాళ్లకి ఉపచారాలూ సుఖాలూ లావవడంతోనే కష్టాలూ చికాకులూ లావవుతూ ఉంటాయి. అని అనుకుని, ఆఆవేశంతో కోటకొచ్చేసి గర్భవతిఐన తనభార్యకు ఉపచారాలు చేస్తూన్నదాసీలని మానిపించేసేరు. ఏరోజు కారోజు గర్భంలోఉండె శిశువు తాలూకు స్థితినిన్నీ పరీక్షించే మంత్రసానుల్నీ మానిపించేసేరు. మరుచటినుండీ పరిచారికలు తన అంతఃపురంలోకి రావకపోవడంచూసి ఇదేమిటీచిత్రమని ఆలోచించింది రాణి. తనదృష్టిపథంలో దాసీల్ని మానిపించేడానికికారణం ఆవకపోవడంచేత రాజుగార్ని అడగకుండా తిన్నగా మంత్రికి కబురుతోలేసింది. మరో

ద్వారపాలిక ద్వారా అడవిలో జరిగిన వృత్తాంతం అంతా తిరుగా ఉత్తరం అంపించేడు మంత్రి. రాణీగారి మాట విని సరే! రాజుగారికి మంచిభ్రాంతే కలిగింది. ఆయన పెట్టుఅభిప్రాయం పడి ఉంటారు. ఏ చెట్టుకా గాలి ఏ ఎండకా గొడుగా ఏ పిట్టకా కూతా ఉండాలని ఈయనికి ఇంకా అవగతం కాలేదు. కొండవాళ్లు ఎప్పుడూ ఎండనక, నీడనక, గాలనక, వాననక, రాయనక, రప్పనక అల్లాబరువులూ అవీ మోసుకుంటూ తిరుగుతూ ఉంటారు. అందుచేత వాళ్ల శరీరాలు ఆరోగ్యంగా ఉంటాయి, పురుడొచ్చినా ఏమొచ్చినా వాళ్లకి ఓ కష్టంలాగ నిపించదు. ఎప్పుడూ ఎండంటే ఎరగకుండా, కష్టం అంటే ఏమో తెలియకుండా "అసూర్యంపశ్యా రాజదారా"అని అంతఃపురాల్లో పువ్వుల్లా ఉండే మాబోంట్లకు, కొండవాళ్లలాగ, ఏ కష్టం లేకుండా, ఏ ఉపచారాలూ లేకుండా, నిస్సహాయంగా ప్రసవించే భాగ్యం ఎలా అబ్బుతుంది! సరే! ఈ విషయం కార్యరూపంగా తెలియచెయ్యాలనుకుని ఉద్యానవనంలోకి వెళ్లింది. అక్కడుండే నీళ్లపోతవాళ్లని మానిపించేసింది. ఎందుకు మానిపించేసిందో ఎవ్వరికీ తెలియదు అడిగితే తప్పు. రాణీగారి ఆజ్ఞ ఉల్లంఘించడం ఎవరితరం? అందరూ మానేసారు. రెండుమూడు రోజులయింది. వేసవి దగ్గిరనుండీ ఇంతవరకూ నీళ్లపోత చేత దోహదాలు చేసా పెరిగాయేమో రెండురోజులు నీళ్లు లేకపోయేసరికి పూల మొక్కలన్నీ వాడిపోయాయి. ఇలా ఉండగా రాజుగారో నాడు విహారానికి ఉద్యానవనంలోకొచ్చేరు. చూసేరు మొక్కల వైఖరీ. మరేముందీ! అన్నీ వాడిపోయి కొమ్మలు వేలేశాయి. తోటమాలీలుగాని నీళ్లపోతగాళ్లుగాని ఎవ్వరూ లేరు. తిన్నగా కోటలో కెళిపోయి మాలీల్ని పిలిపించి అడిగేరు. ఎందుచేత మొక్కలన్నీ వాడిపోయేయి! ఏం కారణం చేత మీరందరూ నీళ్లుపొయ్యడం మానేసారని. మహాప్రభో! రాణిగారు మానీమన్నారు మానేసేం అని వాళ్లు సవినయంగా సమాధానం చెప్పేసేరు. రాజుగారు రాణీగారి అంతఃపురంలోకొచ్చి, ఎందేత తోటమాలీల్ని మానిపించేసేవు? పూలమొక్కలికి నీళ్లెవరుపోస్తారనుకున్నావు? నీళ్లు లేక మలమల మాడిపోతున్నాయే? అని ప్రశ్నించేడు. ఆయన ఇలాఅనేసరికి సమయం చిక్కిందని, వాటికి నీళ్లుపొయ్యడానికి మాలీలెందుకు? కొండలమీదా అరణ్యాల్లోనూ ఉండే వృక్షాలికి ఎవరు కూలీల్ని పెట్టి నీళ్లుపోయిస్తున్నారు? వాటిలాగే ఇవీకూడా పెరగవా? అనే ఉద్దేశంతో వాటినిమిత్తమై బోలెడుధనం ఖర్చుఅవుతున్నదనే అభిప్రాయంతో కూలీల్ని మానిపించేసేనని అతిచతురంగా తాను పడిన అభిప్రాయం తప్పనీ ఏ చెట్టుకి ఆదోహదం ఉంటేనే అది కలకలలాడుతూ ఉంటుందనీ, రాజుగారికి తట్టేటట్టు ప్రత్యుత్తరం ఇచ్చింది. రాణి ఇలా అనేసరికి అడవిలో కొండమనిషి నిస్సహాయంగా పురుడుపోసుకోవడం, ఆవిధంగానే తనభార్యకూడా ఎందుకు నీళ్లాడలేదని తాను అంతఃపుర పరిచారికలను మానిపించడం జ్ఞాపకం తెచ్చుకుని తాను చేసిన ఈ పని ఈమె తెలుసుకుని ఇలా నాకు జ్ఞానాంకురం కలిగించినదని అనుకుంటూ తన ఆలోచన తప్పుఅభిప్రాయం, చాలాపొరపాటు, అనాలోచితం అని ఆమెదగ్గిర ఒప్పుకుని ఏ మనిషికి తగినట్టూ ఆ మనిషికి ఉపచారాలు లేకపోతే వీల్లేదని మరునాటినుండీ మళ్లీ అంతఃపుర పరిచారికల్ని నియమించేడు. రాజుగారి దోవ బాగుపడిందని రాణీగారు కూడా, నీళ్లూ అవీ పోస్తూ పూలవనాన్ని బాగా కాపాడండని తోటమాలీలికి ఆజ్ఞాపించింది.

## పిట్టకథ

శ్రీమతి సామినేని హనుమాయమ్మగారు

అనగాఅనగా ఒకావూళ్లో ఒకారాజు. ఆరాజుకో కూతురు. మరేయితర సంతానం లేనందున వున్నది ఒక్కర్తే కూతురవడంవల్ల ఎంతో దయతో కూతురికి అన్నివిద్యాబుద్ధులు చెప్పి పెద్దదాన్ని చేశాడు. కూతురికి యౌక్తవయస్సు రాగానే తండ్రి మంచివరుని చూచి యిద్దామని యెల్లప్పుడు ఆలోచించేవాడు. ఎంతమందియో రాజపుత్రులు తనపుత్రికను చేకొనుటకు యెదురు చూస్తూవుండిరి. అందు రాజుకు దగ్గఱబంధువు

అయిన ముగ్గురు రాజపుత్రులు తన కుమార్తెను వివాహమయ్యేటందుకు వేచియుండిరి. ఈముగ్గురూధనవంతులూ గుణవంతులూ అయినందున వీరిలో ఎవ్వరిని త్రోసిపుచ్చుటకు మనస్సుపోక ఆభారమంతయు తనవివేకవతియైన కుమార్తెపైనే పెట్టి నీకిష్టమగుపతిని యెంచుకోమ్మనిచెప్పెను. ఆమె ఆలోచించి వొకవుపాయంపన్ని తండ్రితో నాన్నా! ఈప్రపంచకంలోగల పదార్థాల్లో వింతయైనవస్తువు యెవరు తేగలరో వారినే వరించెదను. మీరిలాచేస్తే చాలును అని యుక్తిగాచెప్పింది. తండ్రి పుత్రికబుద్ధికి ఆనందించి వారితో తనకూతురు మనోభిప్రాయం విశదంగాచెప్పాడు. ఇదంతావిని ఆముగ్గురురాజులు బయల్దేరారు వింతవస్తువు తెచ్చేనిమిత్తం. దేశసంచారానికి బయల్దేరేముందు ఇలానియమం చేసుకున్నారు. వారిలోవారు మనంముగ్గురం మూడుతోవలుబట్టి పోదాం. అందు యెవరిపనికావసాగినా ఫలానిపట్నంలోవున్న పేదరాసి పెద్దమ్మయింటికివచ్చి తక్కిన యిద్దరువచ్చేవరకు వేచివుందాంఅని. ఇలా వారుపయనమై దారిలోగల పట్నాలు పల్లెలు సోధిస్తూ పోగా పోగా మొదటివానికి వొక పెదురుకొట్టాందొరికింది. అదిపట్టుకుని వారు నిశ్చయించుకొన్నమాదిరిగా అనుకొన్నపట్నంలో పేదరాసి పెద్దమ్మయింటికివచ్చి అక్కడ మకాంవేశాడు, తక్కినవాళ్లకోసరం యెదురుతెన్నులుచూస్తూ. ఇంతలో కొన్నాళ్లుపోగా రెండోవాడు ఒకచాపపట్టుకుని అక్కడికివచ్చాడు. ఈయిద్దఱుండగా మళ్లాకొన్నాళ్లకు మూడోవాడు ఒకమామిడిపండు పట్టుకొని వచ్చి చేరేడు. ముగ్గురున్నేహితులు ముదముతో భోంచేసి సావకాశంగాకూర్చోని వారుతెచ్చిన వింతవస్తువులగురించి చెప్పడం మొదలెట్టారు. మొదటివాడు తానుతెచ్చిన పెదురుగొట్టాంగురించి చెప్పమొదలెట్టాడు. అన్నల్లారా! దీనితో మనంఎవర్ని తల్చుకుచూచినా వారు అవుపడ్తారు. కావలిస్తే నిదర్శనంచూడండి. మనంయెవరికోసరం యిన్నికష్టాలుపడి యీవస్తువులు సంపాదిస్తిమో ఆరాజకుమారితనుచూద్దాంఅని ముగ్గురు అనుకొని గొట్టాం ఒకరితర్వాత ఒకరుచూడ్డం మొదలెట్టారు. మొదటివాడుచూసి గాభరాతో రెండోవాడికిస్తే వాడు మరీతెల్లపోయి మూడోవాడికిచ్చినాడు. యింకేముంది అన్నా! మనమనోహారిణి మంచంపై బడియుండి చూట్టూ బంధువులేడుస్తుండగా యెట్లుపడియున్నదో! అయ్యో! మనంవెళ్లేలోగా చనిపోగద్దే మా చూట్టానికైనా ప్రాప్తిలేకపోయిందే అని విచారించసాగిరి. అప్పుడు రెండోవాడు అన్నల్లారా! యిదిగో నాచాపమహాత్మ్యం చూడాల్సిన సమయంవచ్చింది. దీనిమీదకూర్చుని వెళ్లవలసినప్రదేశం తల్చుకుంటే ఒక్కక్షణంలో వెళ్లిపోతాం రండి అని తాను వారుకూర్చోని తల్చుకోగానే రంయ్యిమని రాజుకూతురు మేడలోకి వచ్చివాలిరి. అందరుగొల్లుమనియేడుస్తుండగా రాజుకూతురునిర్జీవియై యక్కడపడియుండెను. బంధువులందరు శవంచుట్టుచేరి విలపించుచుండిరి. అదృశ్యంచూడలేక విచారమానసులై కొయ్యవడినిల్చొబడిపోయిరి. అప్పుడు మామిడిపండు తెచ్చిన మూడోవాడు గబగబా శవంవద్దకువచ్చి అచ్చటఉన్న బంధువుల్నందర్ని లేవమనిచెప్పి తానుతెచ్చిన మామిడిపండు రాజుకూతురు ముక్కువద్దపెట్టెను. పెట్టిపెట్టడంతోనే అందఱు ఆశ్చర్యమయ్యేలాగ ఆరాజపుత్రి చప్పున లేచికూర్చుండెను. బంధువులందఱు ఆనందబాష్పములు విడిచారు. ఇంతవరకు మూర్ఛలోమునిగున్న పెద్దరాజు మూర్ఛతెలసి వాళ్లనెంతో గౌరవించి తనసంతోషం తెలిపెను. వారుతెచ్చిన వింతవస్తువుల మహాత్మ్యంకొనియాడి తననగరిలోనే వారినివుంచుకుని మర్యాదజరుపుచుండెను. యిట్లుకొన్ని దినాలుపోగా రాజకుమారి పూర్ణారోగ్యవతియైనపిమ్మట ఒకనాడు రాజపుత్రులుతెచ్చిన వస్తువులగురించి తండ్రి కూతురుకి ఆలోచన చేయమనిచెప్పి అమ్మా యీముగ్గురిలో యెవ్వనివరించెదవు? లోకమునంతను కనుయజాలు సామర్థ్యంగల పెదురుగొట్టాంతెచ్చినవానినా? తలచిన మరుక్షణమున లోకమంతయు త్రిప్పితేగల చాపతెచ్చినవానినా? లేక శవములన్నిటికి జీవముపోయగల మామిడిపండుతెచ్చినవానినా? చెప్పుతల్లీ అని ప్రశ్నించిన తండ్రికి కుమారి యెట్టిజవాబును యివ్వలేక యిట్లు చింతించెను. మొదటివాని గొట్టాంసహాయా

న్నిగదా నాప్రాణాపాయస్థితినిజూచిరి. అదిలేకపోయిన నాసంగతి వారికెలా తెలియగలదు? దానివల్లనే నేను బ్రతికితినని అనుకుందువా? అదియెట్లును కాదు. చూచినట్టుకు వారేమి చేయగలిగియుందురు? చాపవుండబట్టికదా నాయొద్దకు ఈ క్షేత్రరక్షణమె చనుదెంచిరి. చనుదెంచినట్టు కేమి చేసియుందురు? అందరిలాగే వారును నాకొరకేడ్చి యూరకుని యుందురుగదా! ఇంతకున్నూ ఆమామిడిపండు వుండబట్టికదా నాప్రాణాలు నిల్చినాయి. ఏదినిశ్చయించుటకు పాలుపోదే. ఒకటిలేకపోతే ఒకటివృథాయేగదా. అని తుదకేదియు చెప్పలేక నాన్నా! మరికొన్ని దినాలు పోనియ్యి ఆలోచించి చెప్పెదనని తండ్రిని అప్పటికి పంపివేసెను. కాని పాఠకులారా! ఆరాకుమారితానట్టి అపాయస్థితిలో వున్నప్పుడు దివ్యదృష్టిగల వారిపగిది గనుగొనుటకు సహాయమైన వెదురుగొట్టాంతెచ్చినవానిదా? లేక అనుకున్న మరుక్షణమున తవ్రవాలకే తెంచివట్టుజేసిన చాప తెచ్చినవానిదా? లేక నిర్జీవరాలై పడియున్న తన్ను పచ్చివృత్తరక్షణమే పోయిన అసువులు మామిడిపండు ప్రభావమున ఇచ్చిన మహానుభావుడైన మూడవవానిదా?. ఎవ్వనివరించును? మీరలేయోజించి గృహలక్ష్మిముఖమున తెలియజెప్పుడు.

# నీయోగ్యవర్తనమునకు బహుమతి

శ్రీమతి గ్రైనేడి లక్ష్మీనరసమ్మ గారు

పూర్వమొకప్పుడు దేశములో గొప్పక్షామమువచ్చెను. అప్పుడు బీదలనేకులు తిండిలేక బాధపడుచుండగా దయార్ద్రహృదయుడైన యొకధనికుడు జాలిపడి తనగ్రామములోని బాలురను, బాలికలను, అందరిని తనయింటికి బిలపించి యొక్కొక్కరికొక్కొక్క రొట్టెచొప్పున చాపమీదబెట్టించి తీసికొన నియమించి ఈప్రకారముగానే యాకఱవుపోవువరకును ప్రతిదినము నిచ్చుచుండెదనని చెప్పెను. అక్కడకువచ్చిన పిల్లలు నెమ్మదిగాబోయి తలయొకరొట్టెయు బుచ్చుకొనక నాకుపెద్దరొట్టె కావలెను, నాకుపెద్దరొట్టెకావలెనని తగవులాడి యొండొరులను దిట్టికొని రొట్టెలను బుచ్చుకొని తమయుపకర్తయెడ కృతజ్ఞతనైనను జూపకవెడలిపోయిరి. ఒక్కబాలికమాత్రము మాదొమ్మిలో ప్రవేశింపక సందడి యడగువరకును వేచియుండి వినయముతోబోయి యందఱును మంచిరొట్టెలను దీసికొనగా మిగిలిన చిన్నరొట్టెను దానుదీసికొని సంతోషించినదై యజమానునికి కృతజ్ఞతను దెలుపుచు నమస్కరించి యాయనసెలవుగైకొని వెడలిపోయెను. మరునాడుకూడ పిల్లలదేప్రకారముగా నల్లరిచేయుచు పెద్దపెద్దరొట్టెలను ముందుతీసికొనిపోగా కడపటమిగిలిన చిన్నరొట్టెను నాచిన్నది గతదినమునందువలెనే తీసికొని తనయుపకర్తయెడల కృతజ్ఞతను గనబరచి సంతుష్టాంతరంగములో నింటికిబోయి వ్యాధిగ్రస్థురాలయియున్న తనతల్లికిచ్చెను. ఆమెత్రుంచి నోటవేసికొనవలెనని రొట్టెవిరువగానే లోపలినుండి గల్లుగల్లున రూపాయలు క్రిందబడెను. ఆమె యాశ్చర్యపడి బీదదైనను దానారూపాయలు పుచ్చుకొనక కొమార్తెనుబిలిచి "అమ్మాయీ! ఈరూపాయలీరొట్టెలోని కేలాగునవో పొరపాటున వచ్చినవి. నీవు వీనినిగొనిపోయి మనయుపకర్తయైన యాధనికునకు వెంటనే యిచ్చిరమ్మ"అని చెప్పిపంపెను. ఆచిన్నదియు రూపాయలను చేతబట్టుకొని తక్షణమే సంతోషపూర్వకముగా నాతనియింటికి బరుగెత్తికొనిపోయి యవి యాతనిముందుంచెను. ఆతడారూపాయలను మరలబుచ్చుకొనక "అమ్మాయీ! ఇవి ప్రమాదముచేత నీరొట్టెలోబడలేదు. నిన్నటి నీయోగ్యవర్తనమునకు బహుమతిగా నేను బుద్ధిపూర్వకముగా నీనిమిత్తము చిన్నరొట్టెనుజేయించి రూపాయలందులో బెట్టించినాను. ఈప్రకారముగానే నీవు ముందుగూడ నల్పసంతుష్టిగలదానవై యీశ్వరుడునుచేసిన దానితోడనే తృప్తినొందుచు సద్వర్తనముగలదానవై యుండెదు పక్షమున దేవుడు నీకెప్పుడును మేలుచేయుచుండును." అనిపలికి రూపాయలను మరలనిచ్చి పంపివేసెను.



జిల్లా బోర్డు పని:—

1. బోర్డు, కమిటీల ప్రకారము పని చేయవలెను. ఈ క్రింది స్థాయి ఉపసంఘముల నేర్పాటు చేయవలెను. (1) బడ్జెట్టు (2) ఆరోగ్యము, నీటిసప్లయి (3) విద్య (4) ఆసుపత్రులు, డిస్పెన్సరీలు (5) రోడ్లు చెట్లు సత్రములు, ప్రయాణీకుల బంగళాలు, (6) లైబ్రరీలు, విజ్ఞానప్రచారము, ఎగ్జిబిషనులు (7) నిమ్నజాతులు (8) గుత్తలు (9) ఆడిట్టు (10) అనవసర ఖర్చుతగ్గించుట, ఈ కమిటీలు 6 నెలలకు మారుచుండవలెను. 2. బోర్డు సభా వ్యవహారములన్ను, మినిట్లును తెనుగులో జరుగవలెను. 3. బోర్డుకు భారతదేశ వస్తువులనే కొనవలెను. ఈ జిల్లాలో దొరకే వస్తువులను ప్రోత్సహించవలెను. 4. రోడ్లు, బిల్డింగు కంట్రాక్టులను మధ్యవర్తులైన వ్యక్తులకు కాక, లేబరు యూనియనులకు ముందుగా ఇత్తుమని తెలియజేసి అట్టి లేబరు యూనియను లేర్పాటు చేయుటకు ప్రోత్సాహము చేయవలెను. 5. డిస్ట్రిక్టుబోర్డు పనులు జరుగుచున్న గ్రామములలో ఆయా గ్రామస్థులనుంచి కమిటీల నేర్పాటు చేసి, వారి కాయా పనులను తనిఖీ చేయవలసినదిగా కోరవలెను. గ్రామములలో గ్రామసేవా సంఘము లేర్పాటయినచో వానికి ప్రోత్సాహము కల్పించవలెను. గ్రామస్థులకు స్వయం సహాయ సూత్రమును నేర్పవలెను. 6. కడచిన 5 సం॥రములలో రోడ్ల మరమ్మత్తుకై అయిన సరాసరి ఖర్చులో నూటికి 20 వంతున ఖర్చుతగ్గించే ఉపాయములను పరీక్షించవలెను. ప్రయాణీకుల బంగళాలు, విశ్రాంతిగృహములు, సత్రములు, వీటి యందు దిగేవారివద్దనుంచి యెక్కువ రుసుములు వసూలు చేయవలెను. 7. ఇప్పటి సెకండరీస్కూళ్ళలో ఒకటి తగ్గించి దానిస్థానమున ఒక టెక్నలాజికల్ హైస్కూలును స్థాపించవలెను. స్కూళ్ళలో అన్‌ట్రెయిండు టీచర్లకు బదులుగా ట్రెయిండు టీచర్లను నియమించవలెను. ఫర్నీచరు, కంటింజెన్సీలు, ఉపకరణములు మొదలయిన వాటిలో అనవసరఖర్చులను తగ్గించవలెను. పిల్లల ఆటస్థలములను వృద్ధిచేసి, స్కూళ్ళలో దేశీయ కసరత్తుకు ఎక్కువ ప్రోత్సాహమివ్వవలెను. పిల్లలకు సహకారసంఘములను స్కూళ్ళలో ఏర్పాటు చేయవలెను. పిల్లల పుస్తకములు, కాగితములు, దుస్తులు, మొదలయినవానిమీద ఖర్చుతగ్గే పద్ధతి నవలంబించవలెను. సెకండరీ స్కూళ్ళలో వొకేషనల్ విధానమునకు ప్రాధాన్యమివ్వవలెను. ఒక అగ్రికల్చరల్ స్కూలును, ఒక వీవింగు ఇన్స్టిట్యూటును ఏర్పాటు చేయవలెను. స్కూళ్ళలో తోటపనిమీద శ్రద్ధ ఎక్కువ చేయవలెను. 8. దేశీయ వైద్యమునకు ఎక్కువ ప్రోత్సాహ మివ్వవలెను. అయిదారు గ్రామములకైనా ఒక వైద్యుడు, ఒక మంత్రసాని ఉండే ఏర్పాటు చేయవలెను. సంవత్సరమునకు అయిదుగురికయినా స్కాలర్‌షిప్పులిచ్చి మంత్రసాని ట్రెయినింగుకు పంపవలెను. ప్రస్తుతము గ్రామములలో పనిచేస్తూఉన్న మంత్రసానులసంఖ్యను నూటికి 10 వంతున ఎక్కువ చేయవలెను. రూరల్ డిస్పెన్సరీల సంఖ్యనుకూడా నూటికి 10 వంతున ఎక్కువచేయవలెను.

మెడికల్ రిజర్వు ఆఫీసర్ల సంఖ్యను తగ్గించి వారికి గ్రామములలో పని కల్పించవలెను. పశువుల అభివృద్ధికొరకును, వాటి రోగముల చికిత్సకును సంచార వెటరినరీ ఆసుపత్రుల నేర్పాటుచేయవలెను. 9. రోడ్ల ప్రక్క చెట్లను నాటునప్పుడు కేవలము నీడకొరకే కాకుండా వాటినుంచి ఫలసాయముకూడా వచ్చేటట్లు చూడవలెను. ఫలవృక్షములను, కాజారీనా చెట్లను, సీకాయి, కరక్కాయచెట్లు, రంగుల కుపయోగించే చెట్లు, మొదలయిన వాటినివాటి గుత్తలెక్కువ చేయవలెను. అట్లే పార్కు లేర్పాటుచేసి అందులోని చెట్లను గుత్తల కివ్వవలెను. 10. జిల్లా లైబ్రరీల ఆఫీసరును నియమించి, సంచార గ్రంథాలయముల నేర్పాటుచేసి, దానికొరకు కొందరు సేవకులను ఏర్పాటు చేయవలెను. 11. జిల్లా పంచాయతుల ఆఫీసరును వెంటనే నియమించి జిల్లాలోని పంచాయతులు సక్రమముగ పనిచేయునట్లు చేయవలెను. 12. గ్రామములలో నీటిసప్లయికొరకు ఇప్పటిబావులసంఖ్యకంటె నూటికి 10 వంతున ఎక్కువచేయవలెను. బావులు వర్ణభేదములేక అందరి ఉపయోగముకొరకు ఉండవలెను. 13. జిల్లాబోర్డుకు విద్యావిషయములలో సలహా యిచ్చు ఆనరరీ ఎడ్యుకేషనల్ అడ్వయిజరును ఏర్పాటుచేయవలెను. 14. జిల్లాలో మోటారుబస్సులను బోర్డే నడుపుకొనునట్లు చేయవలెను. దానికి తగినస్టాఫును ఏర్పాటుచేయవలెను. 15. జిల్లాబోర్డు సెంట్రల్ లైబ్రరీని వృద్ధిచేసి, అది అందరిఅందుబాటులోను ఉండేటట్లు చేయవలెను. 16. వృత్తిపన్నును తగ్గించి యాత్రికులపన్నును మార్కెట్లు సంతల పన్నులను ఎక్కువచేయవలెను. అట్లే ఫ్యాక్టరీలమీద పన్నును ఎక్కువచేయవలెను. 17. జిల్లాబోర్డు అన్నిశాఖలలోను ఖర్చులను నూటికి 10 వంతున తగ్గించవలెను. ప్రయాణపు ఖర్చులు బత్తాలరేట్లను తగ్గించవలెను. బోర్డుమెంబర్లు ప్రయాణపు ఖర్చులకై తామునిశ్చయముగా వ్యయముచేసినదానినే ఇవ్వమని కోరవలెను. అక్కరలేని ఉద్యోగములను, టెంపొరరీపోస్టులను ఎత్తివేయవలెను. 18. సాధ్యమయినప్పుడెల్ల తాలూకాబోర్డులు, పంచాయతులతో కలిసి పనిచేసి గ్రామముల అభివృద్ధియే ముఖ్యముగా ఎంచవలెను.

జిల్లాబోర్డువారు చేయవలసిన కొన్ని తీర్మానములు:—

(1) గవర్నమెంటువారు భవానీప్రాజెక్టును నిలిపి తుంగభద్రాప్రాజెక్టును వెంటనే ఆరంభింపవలెను. (2) మైసూరు గవర్నమెంటువారు అక్రమముగా మనజిల్లాలోని చెరువులకు ఆధారభూతములైన జలప్రవాహములకు గట్లుపోసి నీరురాకుండా చేయడమును మద్రాసు గవర్నమెంటువారు వెంటనే ఆపుదల చేయవలెను. (3) రాయలసీమకు వైద్యసహాయము శూన్యముగా ఉండుటవల్లను ఇక్కడివారు దూరదేశములకు పోయి వైద్యవిద్యను నేర్చుకొనుట కష్టముగానున్నది. గనుకను, ఈప్రాంతములలో ఒక అలోపాతిక్ మెడికల్ స్కూలును, ఒక ఆయుర్వేద, యూనానీ మెడికల్ స్కూలును వెంటనే స్థాపించవలెను. (4) ఈ జిల్లాలో వ్యవసాయాభివృద్ధికిగాను వెంటనే 5 అగ్రికల్చరల్ మిడిల్ స్కూళ్ళను, ఒక అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేషన్ ఫారమును గవర్నమెంటువారు ఏర్పాటుచేయవలెను. (5) పంచాయతీ గ్రంథాలయములకు గవర్నమెంటువారిచ్చుచున్న గ్రాంటును ఈ సం॥రంనుంచి తిరిగి ఇచ్చుచుండవలెను. (6) రాయలసీమను ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రదేశమునుంచి తొలగించుట విశ్వవిద్యాలయమునకును, రాయలసీమకును గూడలోపమును, అవమానకరముగను ఉండుటవల్ల మద్రాసు శాసనసభవారు వెంటనే ఆంధ్రవిశ్వవిద్యాలయ చట్టమును సవరించి రాయలసీమను ఆంధ్రవిశ్వవిద్యాలయములో చేర్చవలెను. మొదట ఏర్పడిన ఆంధ్రవిశ్వవిద్యాలయ చట్టము ప్రకారము అనంతపురమునందు రాయలసీమ విశ్వవిద్యాలయము నేర్పాటుచేయు చట్టమును తేవలెను. (7) అనంతపుర కళాశాలలోను, రాయలసీమలోని గవర్నమెంటు స్కూళ్ళలోను ప్రొఫెసర్లు, లెక్చరర్లు, ఉపాధ్యాయులును తెనుగువారిని మాత్రమే ఏర్పాటుచేయవలెను. (8) ఇప్పుడు బడులలో ఉపయోగించే పాఠపుస్తకములలో విజ్ఞానము తక్కువగను, భాషాప్రాముఖ్య మెక్కువగను ఉండడమువల్లను, భాషజనపా

మాన్యులకు దుర్బోధము కష్టసాధ్యముగ నుండుటవల్లను, విజ్ఞానబోధయే ప్రధానముగా నుంచి సర్వజన సామాన్యమైన భాషగల పుస్తకములనుమాత్రమే టెక్స్టుబుక్కు కమిటీవారంగీకరించునట్లు ప్రభుత్వమువారిని కోరవలెను. (9) పాఠశాల లన్నిటిలోను ఐచ్ఛికవిషయములను దేశభాషలో జేర్చునట్లు ఏర్పాటు చేయవలెనని ప్రభుత్వమువారినికోరవలెను. (10) ఆంధ్ర, మద్రాసు విశ్వవిద్యాలయములలో ఇంటర్మీడియేటు, బి. యే. తరగతులకు రెండోపార్టులో దేశభాషయొక్క ఉద్దేశము ఆక్టులప్రకారము జరుగుచుండ లేదుగనుక, ఆఉద్దేశము నెరవేరుటకు చర్యతీసుకోవలసినదని ఆవిశ్వవిద్యాలయములవారిని కోరవలెను. (11) గ్రామములలో పశువులఅభివృద్ధికి మంచిజాతి ఆబోతులను క్షేమనిధినుంచుకొని సప్లయిచేయవలసినదిగా సహకార సంఘములను సెంట్రల్ బ్యాంకును కోరవలెను. (12) గ్రామములలోని పశువులమేతకుగాను డిస్ట్రిక్టుబోర్డు ఆధీనములోనున్న కొంతభూమిని గ్రామముమొత్తము ఉపయోగమునకు వదలివేయవలెను. (12) ఆయా గ్రామములలోని చేతిపనులఅభివృద్ధికిగాను గవర్నమెంటువారు జిల్లాబోర్డుపరముగా గ్రాంటులనివ్వవలెను.

—చిలుకూరి లక్ష్మీనరసమ్మ.

నాడు — నేడు :—

వేలూరుజైలునుండి నేనిటీవలనే విడుదలబడి ఆర్డినెన్సులచే పరిపాలింపబడెడి యీపెద్ద జయిలునందు ప్రవేశించితిని. నాఆరునెలల యజ్ఞాతవాసమునందు ప్రచ్ఛన్నముగానుండినవిగా బోలు:-కొన్ని వృత్తులు నాలోనుదయించినవి. ఏకాంతమునందలి శాంతి, ఎడబాటునందలి కరుణము, పేదరికమునందలి తనివియు, కష్టమునందలి సహనము. ఒకదానివెంట నొకటి నా అనుభవమునకువచ్చినవి. అది భగవత్సంకల్పము. జయిలులోనున్నంత కాలము నేను మతగ్రంథములనెన్నిటినో జదివితిని. హిందీభాష నేర్చుకొంటిని. కవిత్వము సాధకము చేయగలిగితిని. దిక్కుదిక్కుల నుండెడు పక్షులు, ఒక్కగూటిలో జేరినట్లు ఏకాశయలబ్ధికయి, వరించిచేరబడిన నానాప్రాంతములందలి నారీమణులతో గడపిన నా ఆరునెలలు ఆరుఘడియలుగా గడచెను. ఒక కడుపునబుట్టిన అప్పచెల్లెండ్రలోలేని అపూర్వానురాగము కారాగారముచేరినమాకు కుదిరినది. ఈప్రపంచమునందలి భౌతికబంధనములను సులభముగ త్రెంచుకొనుటకు మహాత్ముని ఉపదేశము మాకుతోడ్పడినదిగాని, జయిలులో నాసోదరీమణులతో నాకేర్పడిన ఆత్మీయానుబంధము త్రెంచుకొనుటకు యేమహాత్ముని ఉపదేశముగూడ నక్కరకురాదని నానమ్మకము. మమ్ముబంధించిన గవర్నమెంటునారే గడువయిన మరుని మునమున గడపదాటించి బయటకుపెట్టుదురు. కావున విధిలేక అశాంతిమందిరమునుండి, అప్రేమకిరవయిన సోదరీమణులనుండి నాభౌతిక కళేబరము బయటపడినది. ఐహికమునకుగాని ఆముష్మికమునకుగాని, అదు దాని నపేక్షించి, చేయుమగ నానికృషిసిద్ధిపొందదు. ప్రకృతము స్వరాజ్యసాధనకు సోదరసోదరీమణులు, ఏకముఖముగా కృషిసేయుచున్నారు గాన మహాత్మునితపము ఫలించినదనియు, మాయాశయములు సిద్ధిపొందినవనియు నేజెప్పగలను. స్వరాజ్యము స్వరాజ్యమనగా నేదియోమనము మాడని ఒక కొత్తదిఅని అందరివలె నేనును మొన్నమొన్నటివరకును అనుకొనినదానను. కానినాచెఱసాల యనుభవమున స్వరాజ్యము వచ్చినదని గ్రహించితిని. దేశమోక్షముగాని, దేహమోక్షముగాని, మనస్సుమారుటలోనే యున్నవని నాయనుభవము.

—చుండూరి రత్నమ్మ.

స్త్రీలు — ఇన్సూరన్సు పద్ధతులు :—

ఈప్రపంచమున ప్రస్తుత పరిస్థితులెట్లు పరిణమించుచున్నది నారీలోకముఎరింగియే యున్నారు-విద్యావిషయమేమి, ఉన్నతోద్యోగములేమి. ఇది యడిలవనెల అన్నిసంస్థలలోను స్త్రీలేముందంజ వేయుచున్నారు గాని ఇన్సూరన్సుకంపెనీలలో మాత్రము స్త్రీలుపాల్గొనుటకు జంకుచున్నట్టు కన్పించుచున్నది-అన్నిశాఖలలో

కంటె భీమావ్యాపారములు విద్యావతులగు స్త్రీలు నిర్వహించుచున్నచో అనేకమంది గృహిణులచే భీమాలు
చేయింపవచ్చును. ఇతరదేశములలో ప్రతిస్త్రీ, పురుషుడును తమరాబడి ననుసరించి భీమాలు జేయించుకొం
దురు-కాని మనహిందూదేశమునమాత్రము అట్లుచేయించుటలేదు. భీమాలు పురుషులకంటె స్త్రీలకే ముఖ్యా
వసరమైయున్నవి. ఏమన పురుషుడు తనజీవితపర్యంతము ఏదోయొకవిధ ధనార్జనజేసి జీవించును, జీవింప
జేయును. స్త్రీ అట్లుగాక అబలయై తనజీవిత మెవరిపై నాధారపడజేయుటచే (పురుషుడు అస్వస్థుడైనను-
కాలధర్మమునొందినను) తగని ఇడుమలగుడువవలసివచ్చుట కనులారగెన్నియో కుటుంబముల జూచుచున్నా
ము-అట్టిసమయమున తనకేవిధమైన జీవితభీమాయున్నను అడ్డుపడును. భూవసతియున్నచో అప్పులవారు
గాని, దాయాదులుగాని గొనిపోవుట తటస్థించును. ఇదియునుంగాక తమకూతుండ్రయొక్కయు, కొమారుల
యొక్కయు, వివాహవిద్యాభివృద్ధులకుగూడ పాలసీవేయుట మంచిది. అట్లువేసినచో వారు పెద్దవారగు
టతోడనే డబ్బుకొరకు వెతకులాడక వారివారి నిర్ణయకార్యము లతిలేలికగ నెరవేర్పవచ్చును. వీనికన్నిటికి
బాధ్యస్థురాలు స్త్రీయేగాన తమతమ పురుషులనెట్లోని యొప్పించి తమజీవితమును, బిడ్డలజీవితములను భీమాల
జేయించుకొనుట శ్రేయస్కరము. స్త్రీల జీవితభీమాలుజేయించుటకు పురుషులు ఏజంట్లుగానుండుటకంటె
స్త్రీలే ఏజంట్లుగాను, ఆర్గనైజర్లుగను, చీఫ్ఏజంట్లుగను పనిచేసినచో దేశసేవ, మానవసేవ చేయుటయే
గాక స్త్రీలోకము నుద్ధరించినవారగుదురు. మనము అట్టిభీమాలు చేయించదలచుకొనినచో విదేశకంపెనీలలో
గాక, దేశీయకంపెనీలలో జేయించుటవసరము. దేశీయకంపెనీలలో ఆంధ్రదేశమున కందుబాటుగానుండి,
రైళ్లకూడలిస్థానమగు బెజవాడలో ప్రధానకార్యాలయ మేర్పరచుకొని, మ. రా. రా. శ్రీ-నాయని వేంకట
రంగారావు బహద్దర్ ఆఫ్ మునగాల యెస్టేటు జమీందారువారి ఆధిపత్యమున నిర్వహింపబడుచున్న "డెక్కన్
అస్యూరన్సుకంపెని" ఒకటిఆయియున్నది. ఇందు శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ బి. ఎ.; డా. ముత్తులక్ష్మి
రెడ్డి, అంబుస్వామినాధను, వగైరాగార్లు కొంతమంది స్త్రీఅడ్వైజరీబోర్డు పరిపాలించుచున్నారు-ఇతరకంపెనీ
లలోవలెగాక దీనిలో స్త్రీలకు అదనపురుసుములేదు-అన్నివిషయములలోను పురుషులతో పాటు సమాన
హక్కుల నిచ్చియున్నారు-అతిశాంతస్వభావులును, కార్యదీక్షాదురంధరులునుఅగు శ్రీయుత శీలం శెట్టి గోవర్ధన
రావుగారు మానేజింగు డైరెక్టరుగనుండి కంపెనీఅభివృద్ధికి మిక్కిలిపాటుబడి పనిచేయుచున్నారు. కాన
నోఆంధ్రదేశసోదరీమణులారా! భీమా అవస్యకతనెరింగి-మీమీభర్తలను, సోదరులను, పుత్రులను, ప్రార్థించి
తప్పక మనకు సమస్తసౌకర్యములనిచ్చిన డెక్కన్ అస్యూరన్సుకంపెనీలో జీవితభీమా, ఉచితభీమాల జేయిం
చుకొని సౌఖ్యమునొందుదురని తలంచుచున్నాను."

—అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మ.

అంటరానివారు: పిఠాపురము మహారాజావారి దానము:—

"శ్రీపిఠాపురం మహారాజావారు అస్పృశ్యతానివారణకొరకు 5000 రూపాయిలు విరాళ మొసంగిరని
శ్రీ ఎం. సి. రాజాగారు పత్రికలలో వందనములను దెలిపిరి. దానినిగూర్చిన ప్రస్తావన గతమాసము గృహల
క్ష్మిలోగలదు. గడచిన 25 ఏండ్లలో శ్రీమహారాజావారు ఆదిహైందవుల ఉన్నతికొరకు ఎన్నిలక్షలరూపా
యిలు ఖర్చుచేసిరో అది పత్రికలలో ప్రచురింపబడలేదు. వారు ఇట్టిగుప్తదానములెన్నియో చేయుచుందురు.
రావుబహద్దూరు ఎం. సి. రాజావారిసతీమణి పిఠాపురం వచ్చినపుడు ఆఆంధ్రబాలబాలికలఆశ్రమములను
దర్శించిరి. ఆనందించిరి. ఈరెండు సంస్థలలో 100 మందిబిడ్డలుగలరు. (బాలుర 60, బాలికలు40)నాలుగుపల్లె
టూళ్లలో స్కూళ్లుగలవు. అందులో బాలబాలికలు సుమారు 150 మంది చదువుచున్నారు. ఇందులకుగాను
సంవత్సరము ఒక్కంటికి సుమారు పండ్రెండువేలరూపాయిలు ఖర్చగుచున్నవి. కాకినాడలో సుమారు 25
ఏండ్లక్రితము మహారాజావారితండ్రిగారిపేరను ఒకఅనాధశరణాలయము స్థాపింపబడినది. అందులో ఇప్పుడు

సుమారు నూరుమంది బిడ్డలుగలరు. అన్ని వర్ణములవారు చేర్చుకొనబడుదురు. ఇందులో ఆదిఆంధ్రబాలబాలికలు కలరు. ఈసంస్థనిమిత్తము సాలుకు సుమారు పదిహేనువేలరూపాయిలు (15000) ఖర్చగుచున్నవి."

—రొక్కం సుందరమ్మ.

## స్త్రీల సమస్యలు: స్త్రీల బాధ్యతలు :—

[రాజమహేంద్రవరమునజరిగిన ఆరవఆంధ్రరాష్ట్రీయమహిళాసాంఘికవిద్యావిషయక మహాసభాధ్యక్షురాలి ఉపన్యాసమునుండి]

"స్త్రీపురుషులను సమానముగ కల్లోలపరచుచుండిన అస్పృశ్యతాసమస్యను పరిష్కరించువిషయమున మనధర్మమును నిర్ణయించుట ప్రథమకర్తవ్యము. హిందూసంఘనిర్మాణములో ఏకారణాంతరములచే "అస్పృశ్యులు"నబడువారు ప్రత్యేకింపబడిరో విచారించుటలో కాలము వృథాపుచ్చుటకంటె మనసంఘమున కపమానకరముగ మనకండ్లయెదుట కనబడు అస్పృశ్యులను హిందూసంఘమందలి "సవర్ణులు"నబడువారితోపాటు సమానులుగ గ్రహింపబడుటకు చేయబడుచున్న సాధనోపాయములలో స్త్రీలు ముందంజవేయుట అత్యావసరము. మానవులలో కొందరంటరానివారనుటయే ప్రకృతివిరుద్ధము, అమానుషము. నిజముగ ఆలోచించిన రెండుల ఏడుకోట్లకుపైగానున్న అస్పృశ్యుల ఇప్పటి నీచస్థితికి కారణము మనమే! ప్రతిజీవికి కావలసిన కనీసపు సదుపాయములనుకూడ తరతరములుగా మనము వారికి నిరాకరించి వారిని అధోగతుల పాలుచేసితిమి. వీరిని ఉద్ధరించుట మనధర్మము. మనసంఘముచేత నిరాకరింపబడిన వీరిని విదేశమునుండి వచ్చిన మిషనరీలు ఆదరించి ఏయుద్దేశ్యముచేతనైననేమి వీరి కనేకసదుపాయములను చేయుచున్నారు. కొంచెము శ్రద్ధతీసుకొనినయెడల మనము వీరికంటె పదిరెట్లు ఎక్కువగ సాయముచేసి మనవారిని మనలో చేర్చికొని ఆచారవ్యవహారములయందు, శుభ్రతయందు వారిని మనతో సమానముగ చేసికొనగలము. ప్రతిపల్లెయందును ప్రతిపట్టణమందును స్త్రీలు యిందుకు సంఘములను స్థాపించి వారియిండ్లకు తరుచువెళ్లి ఆదరణతోను నిదర్శనపూర్వకముగను మంచిఆచారములను అలవాటుచేయవలయును. మనహిందూసంఘమునకు గొప్పకళంకమయిన ఈఅస్పృశ్యత నివారించువరకు ఏఆంధ్రస్త్రీ విశ్రాంతిపొందగలదు? పురాతనహైందవచరిత్రను ఇంచుక స్మరించినచో హిందూసంఘమున భారతనారీమణు లున్నతస్థానమలంకరించినటుల విశదమగుచున్నది. సీతలేని రామాయణముగాని, ద్రౌపదిలేని భారతముగాని అర్థవిహీన మనుటలో ఆశ్చర్యములేదు. సమయోచితమయిన సలహాలనిచ్చి రామాయణభారతయుగమునాటి స్త్రీలు చరితార్థులయిరి. నవయుగమునందుకూడ స్త్రీలకు సహజమయిన సాహసము, ఉదారత, బుద్ధికుశలత లేకపోలేదు. ప్రస్తుతరాజకీయరంగమునందు మనసోదరీమణులు చూపుచున్న కార్యదీక్షయే యిందుకు నిదర్శనము. కాని అవన్నియు సంఘమును వేరుపురుగులవలె తొలుచుచున్న దురాచారములవలననేమి విద్యాభివృద్ధికి కావలసిన సౌకర్యములు లేకపోవుటవలననేమి వికసింపజాలకున్నవి. ఆర్థికస్వాతంత్ర్యములేనిది స్త్రీ తన అర్హస్థాన మాక్రమింపజాలదు. ఆర్థికముగ స్త్రీ తన్ను సంరక్షించుకొనలేదను అపవాదము నిర్హేతుకము. మహమ్మదీయ క్రైస్తవధర్మశాస్త్రములలో పురుషులతోపాటు స్త్రీలును వారసత్వపుహక్కులుకలిగి ఆర్థికస్వాతంత్ర్య మనుభవించుచుండ హిందూస్త్రీలకట్టి సమానధర్మము లేకుంట శోచనీయము. ఇది గ్రహించియే మైసూరు మొదలుగాగల సంస్థానములలో స్త్రీల వారసత్వపుహక్కులు అమలులోనికి తెచ్చుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. బ్రిటిషుఇండియాలోను ఈవిషయమయి శాసనసభలలో చర్చలు ప్రారంభమయినను తగుమార్పులింతవరకును జరుగకుండుట విచారకరము. హిందూసమిష్టికుటుంబమున భర్తచనిపోగానే భార్య మనోవర్తికిమాత్రము అర్హతకలిగి జీవన్మృతయగుచున్నది. తాను గన్నపిల్లల సంరక్షణవిషయమునగూడ స్త్రీ అస్వతంత్రురాలుగ నున్నది. ఆర్థికస్వాతంత్ర్యము లేకపోవుటచేతనే పురుషునితోపాటు స్త్రీకి నియోజకపు (ఓటింగు) హక్కులేక సరియైన ప్రాతినిధ్యము

శాసనసభలలో లేకపోవుట కష్టించుచున్నది. అందుకనియే ప్రత్యేకప్రాతినిధ్యముకొరకు మనమొకప్పుడు తొందరపడవలసివచ్చియుండెను. ప్రత్యేకప్రాతినిధ్యములు దేశారిష్టములని ప్రస్తుతకలవరము స్పష్టపరచినది. సమానవారసత్వపుహక్కుబాధ్యతలు పురుషులతోపాటు మనమును పొంది ప్రాతినిధ్యము సంపాదించవలెను. మరియు ప్రతిస్త్రీయును నియోజకపు హక్కుగలిగి యుండవలెను. ఈవిషయమయి ఆందోళన జరిపి విజయసిద్ధిగాంచుటకు మనమందరము ప్రయత్నింపవలయును. స్త్రీ తనఆస్తిని తనయిష్టానుసారముగా దాన, వినిమయ, విక్రయాది సమస్తహక్కులతో అనుభవించుటకు వీలగునట్లు శాసనములు మార్పు కావలయును. ఆర్థిక స్వాతంత్ర్యము స్త్రీలకుండినగాని సంఘమును పీడించుచున్న అతిబాల్యవివాహాదిదురాచారములు, పడుపువృత్తి మొదలుగాగల అవినీతిప్రవర్తనలు రూపుమాయవు. శారదాగారి కృషివలన పదునాల్గు సంవత్సరములకు తక్కువ యీడుగల బాలికలకును, పదునెనిమిది సంవత్సరములకు తక్కువ యీడుగల బాలురకును వివాహములు జరుగకూడదని శాసనములు ఏర్పడినను అమలుమాత్రము జరుగుటలేదు. ఇందుకు కారణము సంఘముయొక్క ఉపేక్షయే. ఆరోగ్యశాస్త్రరీతిని ఆలోచించిన మనదేశమున ఇరువదిసంవత్సరములలోపు ఈడుగల స్త్రీగర్భవతియగుట ఆరోగ్య భంగకరమనుట స్పష్టము. అట్టియెడ వివాహవిషయములో తొందర పడుటకు కారణమగుపడుటలేదు. మనశాస్త్రానుసారము రజస్వలానంతరవివాహములు ద్విజులకు నిషేధములను చాటుచున్నను కాలానుసారముగ ఆపద్ధతి మార్చుకొనవలసిన తరుణమిది. స్త్రీలు తమ బాగోగులు చక్కగ గ్రహించి బాల్యవివాహపిశాచముల నోటబడకుండ తమ బిడ్డలను కాపాడ సర్వప్రయత్నములను చేయవలయును. బాల్యవివాహమువలన కలుగుచున్న అనర్థకములనుగూర్చి ప్రజలకు బాగుగ బోధించి తీవ్రముగ ప్రచారముచేయుట యెంతో అవసరమో అనుభవజ్ఞులగు మీకు నేను ఎక్కువగ చెప్పవలెనా? ఇతర అనర్థకములన్నిటికి పైగా బాలికల విద్యాభివృద్ధికి గొప్ప యాటంకము కలిగించుచున్నది ఈబాల్యవివాహమే. కనుక శారదాచట్ట మతిక్రమించి జరుపబడు వివాహములవిషయమయి తగుచర్య జరుపుటకు సంఘములు పెట్టుట మన ముఖ్యకర్తవ్యము. బాలవితంతువులసంఖ్య పెరుగుటకు మూలకారణము బాల్యవివాహములేయని సంఘసంస్కర్తల అభిప్రాయము. 1931 సంవత్సరపు జనాభాలెక్కనుబట్టి, మన దేశమున హిందూవితంతువులసంఖ్య 2 కోట్లను మించినదనియు, అందు ఇరువదిఅయిదు సంవత్సరములు లోపువయస్సువారు పదునయిదు లక్షలకుపైగా ఉన్నారనియు తేలుచున్నది. మరి యేదేశమందును ఈ ఘోరము కనపడదు. దీనికి మనము కన్నులు మూసుకొనిన ప్రయోజనములేదు. ప్రతిక్రియ బాల్యవివాహములను రూపుమాపుటయే. అంతవరకును వివాహమాడవలెననెడి బాలవితంతువులకు అట్టి సౌకర్యములను కలుగచేయవలెను. విద్యకోరినవారికి తగు ఏర్పాటుల నొనరించినవారు సంఘోపకారిణులగుదురు. ఈవిషయమున ఆంధ్రలోకమునకు ఆదర్శపాత్రులయిన కీర్తిశేషులగు శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారిని మన మెన్నడును మరువజాలము. ఈ సందర్భమున మరియొక ముఖ్యాంశమును గమనించవలెను. విద్యాలోపమువలననో, వితంతువుల వివాహముపట్ల సంఘమునకుగల అనాదరాభావమువలననో, ఇంద్రియనిగ్రహలోపమువలననో, కుతంత్రులగు పురుషుల మాయలలోచిక్కుటవలననో పతితులయి నిరాధారులయి కష్టపరంపరల నందుచున్నవారికి ఆశ్రయము లేర్పరచి విద్యాదిసౌకర్యములనిచ్చి సంఘసేవకురాండ్రుగా చేయు శరణాలయములను స్థాపించుట అవసరము. వ్యభిచారమే వృత్తిగాగల ఒక ప్రత్యేకకులము మన దేశమునందు తప్ప వేరెచటను లేదు. ఈదురాచారమును రూపుమాపుటకు శ్రీమతి డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డి చెన్నరాజధాని శాసనసభలో చేసినకృషి మిక్కిలి మెచ్చుకోతగినది. వ్యభిచారగృహముల నిర్మూలముకొరకును, పడుపువృత్తికొరకు స్త్రీలను బాలికలను విక్రయించుట మొదలుగాగల దురాచారముల మాన్పించుకొరకును ఆమెపడుచున్న శ్రమకు మనమందరము చాల కృతజ్ఞులము. ఆంధ్రదేశమందలి స్త్రీసంఘములన్నియు ఆమెకు సహాయపడుట అవసరము. వివాహవిముక్తి

మన దేశమున పాశ్చాత్యదేశములందువలె చట్టమవసరమా అను విషయమునుగురించి తీవ్రమయిన భిన్నాభిప్రాయములు కలవు. వివాహవిముక్తిచట్టము పెట్టిన వెంటనే హిందూస్త్రీలందరు నీతిబాహ్యలగుదురని కొందరి అభిప్రాయము. ఇది కేవలము భ్రమ. ఈచట్టము ఆచరణలోనున్న క్రైస్తవముసల్మాను స్త్రీలు తమ నీతిని కాపాడుకొనుచుండుట మనము చూచుచునే యున్నాము. హిందూస్త్రీలకుమాత్రము భయమెందుకు? స్త్రీపురుషులకు సమానహక్కులను, సమానవిముక్తిమార్గములను, అపేక్షించుట స్త్రీలయొక్క హక్కుబాధ్యతలను కాపాడుకొనుటకేగాని మరొకటికాదు. దుర్మార్గుడగు ఒకానొకపురుషుని బాధలను తప్పించుకొనగల సాధనముకొరకే స్త్రీ ఈశాసనము కోరుచున్నది. పునాదిని విడిచి కట్టడముకట్టినయెడల అది గట్టిగానుండజాలదు. విద్యాసంబంధమయిన ఇట్టి సమ్మేళనములలో తీర్మానములు చేసినమాత్రమున ప్రయోజనములేదు. రాజకీయపరిస్థితులు చక్కబడినగాని మన సాంఘిక, విద్యాసంస్థలు నిజముగా మనకు అనుకూలపడవు. ఇందుకు ముఖ్యమయినది జాతీయ ఐకమత్యము. మూలములను వదలి చిన్నచిన్న పైపై విషయములలో భేదములను కల్పించుకొని దేశము అనవసరకలహముల పాలగుచున్నది. ఇట్టి భేదములు స్త్రీలలో పుట్టకుండుగాక యని నాప్రార్థన. స్త్రీవిద్య యితరనాగరికదేశములలో చక్కగా అభివృద్ధి నొందినది. ప్రస్తుతము మనముమాత్రము చాల వెనుకబడియున్నాము. ఇటీవల కలవెత్తినజపాను, టర్కీ, ఆఫ్గనిస్థానము మొదలయిన స్వతంత్రపరిపాలన అనుభవించు ప్రాచ్యదేశములు సహితము విద్యావిషయమున పశ్చిమదేశములకు తీసిపోకుండ వృద్ధిపొందినవి. ఇప్పుడు హిందూదేశమున సగటున వేయిమంది స్త్రీలలో చదువను వ్రాయనుగలవారు యిరువదియొక్కరు మాత్రమే! పైనచెప్పిన దేశములలో దాదాపు ప్రతిస్త్రీయును చదువను వ్రాయను నేర్చినదై యుండును. కనుక మనదేశములోకూడ అధమపక్షము పదునాల్గుసంవత్సరములకు లోపుననున్న ప్రతిబాలికయు ప్రతిబాలుడును బడికివెళ్ళవలెనను నిర్బంధము అవసరము. మఱియు, స్వాతంత్ర్యముగల యితరదేశములలో ప్రభుత్వాదాయములలో చాలభాగము విద్యకొరకు వెచ్చింపబడుచుండ మనదేశమునందు బహుస్వల్పభాగముమాత్రము విద్యనిమిత్తము ఖర్చుపెట్టబడుచుండుట శోచనీయము. మనదేశమే స్వతంత్రదేశమయినచో ఈస్థితికలుగదు. ఆంధ్రదేశమున స్త్రీలకు ఉపయోగకరములగు విద్యాసంస్థలు బహు తక్కువగనున్నవి. ఆలోటు తీర్చుభారము ఆంధ్రవిశ్వవిద్యాలయమువారిపైనను, దొరతనమువారిపైనను కలదు. కాని ధనవంతులగు మహారాజులను, జమీందారులను, వర్తకశిఖామణులను, యితరులను స్త్రీలవిషయమున తమబాధ్యతను నిర్వహించుకొరకు విద్యాలయములు, వసతిగృహములు, మొదలయినవి స్థాపింప సహాయముగోరి అందుకు తగు కృషి చేయవలయును. మనదేశమున పురుషుల విద్యాస్థితియే హీనముగనున్నది. సక్రమశిక్షణమొసగగల విద్యాసంస్థలే మనదేశమునందు అరుదు. ప్రస్తుతవిద్యావిధానము నానాటికి మనలను బానిసలనుగా తయారుచేయుటకు ఉపయోగపడుచున్నది. కాని జాతీయగౌరవమును ప్రతిష్టను కాపాడుకొనగల పౌరులుగను, ధీరులుగను మనలను చేయుటలేదు. శరీరవ్యాయామమునకుగాని, జీవనాధారమునకు పనికివచ్చు పరిశ్రమలు నేర్పుటకుగాని ఇప్పటి విధానమునందు సరియైన స్థానములేదు. ఇట్టిస్థితిలో స్త్రీలసంగతి వేరుగ చెప్పనక్కరలేదు. అయినను నిరుత్సాహపడక నిర్బంధోచితప్రాథమికవిద్యాపాఠశాలలద్వార ప్రతిబాలికయు చదువను వ్రాయను నేర్చుకొనునట్లు మనము చేయవలయును. స్త్రీల విద్యావిధానములో బాలికలు పెద్దలై తల్లులగునప్పుడు వారల ప్రత్యేక అవసరములకు తగిన విషయములనుకూడ నేర్పుటకు ఏర్పాటు చేయవలయును. బాలికలకు విరివిగ విద్యనేర్పించుటకు గొప్ప ఆటంకము మనదేశాచారమయిన ఘోషాపద్ధతి. ఇది ఉత్తరహిందూస్థానమందు మిక్కిలి ప్రబలముగా నున్నది. ఘోషాపద్ధతి నశించినగాని విద్యాభివృద్ధికలిగి, స్త్రీలకుగల స్వాతంత్ర్యేచ్ఛ కొనసాగదు. మరియును ఈ ఘోషాపద్ధతివలన తక్కిన విషయములు అటుంచినను ఆరోగ్యాభివృద్ధికి తీరనికొరత వాటిల్లుచున్నది. ఘోషాలేనికుటుంబములలోని



'డిసీడిల్ స్వి' అను నీరంజక్ పాలు
గారి ఫిల్ముసందలి ప్రధాన
నట్టువరాలు



పారసీ కుటుంబములోని సంపన్న స్త్రీ

పర్షియను స్త్రీలకు పట్టుదుస్తులన్న చాలప్రియము. చిత్రవిచిత్రవర్ణములతో బుట్టాలు వేసిన దుకూలముల నెల్లప్పుడును వీరు ధరించుచుందురు.

స్త్రీలకంటె ఘోషాగల కుటుంబములలోని స్త్రీలు మంచిగాలి తగినంతవెలుతురు అనుభవింపజాలక క్షయ మొదలయిన దీర్ఘవ్యాధులపాలయి పోవుచున్నారు. విద్యావంతులయిన మనసోదరులు తమ స్త్రీలను ఈదౌర్భాగ్యస్థితినుండి విముక్తిచేయుదురుగాక! ఘోషాపద్ధతిని రూపుమాపు చేయు ప్రయత్నములు జరుగుటలేదని నాఅభిప్రాయముకాదు. ఘోషాపద్ధతి కలవడిన సాంప్రదాయములలో పుట్టి పెరిగి అఖండవిద్యావతియై స్త్రీలహక్కుల కొరకు సర్వదా పాటుపడుచున్న మన సోదరి నాజిరుద్దీనుసతియే యిందుకు తార్కాణము. ఘోషాపద్ధతిలో మునిగితేలుచుండి ఆపద్ధతి భగవన్నిర్మితసిద్ధాంతమని నమ్మియుండిన తుర్కీ, ఆఫ్గనిస్థాన్ మొదలయిన మహమ్మదీయరాజ్యపు స్త్రీలు సంస్కర్తల సహాయమున ఘోషాపద్ధతి మానిగదా ఆయాసామ్రాజ్య సౌభాగ్యకారకు లగుచున్నారు? బుద్ధిబలముతోపాటు దేహబలముకూడ స్త్రీలకు అత్యవసరముకదా! విద్యాలయములన్నియును శరీరవ్యాయామమును నిర్బంధముగానుంచవలెను. శరీరసౌష్ఠవములేని చదువు చదువుకాదు, అందుకనియే మనపూర్వులు "శరీరమాద్యంఖలుధర్మసాధనం" అని చెప్పియున్నారు. పురుషులతోపాటు స్త్రీలును సకలశాస్త్రములను అభ్యసించుటకు ఎట్టిఆటంకమును ఉండకూడదు. స్త్రీలును వారివారి అభిరుచులననుసరించి వృత్తులు అవలంబించుటకు అవకాశములుండవలెను. విద్యాలయములద్వార విద్యనేర్పుట అటులుండగా వయస్సువచ్చి గృహకృత్యములలో పాల్గొను స్త్రీలకుకూడ విద్యనేర్పుకొనుటకు అవకాశములు ఏర్పరచుట అవుసరము. వారివారికి వీలయినవేళలందు ప్రపంచవిషయములనుగురించి, శిశుపోషణ విషయములను గురించి, జ్ఞానము విరివిగ వెదజల్లవలయును. మన మహిళాసంఘములు స్థానికసంస్థలయొక్కయు పురజనులయొక్కయు ఔదార్యమున పైయేర్పాటులను క్రమముగ సాగింపగల్గినయెడల వానియునికి సార్థకమగును. ఇదిగాక మహిళాసంఘములు గమనింపవలసిన విధానములు మరికొన్నిగలవు. శిశుపోషణాలయములను స్థాపించి తల్లులందరును తమశిశువులను తరుచుఅచ్చటకుతోడ్కొనివచ్చి వారిఆరోగ్యమును పరిశీలింపచేయుటయేగాక తాముకూడా తమకుకావలసిన అన్నివిషయములందు వైద్యురాలి సలహాను పొందవలయును. మరియు గర్భిణీస్త్రీలకు అప్పటప్పటికి అవసరమయిన సలహాలనియ్యగల సంస్థలను ఏర్పాటుచేయవలయును. కనీసము వారమునకు రెండు పర్యాయములు గర్భవతులందరు అట్టిచోట సమావేశమయి వైద్యురాలిద్వార వారివారి స్థితులను గురించి తెలిసికొని చేయవలసిన విధులను నేర్చుకొనవలయును. వీనికితోడు గర్భిణీస్త్రీల సహాయనిధి అను ఒకనిధి (Maternity Fund) ప్రతిమహిళాసంఘమువారుసమకూర్చవలెను. పనిపాటలవలన జీవించు బీదతల్లులకు ప్రసవపూర్వము, ప్రసవానంతరము కొంతకాలము పనిలేకుండజేసి తగినంత పాలు మొదలయిన మంచిఆహారమును సేవించుటకు ఆనిధినుండి తగుసహాయము చేయవలయును. జాతి పురోభివృద్ధికి ఇది చాల ముఖ్యము."

—ఆచంట లక్ష్మీదేవి ఎం. బి; బి. యస్.

నింబః లేక వేము :—

"నింబః అనగా తెనుగున వేపచెట్టు అని అర్థము. దీనినే ఇంగ్లీషున Margosa Tree అని అందురు. ఇది అత్యంతమును చేదుగుణముగలదిగావుండును. ఇది మనదేశములో దాదాపు అన్నిప్రాంత్యములందును దొరకును. వైద్యవిషయములో దీనియొక్క ప్రతిభాగమున్నూ ఎంతో ఉపయోగకారిగా నుండినప్పటికిన్ని ప్రస్తుతవైద్యవేత్తలు దీనియొక్క ఉపయోగమును తగినంత ఆచరణలో పెట్టకపోవుటయూ తదితరులు దీని ఉపయోగమును తెలుసుకొనజాలక పోవుటవల్లను దీనిప్రాశస్త్యము మరుగుపడి వున్నదని తలంచవలసివున్నది. ఈచెట్లను దొడ్లలోను, పెరడులలోను వేసి పెంచుటయున్నూగలదు. మండువేసవియందు ఈచెట్లనీడన విశ్రమించిన మిక్కిలి చల్లగాను ఆనందదాయకముగాను వుండును. మఱియు దీని లేపనభక్షణాదులవలన శీతము చేయు స్వభావము గలిగివుండును. అపక్వముగానుండు వ్రణములను పాకమునొందించుటయందును మాన్పుటయందునుగూడా దీనియందపరిమితశక్తిగలదు. అదియునుంగాక తాపము, శ్లేష్మము, రక్తదోషము, పిత్తము,

కుష్టము, దురద, వ్రణము, విషూచి, కడుపునొప్పి, శోఫతో కూడిన వ్యాధి, కాస, దప్పి, విషజ్వరము మొదలగునవి హరింపుటయం దమోఘముగా పనిచేయును. ముదురువేపచెట్టు మొదలియందు తొక్కతొలచి అందులో పక శేరుబియ్యపుఅన్నము పడవేసి అచక్కతోనే బిరడావేసి ఆవుపేడపూసి ఆరుమాసములుంచి తీసిన ఆయన్నము ఎఱ్ఱగానుండును. దానిని యెండించి చూర్ణముచేసి పూటకుపావుతులం మోతాదులో ఆరుమాసములు సేవించిన కుష్టురోగము నివారించును. దీనిచెక్క కషాయము లేక చూర్ణము చలువచేయును. దాహము, శ్లేష్మము, వికారము, వాంతి, రక్తపైత్యము, బలమగుపైత్యరోగములు, సర్వమేహములు, చర్మవ్యాధులు, క్రిములు, దురద, కుష్టు, వ్రణములు, శీతపైత్యవ్యాధులు మొదలగునవి నశింపచేయును, విరోచనములు విషజ్వరములుహరించును. శరీరతత్వమును మార్చును. పొట్టకు బలమునిచ్చును. దేహమునకు సత్తువజేయును. వాతనొప్పులు మేహవాతనొప్పులు మొదలగునవి హరింపజేయును. దీనిచెక్కతో బాగుగాకాచిన గాఢకషాయము గంట కొకసారి యిచ్చిన చలిజ్వరములు, విడచి విడచివచ్చు జ్వరములను పోగొట్టును. అజీర్ణముతో గూడిన పురాణజ్వరములుసహా నివర్తింపజేయును. కొయినా (Quinine)కు బదులుగా దీనినివాడవచ్చును. దీనిచెక్కలను కాల్చిమసిచేసి వేసిన కురుపులు మానును. దీనిపుల్లతో అనుదినము దంతధావనముచేసిన పైత్యహరము, నోటిదౌర్గంధ్యమును వదలించును. రుచినిపుట్టించును. వేపకల్లు రక్తమును శుభ్రపరచును. పొట్టకు బలమునిచ్చును. వేపజిగురు కఫమునుహరించును. అతిమూత్రమును కట్టును. ఈజిగురు బాగుగాఎండించిచూర్ణముచేసి పూటకు పావుతులం మోతాదుతోసమం కలకండపొడిచేర్చి పుచ్చుకొనిన రక్తగ్రహణి కట్టును. స్ఫోటకము మొదలగునవి తగిలినబిడ్డలకు సంభవించెడు జిగటవిరోచనములు, రక్తవిరోచనములు మొదలగువాటికి వయఃపరిమాణమననుసరించి తమిదగింజంత నల్లమందుచేర్చి మాత్రచేసియిచ్చిన తప్పక కుదురును. (నల్లమందు ఎక్కువమోతాదు కూడదు). వేపనూనె మిక్కిలి చేదుగానుండును. వేడిచేయును, శరీరతత్వము మార్చును. లోపలికి పుచ్చుకొనుటవలన ఉబ్బసము, మూర్ఛ, పాండురోగము, శ్లేష్మవాతము, క్రిమిరోగము, కుష్టు, రసిపొక్కులు, దురద మొదలగు అపరిశుద్ధరక్తసంబంధమగు చర్మవ్యాధులను అద్భుతముగా నివారించును. పైనమర్దించిన మేహవాతనొప్పులుపోవును. పురాణవ్రణములను మాన్పును. తలమీదచుండు హరింపజేయును. వానలోతడియుట, చలిగాలిలో పరుండుట మొదలగునవి తటస్థించినప్పుడు ఈనూనెను కొద్దిగా పుచ్చుకున్నఎడల దగ్గు, పడిశము, జ్వరము మొదలగునవి చేరనివ్వక శరీరమునకు చక్కని ఆరోగ్యమునిచ్చును. ఈనూనెను శరీరమునకు మర్దించిన ఉష్ణమునిచ్చును. బలముజేయును. స్ఫోటకపు పొక్కులచే బాధనొందువారు ఈతైలమును రాచిన త్వరగామాన్పును. వేపపువ్వు చేదుగానుండును. రుచినిపుట్టించును. చలువచేయును. వాతమునణచును. శ్లేష్మము, పైత్యము, క్రిమిరోగము హరించును. దీనినికూరగాగూడా నుపయోగించుచుందురు. దీనిచిగుళ్లు (లేతఆకులు) సర్వజ్వరములు, ప్రమేహము, కుష్టము హరించును. అగ్నిదీపనమునిచ్చును. వేపచిగుళ్లతో అయిదు మిర్యపుగింజలువేసి మెత్తగానూరి గచ్చకాయప్రమాణంమాత్రలతో కొన్నిమాసములు సేవించిన కుష్టువును పోగొట్టును. పురాణవరుసజ్వరములు కట్టును. నేత్రములకు బలమునిచ్చును. బుద్ధిని ప్రకాశింపజేయును. వీటిఆకులు, ఈనెలు, కషాయము లేక రసము పొట్టలోని వాతమును హరింపజేయును. మూత్రమును జారీజేయును, జిగటవిరేచనములు కట్టును. అపస్మారము పోగొట్టును. ఈఆకులను సమముగా నువ్వులువేసినూరి కట్టిన దుష్టవ్రణములు మానును. ఆకునూరి స్త్రీల రొమ్ములకు కట్టిన పాలుహరించును. ఈపసరులో ఉప్పుగలిపి ఇచ్చిన క్రిమిరోగమున్నూ, తేనెగలిపియిచ్చిన పాండురోగమున్నూ, ఉశిరికకాయరసము కొద్దిగా నెయ్యి వీటితో యిచ్చినయెడల దురదపొక్కులు, గడ్డలు మొదలగు చర్మవ్యాధులనున్నూ నివర్తింపజేయును. ఈఆకును వెచ్చజేసి వత్తటమునిచ్చిన మేహవాతనొప్పులు, ఇతరవిధములైన నొప్పులు, మాంసగ్రంథులు హరింపజేయును. ఆకునూరి కట్టిన నెత్తురుగడ్డలు రాచపుండుసహా నివర్తింప జేయును." (ఆయుర్వేద చంద్రిక)

—వైద్యవిద్వాన్ దూబగుంట సుబ్రహ్మణ్యము.

# గ్రంథపరిచయము

**తులసీదళము:—**

శ్రీబాలభారతీగ్రంథనిలయమువారి అనుబంధగ్రంథమాల ఆరవకుసుమము. కర్త విద్వాన్ సాహిత్యసరస్వతి నూతలపాటి పేరిరాజుగారు. శ్రీ శివశంకరముపిళ్లెగారీ గ్రంథమునకు పీఠిక వ్రాసియున్నారు. పీఠికకారులు చెప్పినటుల ఈచిన్నపుస్తకము బడులయందు చదువుబాలికల కన్నివిధముల దగియున్నది. సత్యభామగరువతనము, రుక్మిణి పవిత్రభావము చక్కగ ప్రదర్శితములు. చిన్నసైజు. ఆంటిక్ కాగితములు. వెల 0-4-0 అణాలు. చిరునామా: యం. రామసుబ్బయ్యశ్రేష్ఠి, ప్రెసిడెంటు, శ్రీబాలభారతీగ్రంథనిలయము, చాగలమర్రి, కర్నూలుజిల్లా.

**ఆయుర్వేదచికిత్సాదర్పణము:—**

శ్రీముక్త్యాలసంస్థానాధీశ్వరులచే నెలకొల్పబడిన ఆక్షరసాయనశాలవారిచే శాస్త్రోక్తముగా తయారుచేయబడి విక్రయమునకు సిద్ధముగానున్న ఆయుర్వేదసిద్ధౌషధములపట్టిక. ఇతరవైద్యవిశేషములుగలవు. క్రౌనుసైజున 160 పుటలు. ఔషధములు కొనువారికి ఉచితము. ఇతరులకు వెల రు 0-4-0 అణాలు. చిరునామా: ఆక్షరసాయనశాల, ముక్త్యాల, కృష్ణాజిల్లా.

**మూగతల్లి:—**

గోవు. గోమాతనుగూర్చిన కావ్యఖండప్రకీర్ణము. ఏలూరు గోసంరక్షణసమితీత్రివార్షికకావ్యబహుమానగ్రంథములలోనిది.

**ఏలూరు గోసంరక్షణసమితి:—**

వారినివేదిక. అయిదవ వర్షోత్సవరిపోర్టు. తెలుగుదేశపు గోరక్షణసమితులకు తలమానికమనదగిన ఈ ఏలూరు గోసంరక్షణసమితివారి అభివృద్ధి ఆనందకరముగనున్నది.

**శ్రీ గౌతమక్షేత్ర (బుగ్గ) మాహాత్మ్యము.—**

శ్రీవాఙ్మయవినోదినీగ్రంథమాలలో రెండవకుసుమము. చిత్తూరుజిల్లా నగరిసమీపమున శ్రీకాకగిరిదరినిగల బుగ్గక్షేత్రమాహాత్మ్యము. రచయితలు శ్రీమదాంధ్రవిద్యావాచస్పతి, సాహిత్యసరస్వతి, విద్యావినోద, కవిభూషణ, శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారు, తెలుగుపండితులు, క్రిస్టియన్ కాలేజి, జి. టి, మద్రాసు. శ్రీగుప్తగారి కవిత్వమునుగూర్చి విశేషముగా వ్రాయనక్కరలేదు. ఈగ్రంథము క్రౌనుసైజున గ్లేజుకాగితములమీద ముద్రింపబడినది. 140 పుటలు. వెల రు 0-10-0 అణాలు.

**ముద్దుచెల్లెలు:—**

దేశరాజు రామదాసుగారు వ్రాసినది. గ్రంథకర్తగారి కీర్తిశేషురాలైన సోదరినిగూర్చిన స్మృతిపద్యములు. క్రౌనుసైజున 16 పుటలు. చిరునామా: శ్రీరామకృష్ణాప్రింటింగువర్క్సు, చికాకోల్, గంజాముజిల్లా.

**శ్రీపాంచరాత్రాగమశాస్త్రసర్వస్వము:—**

అనుపేరు శ్రీపాంచరాత్రాగమధర్మాభ్యుదయమునకై తూర్పుగోదావరిజిల్లా భద్రాచలమునందొకగొప్పసంస్థ ఏర్పరుపబడినది. నిర్మాతలు: శ్రీమాన్ పొడిచేటి సీతారామానుజాచార్యులుగారు. ఆసంస్థవారు ప్రచురించిన రెండవగ్రంథము శ్రీపురుషోత్తమసంహిత. ఆంధ్రవివరణముతోడను బొమ్మలతోడను వెలువడినది. శిలాగర్భపరీక్షమున్నగు ననేకఅపూర్వవిషయములతో నిండియున్నది. వెల పోస్టేజీగాక మేలుప్రతి రు 4-0-0; సాధాప్రతి రు 3-0-0.

ప్రాచీన భారత విద్యా విధానము:—

సరస్వతీగ్రంథమాలలో 30-వ పుష్పము. గ్రంథకర్త: శ్రీయద్దనపూడి వేంకటరత్నముగారు. సరస్వతీ గ్రంథమాల వారీవఱకు ప్రచురించిన అన్నిగ్రంథములకంటె ఈగ్రంథముద్రణము చాలబాగున్నది. విషయము చేతను ఈగ్రంథము ప్రశస్తమైయున్నది. రచనము సులభము. ప్రోత్సహింపదగిన గ్రంథము. ఇకముందు ఇట్టి ఉత్తమగ్రంథములనే ప్రచురించుచు ఆంధ్రవిద్యాభ్యుదయమునకు దోహదము చేయ గ్రంథమాలాసంపాదకులగు కె. యస్. యస్. మూర్తిగారిని కోరెదము. డెమ్మీసైజున 80 పుటలు. వెల రు 0-12-0 అణాలు. చిరునామా; సరస్వతీగ్రంథమాల, కాకరపఱ్ఱు, తణుకుతాలూకా, పశ్చిమగోదావరిజిల్లా.

ఆంధ్రకుందమాల:—

కవిశేఖర వడ్డాది సుబ్బారాయవిరచితము. 'కుందమాల' అను సంస్కృతనాటకమును అరారాలపుర వాస్తవ్యుడు దిఙ్నాగుడను పండితుడు రచియించెను. ఈతడు కాళిదాసమహాకవికి సమకాలికుడు. ఇందలి ఇతివృత్తము ఉత్తరరామచరిత్రకథ. భవభూతి ఉత్తరరామచరిత్రకంటె కుందమాల ప్రాచీనము. ఉత్తర రామచరిత్ర పలువురచే తెనుగునకు దింపబడినది. కాని కుందమాల-శ్రీమానవల్లి రామకృష్ణకవిగారి తెనుగు వచనమున తప్ప-తెనుగునకు చేకూరలేదు. వేణీసంహారభాషాంతరీకరణముచే మీనుమిగిలిన వసురాయకవిగారి చేతులనుండి బడుటచే ఆంధ్రకుందమాల ప్రశస్తమైనదైనది. దేశసేవనుండి పునర్ముద్రితము. గ్లేజుకాగితములు. డెమ్మీసైజు 84 పుటలు. వెల రు. 0-12-0 అణాలు. వలయువారు గ్రంథకర్తగారిపేర రాజమండ్రి వ్రాయునది.

శిశులివరు వ్యాధులు:—

ఆంధ్రవైద్యశిఖామణులలో నొకరై శిశువులస్ప్లీనులివరువ్యాధులను నివారించుటలో అపరధన్వంతరులైయున్న శ్రీజమ్మి వేంకటరమణయ్యగారిచే వ్రాయబడినది. అల్లోపతివైద్యమున ఈరోగనివారణకు మందులులేవు. ఆవైద్యము కుదర్చలేని ఈరోగములను శ్రీవారు ఆయుర్వేదపద్ధతిని నివారించి వేలకొలది శిశువులను మృత్యుముఖమునుండి రక్షించుచున్నారు. ఇందుచే వీరు ఆయుర్వేదవైద్యప్రశస్తికి అమోఘముగ తోడ్పడుటయేగాక హిందూదేశమునకు పట్టిన చీడలలో నొకటియగు శిశుమరణములసంఖ్యను కొంతవఱకు తగ్గింపగలుగుచున్నారు. హిందూదేశపుతల్లులు వీరికీవిషయమున హెచ్చుగ ఋణపడియున్నారనవచ్చును. ప్రస్తుతవిమర్శనకు పాల్పడిన ఈగ్రంథమును చదువుటచే శిశువుల స్ప్లీనులివరు వ్యాధుల పూర్వరూపము, నిదానము, చికిత్సమొదలగునవి తెలియనగును. ఈరోగములను సూటిగా కుదుర్చగల ఈమందులఖనికి ఎల్లరకు తెలియుటకును ఈగ్రంథము సహకారిగాగలదు, శ్రీవారిచిత్రమును, ఈరోగముచే ఒకప్పుడు బాధపడి వీరి ఔషధసేవనముచే ఇపుడు స్వస్థులైన పలుశిశువుల చిత్రములును గ్రంథవినియోగమును హెచ్చించుచున్నవి. ఈవైద్యముచే దేశక్షేమమునకు బాగుగ ఉపకరించుచున్న శ్రీవారు ఆంధ్రులగుట ఆంధ్రులుగర్వింపదగినవిషయము, గ్రంథముద్రణాదులుచాల బాగున్నవి. క్రౌనుసైజు. మంచిగ్లేజుకాగితములు. 43 పుటలు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన శ్రీవారి మందులనుగూర్చి విశేషముగ వ్రాయవలసినపనిలేదు. గ్రంథములు వలయువారు శ్రీవారిపేర మైలాపూరు, మద్రాసుఅని వ్రాయునది.

సర్వేగణితచంద్రిక:—

గ్రంథకర్త చదలువాడ కోటి నరసింహము. గ్రామకరణములు మొదలగువారికీగ్రంథము బాగుగనుపయోగించును. సూత్రములు పద్యములందును, వివరణము వచనమునందును వ్రాయబడినది. క్రౌనుసైజు. గ్లేజు

కాగితములు. 106 పుటలు. వెల రు 1-0-0. విలాసము: చదలువాడ కోటివరసింహము, కోటుకూరు, అచ్చమ్మపేటపోస్టు, సత్తెనపల్లితాలూకా, గుంటూరుజిల్లా.

మధుపిశాచి :—

మధుపానమువలని నష్టములు కీర్తనలరూపమున ప్రచారమునకు అనువుగ వ్రాయబడినవి. విప్పర్తి సుదర్శనరావుగారు పీఠిక వ్రాసియున్నారు. గ్రంథకర్త జాలా రంగస్వామిగారు. క్రౌనుసైజున 12 పుటలు. వలయువారు కంభాలపేట, రాజమండ్రి అని వ్రాయవలెను.

అహింస :—

కీర్తనలు, పద్యములు. జీవహింసయందు చదువరులకు విముఖత్వము కలిగింప సమర్థములైయున్నవి. విశ్వనాద్ చేకుమళ్ల (బి.ఏ. ఆనర్సు)గారు ఈగ్రంథమునకు పీఠిక వ్రాసియున్నారు. గ్రంథకర్త జాలా రంగస్వామిగారు. డెమ్మిసైజున. 30 పుటలు. వెల అ 0-4-0. ఈపుస్తకాలు గ్రంథకర్త పేర కంభాలచెరువుపేట, రాజమండ్రిఅని వ్రాసి తెప్పించుకోవచ్చు.

ఆత్మత్యాగి :—

యువకుడును, దేశభక్తుడునునగు ఆత్మత్యాగి వీరజతీంద్రునిజీవితమును శ్రీఆదిత్యప్రసన్నరాయలచే హిందీభాషయందు రచియింపబడినదానిని శ్రీకూచిభొట్ల ప్రభాకరశాస్త్రిగారు తెనుగులోనికి అనువదించిరి. ఉత్తేజకరమగు జీవితము. ఉత్సాహపూరితవాక్యములతో వ్రాయబడినది. ఎల్లరుచదువదగిన గ్రంథము. క్రౌనుసైజున 92 పుటలు. వెల అణాలుఆయిదు. ప్రకాశకులు: కొమ్మూరి కాశీవిశ్వనాధము; తెనాలి.

దెయ్యాలలంక :—

ఏకాంకనాటకము. రచనము నూతనము. పాత్రపోషణము లెస్సగనున్నది.। 'సుధ' పాత్ర ఈనాటకమునకు ప్రాణము. ఆమెనిష్క్రమణము మిక్కిలి జాలిపుట్టించు నదిగానున్నది. ఆంధ్రసాంఘికచరిత్రయందు రాజమండ్రి, గోదావరి, వితంతువులు వీనికి వీడనిసంబంధమున్నట్లే ఈనాటకమునందుకూడ. కళాపత్రికా సంపాదకులు పా. వే. రాజమన్నారు, బి. ఏ; బి. ఎల్ గారు ఈనాటకమును రచియించినవారు. 'ఎవరిదితప్పు' అని వీరు లోగడ ఒకచక్కని తెనుగునాటకమును రచియించియున్నారు. దెయ్యాలలంక మతియొకటి. ఆంధ్రనాటకవాఙ్మయమునకు ఇవి విలువ తెచ్చునవియగుట నిస్సందేహము. గ్రంథముద్రణము అతిసుందరము. క్రౌనుసైజు. అంటిక్ కాగితములు. 30 పుటలు. వెల 0-8-0. మద్రాసునందలి గ్రంథకర్తగారి పేర వ్రాసిన బడయవచ్చును.

లేమొగ్గ :—

ఖండకావ్యముల సంపుటి. గ్రంథకర్త కందుకూరి రామభద్రరావుగారు. శ్రీవారు గృహలక్ష్మిపాఠకులకు చిరపరిచితులే. ఈగ్రంథమునందలి పెక్కుగీతములును తొలుత గృహలక్ష్మిముఖమున తెనుగువారికి అందింపబడినవే. అర్చన, హిమవంతము, భాస్కరోదయము, ఆన్వేషణము, అభినందనము, రాయలస్మృతి, కవి, పశ్చాత్తాపము, అత్తింటికి పయనము, వసంతోదయము, తారలు, మాతృప్రేమ, కోకిల, త్యాగదీక్ష, తొలిసంజ, సంస్మరణ, చిలుకా!, అలికుమార అనునవి ఇందలిగీతములు. సులభరచనము. ఎల్లరకు అందుబాటున నుండును. వలయువారు గ్రంథకర్తపేర పోడూరివారియిల్లు, ఇన్నీసుపేట, రాజమండ్రిఅని వ్రాయునది.

కాక్ స్టన్ డైరి :—

కాక్ స్టన్ డైరీలు చెన్నరాజధానివారికి బహువత్సరములుగ పరిచితమైనవి. పుస్తకవిక్రేతలు సి. కుమారస్వామినాయుడు అండుసన్సువారు ప్రచురించినవి. దినమునకు ఒక్కొక్కరూళ్లపుట విడువబడినది. ఇంగ్లీషు, అరవము, తెనుగు, కన్నడము మొదలగు దేశభాషలయందు పంచాంగవివరము దినక్రమమునుగలదు. ఉపోద్ఘాతమున పండుగలు, లోకవ్యవహారమునకు పనికివచ్చు ఇతరములు సంగతులుగలవు. చక్కని కాలికో బైండు, బొత్తాము మడతగలఫ్లాప్, చిన్న పెన్సిలు, జేబునందిముడుపైజు ఈడైరీని చాలఆకర్షణీయముగ చేసి ర్చినవి. గతవత్సరములందువలెనే ఈవత్సరమును ఈడైరీలు బహుజనామోదము నందునని నమ్ముచున్నాము. చిరునామా: సి. కుమారస్వామినాయుడు అండ్ సన్సు, 27 చిన్నతంబివీథి, మద్రాసు.

ప్రకృతి : మహాసభా సంచిక :—

పుష్కర పుణ్యకాలమున పావన గౌతమీతీరమునందు ప్రఖ్యాతిచెందిన రాజమహేంద్రవరమున కూడిన ప్రకృతిమహాసభావృత్తాంతమునెల్ల క్రోడీకరించి ప్రకృతిపత్రికవారొక సంచికను ప్రచురించిరి. ఈసభ ఇట్లు జయప్రదముగా నిర్వహింపబడుటకు కారణభూతులైన మామిత్రులు దుర్వూరి రామకృష్ణరావు బి. ఏ. గారి నెంతయు అభినందింతుము. ఈసంచికయందు సభాధ్యక్షులగు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారి ఉపన్యాసము పూర్తిగముద్రితము. వలయువారు ప్రకృతి పత్రికాకార్యాలయము, బెజవాడ అని వ్రాయునది.

తంజావు రాంధ్ర నాయక రాజ చరిత్రము :—

కురుగంటి సీతారామయ్య ఎం. ఏ గారిచే రచియింపబడినది. ఆంధ్రగ్రంథమాల పదునేడవ కుసుమము. గ్రంథకర్తగారు తంజావు రాంధ్రనాయక రాజులనుగూర్చి ఆంధ్రవిశ్వవిద్యాలయపక్షమున నిచ్చిన ఉపన్యాసముల సారమీగ్రంథము. శ్రీవారు తంజావురమునందలి సరస్వతీమహాల్ పుస్తకాలయమున ఉపద్రష్ట లగుటచే ఈవిషయమునుగూర్చి వ్రాయుటకు వారు సర్వవిధముల తగినవారు. ఈగ్రంథమునకు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు తొలిపలుకు వ్రాసియున్నారు. అచ్యుతనాయకుడు, రఘునాథనాయకుడు, విజయరాఘవనాయకుడు వీరలచరిత్రలు విపులముగగలవు. రాజకీయచరిత్రయే విస్తరింపబడినది. చిత్రపటములు, దేశపటములు, వంశవృక్షములు గ్రంథవినియోగమును హెచ్చించుచున్నవి. చక్కని గ్లేజు కాగితములు. క్రౌను సైజున 450 పుటలు. దిట్టమైన అట్టబైండు. వెల రు 2-0-0. తంజావురాంధ్రనాయక రాజచరిత్ర విషయమున ప్రథమవిపులచరిత్రగ్రంథము ఇదియేయగుట విరివిగ వెలవోవునని నమ్మెదను. చిరునామా: ఆంధ్రగ్రంథమాల; 6, 7 తంబుచెట్టివీథి; జార్జిటవున్, మద్రాసు.

వకుళమాల :—

నేటి యువకవులలో నొకరును, 'రైతు' పత్రికా సంపాదకులును, మామిత్రులును అగు శ్రీ సహదేవ సూర్యప్రకాశరావుగారు తమ ఖండకావ్యవకుళపుష్పములను దండగ్రుచ్చి గ్రంథరూపమున వెలయించినారు. ఆంధ్రకథకచక్రవర్తులు శ్రీ చింతా దీక్షితులుగారు ఈకావ్యమునకు పీఠిక వ్రాసినారు. వారివాక్యములు కొన్ని: 'సూర్యప్రకాశరావుగారి వకుళమాలలో స్వాదుత్వమున్నదని నాఅభిప్రాయము. వకుళమాలలో భావములు సున్నితము. కవిత్వము ధారాళముగా నడుస్తున్నది. శబ్దజాలము మార్దవముగానున్నది.' 'కార్తికేయ చంద్రికావయస్విని కొమ్మలీనూనవపసమంజరులు' దొరకక 'భగ్నజీవితమున'మన్న ఒక యువకుని మనోభావములవలె ఇందలిభావములు 'మనసోపగా లేక'యున్నవి. మొత్తముమీద కావ్యమంతయు 'ఎవరు సహింపగ

నోపురు రీయనంతసాగరార్ద్రి నుహోజ్వలజ్వాలమాలలో' అనిపించుచున్నదనవచ్చును. ఈపకుళమాల ఆత్మకథ ముగా చెప్పుకొన్న కావ్యమగుట ఆమహోజ్వలజ్వాలమాలను కవియే ధరించవలసియుండును. ధరించవలసి యుండునన నేల? ధరించుచునే యున్నాడు. లేనిచో అతడు 'నేను మాత్రమెట్లు శోకాన నిలిచిపోతి'నని ఏలఅను? శోకాననైన నిలిచిపోవిండు. లేనిచో 'తాండవించును మృత్యుగీతాప్రసక్తి.'—అప్పుడే 'క్రమ్మినది చావుమునుగు సగమ్ము'— ఈమధురకావ్యము చక్కనికాగితములపై అతిసుందరముగ అచ్చొత్తింపబడి చాల ఆకర్షణీయముగ బైండు చేయబడినది. క్రౌనుసైజున 100 పుటలు. వెల రు 0-8-0. చిరునామా: సహదేవ సూర్య ప్రకాశరావుగారు, కంభంవారిసత్రము వీథి, రాజమండ్రి.

**తెలుగు ముద్రాక్షర విలేఖనము:—**

తెలుగుటైపు రైటింగునుగూర్చిన గొప్పవిమర్శక వ్యాసము. 1931 నవంబరు భారతి మాసపత్రికనుండి పునర్ముద్రితము. రచయిత యం. యస్. వేంకయ్యగారు. ఈవ్యాసము అక్షరలక్షలు విలువగలది. వ్యాసకర్త ప్రతిభ ప్రతిఅక్షరమున ప్రస్ఫుటమగుచున్నది. గోడచేర్పులేని బంగారుపళ్లెమువలె ఇట్టివారివిద్య పోషణలేకుండుట రాణింపునకు రాకున్నది. అరవమునకు టైపురైటింగుగలదు. తెనుగునకు గొనివచ్చుటకుగల సౌకర్యములను శ్రీవారీవ్యాసమున సూచించిరి. ఈసూచనమందుకొని ఆంధ్రులు ప్రయత్నించి టైపురైటింగును సంపాదించి భాషాభ్యుదయమునకు తోడ్పడెదరుగాకయని కోరెదము.

# పత్రికా పరిచయము

**జర్నల్ ఆఫ్ ది ఆంధ్రా హిస్టారికల్ రిసర్చి సొసైటీ:—**

ఆంధ్రాహిస్టారికల్ రిసర్చి సొసైటీవారు తెలుగుచరిత్రకు దివ్యమైన సేవచేయుచున్నారు. వారి రాజరాజ సంచిక, కళింగసంచిక మొదలగుప్రచురణములు; త్రైమాసికపత్రిక వారిపరిశోధనకు అక్షరరూపము నిచ్చుచున్నవి. ఆంధ్రులుచెప్పుకొని గర్వింపదగిన సంస్థలలో నిదియొకటి. 1932 జూలైమాసమున వెలువడిన ఏడవ సంపుటపు తొలిసంచిక విమర్శనార్థము మాకార్యాలయమునకు పంపబడినది. పల్లవ వంశక్రమము, మీర్కాసీమ్పద్దకు రాయబారము, పద్మచంద్రదేవు టెక్కలి శిలాశాసనము, ఉత్తరసర్కారులలోవిన్యాపరిపాలన, కాకతీయుల రాజకీయచరిత్ర, కళింగదేశపు తూర్పుగాంగులచరిత్ర మొదలగువిషయము లీసంచికయందుగలవు. తెలుగువారీపత్రికను ఉదారబుద్ధితో పోషింతురని నమ్మెదము. సంఘసభ్యులకు పత్రికచందా రూ 3-0-0; సంస్థలకు రూ 6-0-0. చిరునామా: ది ఆంధ్రాహిస్టారికల్ రిసర్చి సొసైటీ, రాజమండ్రి.

**ప్రాథమిక పాఠశాల:—**

విద్యావిషయక మాసపత్రిక. సంపాదకుడు అయినంపూడి గురునాథరావుగారు. డెమ్మిక్రౌనుసైజున ప్రచురింపబడుచున్నది. సాలుచందా రూ 1-8-0. విమర్శనార్థము మాకార్యాలయమునకు పంపబడిన నాలగవసంపుటపు 9, 10 సంచికలలో శిశువిద్య, ఉపాధ్యాయులు: కొన్ని ప్రస్తుతసమస్యలు, బాలికావిద్యావిధానము, బాలుర మనోవృత్తులు: శిక్షావిధానము మొదలగు మంచివిషయములు గలవు. చిరునామా: ఘంటశాల, కృష్ణాజిల్లా.

**ఆంధ్రసహకారపత్రిక:—**

మద్రాసు ప్రొవిన్షియల్ కోఆపరేటివ్ యూనియన్ వారిచే ప్రకటింపబడు మాసపత్రిక. మొదటిసంపుటపు మూడవసంచిక—సెప్టెంబరుమాసమున వెలువడినది—మాకార్యాలయ మలంకరించినది. రాయల్ సై

జాన ప్రకటింపబడుచున్నది. సంపాదకీయములు సమాదరణీయములై యున్నవి. మదరాసు కమెర్షియలు క్రాప్సు మార్కెటుబిల్లు, సహకారమునకు వ్యవసాయముయొక్క సహాయముఅను రెండువ్యాసములును ప్రత్యేకము పఠింప దగియున్నవి. వివిధమండలముల, తాలూకాల సహకార సభలవృత్తాంతములు ఒక్కచో చేర్చి ప్రచురించుచుండుట అభినందనీయము. సహకారప్రచారము చేయుచు ఈపత్రిక బహుదినములు వర్ధిల్లవని నమ్మెదము. చందా సంవత్సరమునకు రు 3-0-0. విడిసంచికవెల రు 0-4-0 అణాలు. చిరునామా: ప్రావిన్షియల్ కోఆపరేటివ్ యూనియన్, రాయపేట, మదరాసు.

**సినీమా పిక్టోరియల్ :—**

సినీమావిషయములను ప్రచురించు సచిత్రమాసపత్రిక. నవంబరుమాసమున ప్రత్యేకసంచిక ప్రచురింపబడినది. క్రౌనుక్వార్టోసైజున గ్లేజుకాగితములమీద ముద్రితము. ప్రతిసంచికయందును మూడునాలుగు సినీమానటుల చిత్రములు ప్రచురింపబడును. సాలుచందా రు 3-0-0. అడ్వాన్సుగా ఇచ్చిన కన్ సెషన్ రేటు రు 1-0-0. నాలుగుఅణాలు స్టాంపులు పంపుచో ఈస్పెషల్ సంచిక పంపబడును. పద్మాకన్య, మెహతాబ్ కన్య, గోహరుకన్య, శారదాకుమారి మున్నగు సినీమానటుల ఛాయాచిత్రములు ఇందుగలవు. చిరునామా: శ్రీమతి ఐవీజాకబ్సునతి, 32, సామిరెడ్డిస్ట్రీటు, ఎగ్మూరు, మదరాసు.

**ది ఎ. వి. యన్. కాలేజి మేగజిన్:—**

విశాఖపట్టణమునందలి ఎ. వి. యన్ కాలేజీ తరఫున ప్రచురింపబడు పత్రిక. మొదటిసంపుటపు రెండవసంచిక సెప్టెంబరుమాసమున వెలువడినది. ముఖపత్రముపై కాలేజీదృశ్యము ముద్రితము. క్రౌను క్వార్టోసైజున చక్కని గ్లేజుకాగితములపై ముద్రింపబడి పత్రిక ఆకర్షణీయముగ నున్నది. సంపాదకుడు కె. రామస్వామి అయ్యంగారు. విషయములు ఆంగ్లభాషయందును, ఆంధ్రమునందును గలవు. అవి ప్రాయికముగా కళాశాల విద్యార్థులచే వ్రాయబడియుండుట మెచ్చదగినది. కళాశాల క్రమాభివృద్ధి లోకులెఱుంగుట కీపత్రిక ఎంతయు తగియుండును. చిరునామా: కె. రామస్వామిఅయ్యంగారు, ఎం. ఏ. యల్. టి, విశాఖపట్టణము.

## డైరి

### అక్టోబరు

20:—విశాఖపట్టణము. న్యాయమూర్తి సర్ వేపా రామేశంగారి కుమార్తెయగు శ్రీమతి అన్నపూర్ణమ్మగారు యింపీరియలు ఫారెస్టుకాలేజీకిచేరిన శ్రీయుత కొంతి కామేశంగారి ధర్మపత్ని. ఈమె స్వర్గస్థురాలగుటచే యీమె పేరట యింటర్మీడియేటు పరీక్షలో బాగుగా నెగ్గినయువతికి బంగారుపతకము నిచ్చుటకు రాజమండ్రీ ప్రిన్సిపలుసబార్డినేటు జడ్జియును, రామేశంగారి సోదరుడునగు శ్రీయుత వేపా పూర్ణయ్య బి. ఏ., బి. ఎల్ గారు 1200 రూపాయలు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు విరాళ మిచ్చిరి.

21:—శ్రీమతి భక్తిసుధ గోషుఅనుకన్యయు, ఆమెసోదరుడగు అర్ధేందుగోషుగారు (సతీసగోషుగారిబిడ్డలు) వాట్సన్ షూటింగుకేసు సందర్భమున మైమనుసింగులో అరెస్టుచేయబడిరి.

24:—బొంబాయి. శ్రీమతి కృష్ణదుమత్కరుగారు హిందూస్థానుసేవాదళప్రచారకురాలు ఏడాది శిక్ష, రూ 300 జరిమానా, ఇవ్వనిచో మూడునెలలు శిక్ష పొందిరి.

26:—మచిలీపట్టణమునందు శారదాచట్టమునకు విరుద్ధముగా బాల్యవివాహమును జరిపినందులకై ధారా శివరావు, కంతేటి నాగయ్యగార్లకును, వివాహముజరిపిన పురోహితునకును జిల్లామేజస్ట్రేటు చెరి రు 50 లుచొప్పున జరిమానాలను విధించిరి.

27:—శ్రీమతి కస్తూరీబాయి గాంధి బొంబాయినుండి అహమ్మదాబాదు చేరిరి.

:—శ్రీయుతులు వల్లభాయిపటేలు, విఠలుభాయిపటేలు గార్లతల్లి కరమ్సదునందు చనిపోయెను. ఈమెకు దాదాపు 90ఏండ్లు వయస్సు.

28:—ఇండియామంత్రిగనుండిన మాంటాగుగారిభార్య వాయువిమానముపై రంగూను చేరెను.

29:—శ్రీమతి వసల అంజలక్ష్మమ్మగారు (పశ్చిమగోదావరి) రాయవెల్లూరు స్త్రీలచెరసాలయందు సుఖముగ ప్రసవించి ఆడశిశువునుకనినారు. మాతాశిశువు లిరువురును సుఖముగా నున్నారు. ఆమెభర్తగారగు శ్రీకృష్ణమూర్తిగారుకూడ తిరుచునాపల్లిజయిలునందు శిక్ష ననుభవించుచున్నారు—

30:—హౌరాపురప్రజలు బహిరంగముగ సమావేశమై స్త్రీనిర్బంధితులను అండమానులకు పంపుటతగదని తీర్మానించిరి.

:—ముల్కానగరు కోర్టునందు పికెటింగుచేసిన నేరమునకు శ్రీమతులు అనుపమఘోషు, వివసనిదాసుగార్లను అరెస్టుచేసి కలకత్తాతీసుకొని వెళ్లిరి.

:—ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘము 5-వనియంత్రి శ్రీమతి ప్రోణంరాజు లక్ష్మిబాయమ్మగారు భీమవరంలో అరెస్టు.

31:—రంగూను. గా॥ శ్రీమతి మాస్టేగుసతిగారు వెల్ నివగారితోగూడ సాయంకాలము విమానములో మోల్మిన్ కు వెళ్లిరి.

## నవంబరు

1:—ఢక్కా. అనుపత్రిలో స్త్రీవార్డునిర్మాణమునకు 40,000 రూపాయిలను ఢక్కాలో సుప్రసిద్ధధనికులు, జమీందారులునగు రావుబహదూరు సత్యేంద్రకుమారదాసు యం. యల్. సి. వారిసోదరులు హేమంతకుమారదాసుగార్లు విరాళమిచ్చిరి.

2:—బెల్లూరి జయిలునుండి శ్రీమతులు చుంచూరి రత్తమ్మ, మద్దుల దమయంతమ్మ, జవ్వా రాజరత్నమ్మ గార్లు విడుదలనొంది ఏలూరు చేరిరి.

:—లక్నో. శిక్షాకాలము పూర్తియగుటవలన శ్రీమతి రాణి విద్యావతిగారు లక్నో చెరసాలనుండి విడుదల చేయబడిరి.

:—మూర్జాపర్ పురం. శ్రీమతి రధికదేవియింట రివాల్వరు దొరికినందున ఆమెను అరెస్టుచేసి రిమాండునందుంచిరి,

3:—బాపట్లతాలూకా మహిళాసభ శ్రీమతి కామరాజు వేంకటలక్ష్మమ్మగారి అధ్యక్షతను బాపట్లలో జరిగెను.

6:—మచిలీపట్టణము. బుట్టయ్యపేట థియేట్రికల్ హాలులో ఆరవకృష్ణాజిల్లా మహిళాసభ శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారి అధ్యక్షతను జరిగెను.

:—గుంటూరు. ఆరవమహిళాసభ టవున్ హైస్కూలు భవనములో శ్రీమతి వావిలికొలను పద్మాసనమ్మగారి ఆధిపత్యమున జయప్రదముగా జరుపబడెను.

7:—బరంపురము. మహిళాసమాజమువారి యాజమాన్యమున శ్రీమతి వరాహగిరి వేంకట సుబ్బమ్మగారి అధ్యక్షతను అస్పృశ్యతా నివారణమునుగూర్చి సభజరిగెను.

8:—చిన్నూరు. ఆరాంబాగ్ వార్ కౌన్సిలు సభ్యురాలని చెప్పబడు శ్రీమతి కుసన్ బహదాసిగారు గౌరవాబెన్ లో వల్లమందు దుకాణమును పికెటు చేయుచుండగా అరెస్టు చేయబడిరి.

:—కాకినాడ: శ్రీమతి స్నేహసోభనారక్షితు బి. ఎ. గారు కళాశాలలో ఇంగ్లీషు ట్యూటరుగ నియమింపబడినట్లు తెలియుచున్నది. ఈమె భర్తయగు వినోయిభూషణ రక్షితు ఎం. ఏ గారు అకాలేజి

లోనే లెక్చరరుగా నున్నారు. ఈమె ఇదివరకు రాజాగారి కుమార్తెకు ఇంగ్లీషు నేర్పుచుండెను. పురుషుల కళాశాలలో ఉపాధ్యాయినిగ నియమింపబడుటకు ఈమెయే ప్రథమస్త్రీ.

9:—నాగపూరు. కీ. శే. సర్. యస్. యం. చిట్నవీసుగారిసతి పార్వతీబాయి చిట్నవీసుగారు విద్యావిషయక సాంఘిక సంస్థలకు 15 వేల 400 రూపాయీలు తమ మనుమని జన్మదినోత్సవ సందర్భమున దానము చేసిరి.

10:—రాంచి. కూచ్‌బీహారు వృద్ధరాణి మరణము. ఈమె కేశవ్ చంద్రసేన్ గారి కుమార్తె. సేన్ గారు స్త్రీవిద్యకై కలకత్తాలో నేర్పరచిన విక్టోరియా ఇన్‌స్టిట్యూటునకు ఈమె తనకలకత్తా ఆస్తినంతయు దానము చేసి మరణించెను.

:—జన్మూరు. కిరోను బాలాదేవిగారు జిల్లాకలెక్టరుగారి కోర్టునందు కాంగ్రెసు బులెటిను పంచిరి. వీరిని పోలీసువారు అరెస్టు చేసిరి.

:—బళ్లారిలో కర్నాటక కేసరిపత్రికాసంపాదకులగు టి. బి. కేశవరావుగారిభార్య శ్రీమతి జయలక్ష్మీదేవిగారు బి. తరగతి ఖయిదీ వేలూరుస్త్రీల జెయిలునుండి విడుదల అయిరి.

11:—షియల్ హటి. ఈనడుమనే కారాగృహ విముక్తురాలైన శ్రీమతి అనుపమ ఘోషుగారికి మాల్యానగరు యూనియను కోర్టునందు పికెటింగుచేసిన నేరమునకు ప్రత్యేక ఆర్డినెన్సుక్రింద 6 నెలలు ఖైదువిధించిరి. ఇదే నేరమునకు శ్రీమతి వీణాపాణిగారిని రిమాండునందుంచిరి.

:—ఢిల్లీ. డాక్టరు కుంతలకుమారిగారి యింటిని 'ఆర్యసమాజ విప్లవము' అను వ్యాసముకొఱకు రెండుగంటలసేపు వెదకి తుదకు వ్యాసముయొక్క ప్రతిని పట్టుకొనిరి.

12:—తిరువనంతపురము. తిరువాన్కూరు మహిళాసభ. స్త్రీలు రాజకీయవ్యవహారములలో చేరుటకు సభవారంగీకరించిరి.

:—రాజమండ్రి. ఆరవ ఆంధ్రరాష్ట్రీయ మహిళాసాంఘిక విద్యావిషయకమహాసభ. శ్రీమతి డాక్టరు ఆచంట లక్ష్మీదేవి ఎం. బి. బి. ఎస్ గారి అధ్యక్షతను జరిగెను.

14:—లాహోరు. ఇదివరలో సెటాపూరు పురపాలక సంఘకార్యనిర్వాహకసభ్యులుగా నుండిన గోపాల నారాయణ శాకుసేనగారి సతీమణి శ్రీమతి శాకుసేనగారు శాసనోల్లంఘనోద్యమము సందర్భమున కారాగృహవాస మనుభవించుచుండిరి. వీరు అనారోగ్యవంతులుగ నున్నందున వీరిని మెడికలు కళాశాల ఆసుపత్రికి మార్చిరి. మిగిలియున్న శిక్షను రద్దుపఱచి వీరిని విడుదలచేసిరి.

15.—లక్నో. స్వదేశప్రదర్శన ప్రారంభోత్సవము శ్రీమతి స్వరూపరాణి నెహ్రూగారు జరిపిరి.

16:—గా. మాంటేగుగారిసతి విమానముపై రంగూనునుండి డండం విమానాశ్రయమునందు దిగిరి.

:—అనారోగ్యముననున్న కమలానెహ్రూగారు తమతల్లిని, డాక్టర్ అటల్ గారిని వెంటబెట్టుకుని వైద్యపరీక్షనిమిత్తము కలకత్తా చేరిరి.

17:—కలకత్తా. ముక్తద్వారునందు ఆనాకాన్ఫరెన్సును పోలీసువారు చెదరగొట్టిన సందర్భమున శ్రీమతి కోకిలమణీసేనుగారికి తీవ్రగాయములు తగిలి అందుమూలమున వారు మరణించిరి.

:—లాహోరు. శ్రీమతి రాధాదేవిగారు-కీ. శే. లాలాలజపతిరాయిగారిభార్య ఆకస్మికముగ లజపతి రాయివారి నాల్గవవర్ధంతిదినమున ప్రాతఃకాలమున సరిగ తనభర్త చనిపోయినసమయముననే కాలధర్మమునొందెను.

18:—మిలన్. 18 యేండ్ల ప్రాయముగల వైమానికురాలగు గేబీ అంజెలినీగారు 'ఇటలీ' అనబడు చిన్నవిమానమున ఇండియాకు ప్రయాణమయ్యెనని తెలియుచున్నది.

:—కలకత్తా. గా. మాంటేగుగారిసతి లక్నోకు విమానముపై బయలుదేరెను. త్రోవలో గయయందు పెట్రోలుకొఱకు దిగెను.




**పిడుగుపాటుకు తల్లి చచ్చినది పదకొండు రోజుల పిల్ల బ్రతికినది:—**

"నైజాము ఇలాకా బోప్పాపురము తాలూకా సిరిసిల్ల అను గ్రామమున ఈ ఆశ్వయుజ కృష్ణపక్ష చతుర్థినాడు పగలు నాలుగుగంటలకు ఉరుములతో మెరుపులతో గొప్పవాన కురియనారంభించి అయిదు గంటలప్పుడు మహాగర్జనతో భయంకరమైన పిడుగు రామార్పు రాజరెడ్డిగారి భార్య అయిన రాజవ్వఅను స్త్రీపై బడి ముఖము కాలిపోయెను. తదుపరి ఆమె మరణించెను. చంటిపిల్లమాత్రము తల్లిపద్దనే ఉండెను కాని ఏమాత్రమైన అపాయములేక జీవించియున్నది." అనిగోలకొండ పత్రిక ప్రచురించుచున్నది.

**మేకకు మనిషిపిల్ల పుట్టుట:—**

బొంబాయిక్రానికలు నాగపురపు విలేఖరి ఇట్లు వ్రాయుచున్నాడు: "హాన్సపురిలో అక్టోబరు 28-వ తేదిని ఒక మేకకు మనిషిపిల్ల పుట్టెను. చేతులు, కాళ్ళు మనిషిమోస్తరుగానే ఉండెను గాని ఆబిడ్డకు తోక ఒక్కటి అధికముగా నుండెను. బిడ్డ చచ్చిపుట్టెను. తల్లి మేక సురక్షితముగానున్నది."

**రెండుతలల గేదదూడ:—**

బీహార్ షెరిఫ్ అను నగరపు పశువైద్యశాలకు ఒక చూడుగేదె కొనిరాబడెను. ఈనబోవుచుండి చాల బాధపడుచుండెను. వైద్యుడు మిక్కిలి జాగ్రత్తతో చికిత్సచేయగా ఆగేదె ఒకదూడను పెట్టెను. అది చచ్చియుండెను. కంఠము పైభాగమునుండి ఆదూడకు రెండు తలలుండెను. ఈచచ్చిన గేదదూడను పాట్నామ్యూజియమునకు పంపిరి. అది అక్కడ భద్రపఱుపబడును.

**ఐరావతము భూమికి దిగివచ్చినదా?:—**

తెల్లఏనుగు (ఐరావతము) ఇంద్రునికితప్ప మరియెవ్వరికిని లేదని మనపురాణములు వాకొనుచున్నవి. కాని ఈనడుమ తిరువాన్కూరు అడవులలో ఒక తెల్లఏనుగు కనిపించినదనియు, ఆసంగతి తెలిసికొని తిరువాన్కూరు సంస్థానాధీశ్వరులు దానిని భద్రముగపట్టి తమ గజశాలకు గొనిపచ్చుటకు విశేషప్రయత్నములు చేయుచున్నారనియు తెలియుచున్నది. నిజమునకు అట్టియేనుగు కనబడుచో మనపురాణములవచనము ఈసందర్భమున అబద్ధమవవచ్చును.



ఈ ప్రశంసకు కృతజ్ఞలము:—

లక్నో విశ్వవిద్యాలయమునను్న ఆంధ్రమహాశయులు శ్రీ వి. మధుసూదనదాసు ఎం. ఏ; యల్. యల్. బిగారు మాకీనడుమ వ్రాసినలేఖనుండి క్రిందిపంక్తులనెత్తి మా చదువరులకు అందిచ్చుచున్నాము. "I beg to introduce myself as one greatly interested in organs like your Grihalakshmi.It is a matter of great pleasure to congratu--late you for developing the magazine to such an extent that it is the only Magazine in our language to spread knowledge especially of a Social kind at a time when the need is keenly felt. I have seen many Hindi Magazines but I can confidently assure you that your Grihalakshmi far exceeds the best of them in every respect......" మాసముమాసమును మాకు ప్రశంసలేఖలు పరశ్శతములుగ వచ్చుచున్నవి. అయితే వానికంటె మేమీలేఖకు హెచ్చువిలువ నిత్తుము. ఈప్రశంసలేఖ పంపినవారు పరరాష్ట్రమున వలసనెలకొనిన ఆంధ్రులగుట, అందును ఆంగ్లవిద్యార్థులగుట, మఱియు ఇంతకు పూర్వము వారు మాకు అపరిచితులగుట దీనికి మేము హెచ్చువిలువనిచ్చుటకు కారణములు. ఈప్రశంసకు మేము కృతజ్ఞలము.

జిల్లా బోర్డు అధ్యక్ష పదవికి స్త్రీ పోటీ చేయుట:—

మనరాజధానియందు స్థానికసంస్థల క్రొత్తఎన్నికలలో స్త్రీలు పాల్గొనుచుండుట సంతోషింపదగిన విషయము. స్త్రీలకు ఆసంస్థలయందు ప్రత్యేకస్థానములు ఏర్పరుపబడియున్నవి. ఆస్థానములకు ఎన్నుకొనబడి స్త్రీలు స్థానికస్వపరిపాలనమున తమబాధ్యతను జాలు వార్చుచున్నారు. అంతియేకాని ఇంతవఱకు స్త్రీలెవ్వరును ఆస్థానికసంస్థల అధ్యక్షస్థానమునకు పోటీచేయుచుండుట వినబడలేదు. కాని నవంబరు 25-వ తేదీనాటి స్వరాజ్యపత్రికలో ఈవార్తకలదు: "సేలముజిల్లాబోర్డునందలి తిరుచంగోడుసర్కిలులో జిల్లాబోర్డుకు ఇరువురు సభ్యురాండ్రు ఎన్నుకొనబడిరి: శ్రీమతి రాధాబాయి (సుబ్బరాయనుసతి: కుమారమంగల ముజమీందారిణి) బి. యె (1917 ఓట్లు); శ్రీమతి చిన్నమ్మాళ్ (యల్. సెంగోతివేల

గాండరుపతి: గాండలపాలెము జమీందారిణి) (1978 ఓట్లు). ఇందు శ్రీమతి రాధాబాయి బి. ఏ. సేలముజిల్లాబోర్డు అధ్యక్షస్థానమునకు ఒకఅభ్యర్థిని." గతరౌండుటేబిలుసభకు ప్రతినిధురాలుగాపోయి తిరిగివచ్చుటలో శ్రీమతి రాధాబాయి గాలివిమానముపై వచ్చి ఆవిషయమున భారతస్త్రీలకు అగ్రేసరురాలైనది. ఇపు డీమె ఈఅధ్యక్షస్థానమును పొందగలుగుచో ఈవిషయమున భారతస్త్రీలకు అగ్రేసరురాలుకాగలదు.

ప్రభుత్వము వారి ప్రత్యుత్తరము నకు ఎదురు చూతము:—

తన రెండేండ్లబిడ్డతో ఈనడుమ వెల్లూరు చెరసాలనుండి విడుదలనొందిన ఏలూరు నివాసిని శ్రీమతి ముడుంబి వేంకటమ్మగారు వెల్లూరు స్త్రీలచెరసాల పరిస్థితులను నవంబరు 25 వ తేదీనాటి స్వరాజ్యపత్రికలో ఇట్లు వెల్లడించుచున్నారు: "వెల్లూరు స్త్రీలచెరసాలలో ప్రస్తుతము నలుబదిమంది సి క్లాసు స్త్రీఖైదీలు గలరు. అందు ఏ ఎనిమిదితొమ్మండుగురో తప్ప మిగిలిన స్త్రీలందరును ఆంధ్రులే. స్త్రీఖైదీలకు స్త్రీవార్డర్ల కాఠిన్యముచే కలుగు కష్టములు పెక్కు. ఖైదీలు స్నానము చేయబోవుసమయమున పంపులు కట్టివైతురు. ఉతుకుకొనుచున్న బట్టలను చేతులనుండి లాగివైతురు. సోదాచేయుచుంటిమను మిషతో గదులలోనిసామాను చిందరవందర చేయుదురు. వంటసాలనుండి ఖైదీబయటకు వచ్చుసమయమున బట్టవిప్పి తనిఖీచేయుదురు. ఇది తఱచు చేయుచుండ దానినిమాన్పించుటకుగాను మేము రెండుసారులు నిరశనవ్రతము నవలంబింపవలసిన వారమైతిమి. ఇప్పుడైనను ఈబట్టవిప్పి తనిఖీచేయు ఆచారము తిరిగి ఆచరణలోనికి కొనిరాకుందురని నేను నమ్మను." ఈవిషయములు చదివిన ప్రతివారును సంకటపడకమానరు. జయిలునందు అనుభవించివచ్చిన ఆమె చెప్పుటచే ఈవిషయములు పూర్తిగ అసత్యములనుకొనుటకు అవకాశములేదు. అయినను ప్రభుత్వమువారు ఈవిషయమై ఏమైన ప్రత్యుత్తర మిత్తురేమో ఎదురుచూతము. పైన పేర్కొనిన విషయములు నిజములేయైనచో అవి ఎంతత్వరలో నిర్మూలింపబడిన ప్రభుత్వము అంతటి ప్రజామోదమును బడయును.

కీ. శే. టంగుటూరి హనుమాయమ్మ గారు:—

ఆంధ్రనాయకులకునాయకులగు శ్రీటంగుటూరి ప్రకాశముపంతులుగారి సతి హనుమాయమ్మగారు గతమాసము 21-వ తేదీసాయంకాలము బెంగుళూరునందు కీర్తిశేషులైరని వినుటకు మిక్కిలి విచారించుచున్నాము. పంతులుగారికి హనుమాయమ్మగారు మేనకోడలు; మరణించునరికి ఈమెకు ఏబదినాలుగు సంవత్సరములు. ప్రకాశముపంతులుగారి జీవితము గొప్ప ఒడుదొడుకులను రుచిచూచినది. ఈ ఒడుదొడుకుల అన్నిటియందును శ్రీమతిగారు వారికి బాసటయైయుండిరి. భర్తతోగూడి ఈమె హిందూదేశమున, సింహళమున, స్ట్రెయిట్సుసెటిలుమెంటులయందును ప్రయాణము గావించినది. భర్తతోగూడి ఈమె

పెక్కు కాంగ్రెసుమహాసభలకు పోయిఉన్నది. గతలవణసత్యాగ్రహోద్యమమునందు- తన కుమారుడు స్ఫోటకముచే మంచముపట్టియున్నను- ఈమె పలుసభలకు అధ్యక్షురాలుగా నుండి దేశహితముకొఱకు పనిచేసినది. భాగ్యమునందును, దారిద్ర్యమునందును ఈమె భర్తకు బాసటయైఉన్నది. ఆంధ్రుని ఆంగ్లదిన పత్రికయగు 'స్వరాజ్య'కొఱకు ఈమె తన భర్తతోబాటు విశేషధనమును వెచ్చించినది. ప్రకాశముపంతులుగారి త్యాగదీక్షకు ఈమె ప్రోత్సాహశక్తియే కారణమనుట అతిశయోక్తిగాదు. ఆంధ్రసంఘసంస్కర్త వీరేశలింగము పంతులుగారికి వారిసతి రాజ్యలక్ష్మమ్మగారు తోడ్పడినట్లే ఆంధ్రనాయకకేసరి ప్రకాశము పంతులుగారికి వారిసతి హనుమాయమ్మగారు తోడ్పడిరి. ఈసాదృశ్యమింతతో ముగియుట లేదు. రాజ్యలక్ష్మమ్మగారును, హనుమాయమ్మగారును భర్తలకంటె ముందే దివికేగిరి. వారు పుణ్యాత్మలు గావున పుణ్యస్త్రీమరణము లభించినది. వారు ఉత్తమపత్నులు. శ్రీమతి హనుమాయమ్మగారి ఆత్మకు శాంతి చేకూరునుగాక!

కీ. శే. రా ధా దే వి :—

నాలుగు సంవత్సరములైనది దేశభక్తాగ్రేసరుడు, పంజాబుసింహము శ్రీలాలాలజపతిరాయి లాటీదెబ్బపోటుకు మరణించి. సరిగా అదే దినమున, అదేకాలమున నవంబరు17-వ తేదీని—నాలుగు సంవత్సరముల అనంతరము—ఆతనిభార్య రాధాదేవి కాసాథిక్యమున లాహోరునగరమున తమ స్వగృహమునందు మరణించినది. ఇప్పటి ఆమెవయస్సు అరువదినాలుగువత్సరములు. ఆధునికభారతత్రిమూర్తులగు పాల్, బాల్, లాల్ (విపినచంద్రపాల్, బాల్‌గంగాధరతిలక్, లాలాలజపతిరాయి) లందు తుదిఆతనిభార్యయై ఆమె దేశముకొఱకు విశేషత్యాగమును చేసియున్నది. ఆమెఆత్మకు శాంతిచేకూరుగాకయని భారతప్రజాసంఘము ఒక్కకంఠమున కోరుచున్నది.

భ ర్త ను మిం చి న భా ర్య :—

విమానయానమున ప్రపంచప్రఖ్యాతిగాంచిన శ్రీమతి ఎమిజాన్సను నామము గృహలక్ష్మి పాఠకులకు పరిచయమయియే ఉన్నది. ఆమె విమానచోదనపాండిత్యమునకు మెచ్చి జె. ఎ. మాలిసను ఆమెను వివాహమాడినాడు. ఆతడును విమానచోదనమున అందెవేసిన చేయియే. కావుననే వారివివాహము అనురూపమైనదని లోకులుపలికిరి. లండనునుండి ఆఫ్రికాయందలి కేపుటవునకు—6200 మైళ్ళు—ఆతడు నాలుగురోజులు 17 గంటల 22 నిమిషములో విమానముపై ప్రయాణించి చేరినాడు. అంత తక్కువకాలములో ఈవఱకెవరును ఆదూరమును అతిక్రమించలేదు. తానుమెచ్చి పెండ్లియాడినస్త్రీయే తనను ఇపుడు మించినది. లండనునుండి కేపుటవునకు ఆమె నాలుగురోజుల 6 గంటలు 53 నిమిషములలో విమానముపై ప్రయాణించి చేరినది. అనగా మగనికంటె 10 గంటలు ముందలకడ చేరినది. కేపుటవును చేరుటతోడనే ఆమెటెలిఫోనులో లండనునందలి తనభర్తను పలుకరించినది.

ఆతడామెను అభినందించి ఇట్టికాంతను భార్యనుగా బడసినందుకు తాను చాల గర్వించు చుంటినని చెప్పినాడు. ఈనాలుగు రోజుల విమానయానమున ఆమెకు అయిదుగంటల నిద్ర మాత్రము గలదు. 'నిద్రలేమిచే నీవుచాల అలసియుందువు. మఱియొకప్పుడు మాట్లాడు కొందుము' అని భర్తయనగా ఆమె 'నేనెంతమాత్రము అలయలేదు.' అని చెప్పినది. దాదాపు అయిదురోజుల ఆకాశప్రయాణము-అయిదుగంటలు మాత్రము నిద్రించినది-తాను అబల-అయినను అలయలేదట! స్త్రీశక్తికి ఇంతకంటె హెచ్చు నిదర్శనమేమి కావలయును?

**మదరాసు విశ్వవిద్యాలయము వారి స్వదేశాభిమానము:—**

ఈనడుమ మదరాసు విశ్వవిద్యాలయము వారు తమకు 120 రీముల విదేశపు తెల్లకాగితములు కావలయునని స్థానికదినపత్రికలో ప్రకటించిరి. అందుపై ఆల్ ఇండియన్ లీగు కార్యదర్శి బి. శివరావుగారు వారికి లేఖవ్రాసిరి. దానికి విశ్వవిద్యాలయమువారిచ్చిన ప్రత్యుత్తరము ఇది: "ఆ ప్రకటనయందు సూచింపబడిన కాగితము తమిళనిఘంటుముద్రణకు కావలసియున్నది. ఇంతవఱకది విదేశములందు చేయబడిన ఉత్తమజాతి తెల్లకాగితములపై ముద్రింపబడుచున్నది. ఇకముందు స్వదేశికాగితములను ఉపయోగించుటకు మాఅభ్యంతరములేదు. టెండరునోటీసులందు ఈ సూచనను గావించితిమి. దానికాపీ తమకొకటి ఇందుతో పంపుచున్నాము." అందరును చూచుప్రకటన అట్లున్నది. కొందఱు మాత్రమే చూచు టెండరునోటీసులో స్వదేశికాగితమైనను అభ్యంతరములేదని ఉండి ప్రయోజనములేదు. మేడిపండువాటపు ఈ స్వదేశాభిమానము విద్యాధికులకూడలియగు విశ్వవిద్యాలయమునకు గౌరవప్రదముకాదు. ఇకముందైనను విశ్వవిద్యాలయమువారు తమకువలయు సమస్తవస్తువులును స్వదేశపువేటిసి దేశకల్యాణమునకు తోడ్పడుదురుగాక!

**స్వదేశీని ప్రోత్సహింపుము:—**

నవంబరు 15-వ తేదీని లక్నోలో ఆమీనొద్దులా పార్కునందు స్వదేశవస్తుప్రదర్శమున. తెఱచుచు శ్రీమతి మోతీలాలునెహ్రూసతి అచ్చట కూడినవారిని అందు ముఖ్యముగ స్త్రీలను 'స్వదేశీనిప్రోత్సహింపుడు' అని హెచ్చరించినది. ఇట్టి హెచ్చరికలు ఇప్పుడు పరిపాటియైయున్నను ఆచరణమాత్రము ఆవంతయేనికానము. 'స్వదేశీనిప్రోత్సహింపుడు' అని ప్రతిస్త్రీల సభయందును తీర్మానములుకూడ చేయబడుచున్నవి. గతమాసమధ్యమున రాజమహేంద్రవరమున కూడిన ఆరవ ఆంధ్రరాష్ట్ర మహిళాసభలో ఇట్టితీర్మానమొక్కటి చేయబడినది. ఆస్వదేశీతీర్మానము చర్చింపబడుచుండినపుడే సభనొక్కసారి కలయజూచినవారికి అచ్చటకూడిన స్త్రీలలో మూడువంతులకు దాపుగా విదేశవస్త్రములు కట్టియుండుట కానవచ్చెను. ఆతీర్మానము ఎంత అర్థములేనిది! ఆచరణలో పెట్ట లేని ఇట్టితీర్మానములు చేయుటకంటె అవమానకరవిషయమేమియులేదు. స్త్రీలు మొటు

కువవహింతురుగాక! చేసిన తీర్మానములను ఆచరణలో పెట్టుటకును, ఆచరణలో పెట్టగల విషయములనుగూర్చి మాత్రమే తీర్మానించుటకును స్త్రీలు శ్రద్ధవహింపనగును.

**విలువ తెలిసినదిగాని హెచ్చించుటకు డబ్బు లేదు:—**

మధ్యమాగాణముల విద్యాశాఖమంత్రి నవంబరు 13-వ తేదిని నాగపురమున హైస్కు బాలికల ఉన్నత పాఠశాలాభవనమును తెఱచుచు ఇట్లుపలికినాడు: "మనరాష్ట్రమున స్త్రీవిద్యాపరిస్థితులు మిక్కిలి విషాదకరములుగా ఉన్నవి. ఈ నడుమ మనరాష్ట్రమున స్త్రీవిద్యాసంస్థలసంఖ్య 385 నుండి 479 కిని, విద్యార్థినుల సంఖ్య 41,000 నుండి 62,000 కును పెరిగినమాట వాస్తవమే. ఇది కొంతవఱకు సంతోషింపదగు విషయమగుటయు నిశ్చయమే కాని నాకు పూర్ణతృప్తి నిచ్చునదిగాలేదు. శారదాచట్టము విద్యార్థినుల సంఖ్యను పెంపొందించినదని నేను అంగీకరింతును. బాలురవిద్యకంటె బాలికలవిద్య నాలుగురెట్లు హెచ్చువిలువగలది. కాని బాలికల విద్యాసౌకర్యములను హెచ్చించుటకు ప్రభుత్వమువారి బొక్కసమున డబ్బులేదు." విద్యాశాఖ ప్రజాయత్తమైనను డబ్బులసంచి ప్రభుత్వమువారి పిడికిట ఉండినంతకాలము విద్యావిషయమున ఎట్టి అభివృద్ధియుగాంచ జాలమనుటకు ఈమంత్రివాక్యములు ప్రబలనిదర్శనము. ఖజానాపై అధికారములేని సంస్కరణములెన్ని పొందినను నిరుపయోగమే యను కాంగ్రెసు నాయకుల అభిప్రాయము ఎంతసత్యసమ్మతమైనదో దీనివలన తెలిసికొనవచ్చును.

**గృహలక్ష్మి పత్రిక నిచ్చినందుకు ఆరుమాసముల శిక్ష:—**

నవంబరు 28-వ తేదీనాటి స్వరాజ్యపత్రికలో అపత్రిక భీమవరమువిలేఖరి ఇట్లు వ్రాయుచున్నాడు: "శ్రీయుత శ్రీపాదన్న భగవన్నారాయణ, భీమవరములో వకీలు, గారికి భీమవరము తాలూకామేజిస్ట్రేటునుండి 23-వ తేదీని సమనులువచ్చినవి 24-వ తేదీని 11 గంటలకు కోర్టువారి ఎదుట హాజరు కావలయునని. 24-వ తేదీని కొంతసేపు కేసువిచారణజరిగిన పిమ్మట మఱునాటికి వాయిదావేయబడెను. 25-వ తేదీని అదితిరిగి 26-వ తేదీ 11 గంటలకు వాయిదావేయబడెను. ఆనాడు ప్రాసిక్యూషనుతరపున సాక్షులు విచారింపబడిరి. క్రిమినల్ అక్టు 42-వ సెక్షనుప్రకారము నిందితునిపై నేరముమోపబడెను. నేరము భీమవరము సబ్ జెయిలునందు విచారణ నిరీక్షించుచు ఉండిన కాంగ్రెసు వాలంటీర్లకు వీరు వార్డరు ద్వారా గృహలక్ష్మిమాసపత్రికను అందించుటయే. భగవన్నారాయణగారి పక్షమున శ్రీ డి. యల్. నరసింహముగారు వకీలుగానుండి ఈతరపు సాక్షులు ఒకరు నరసింహాపురమునందును, మఱియొకరు రాజమండ్రియందును ఉన్నారుగావున వారికి సమన్లుచేసి పిలిపించుటకుగాను కేసు అడ్జెరనుచేయవలసినదిగా పిటీషనుపెట్టిరి. ఆపిటీషను కొట్టివేయబడెను. కేసు విచారణ పూర్తిచేయబడి వెంటనే తీర్పుచెప్పబడెను. ఆరుమాసముల కఠినశిక్ష. రూ 200

జరిమానా. చెల్లింపనిచో ఆరువారముల అధికశిక్ష. సిక్లాసు ఈయబడెను. 26-వ తేదీ రైలులో వారు రాజమండ్రిజెయిలునకు గొనిపోబడిరి." ప్రిజనర్సుఆక్టునందలి నియమము లెట్టివైనను కేసువిచారణమాత్రము చాల తొందరగజరిగెను. డిఫెన్సుసాక్షులను రప్పించి విచారించుటకైనను అవకాశమీయబడలేదు. ఇట్టిరీతి తీర్పులచే బ్రిటీషున్యాయమునందు ప్రజలకు నమ్మకముపోవుట నిశ్చయము.

---



---

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివు ఆఫ్ న్యూస్

మచిలీపట్టణము: సి. వి. అవధాన్లు, ఇన్సూరెన్సుబీరో.

హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడ్డు,(మన ప్రాంతపు 1 రూఉస్మానియా గూ 1-3-0అగును)

నిడదవోలు: తాడిమేటి కుటుంబశాస్త్రిగారు.

కొవ్వూరు: జి. వి. రామరావుగారు.

రాజమండ్రి: ఏ. కృష్ణమూర్తి బ్రదర్స్, న్యూస్ఏజంట్స్.

తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు

బరంపురం: మారెళ్ల బ్రదర్స్.

గుంటూరు: వెల్ కం అండు కంపెని.

ఏలూరు: సనకా రాజారావుగారు, పవరుపేట.

అమలాపురం: కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం.

అనకాపల్లి. గ్రంధి కన్నయ్యపంతులు, గాంధిమార్కెటు.

విజయనగరం: కేసనపల్లి రామలింగంగారు, పొత్తూరివారి వీధి.

పిఠాపురం: యం. వి. ఎస్. రావుగారు, కేశవకుటీరం.

,, ఎం. నూకరాజు, ఆంధ్రన్యూస్ఏజన్సీ.

విశాఖపట్టణం: అందే కృష్ణమూర్తి బ్రదర్సు, బుక్ సెల్లర్సు.

జేమ్షెడ్పూరు. టి. వి. రమణయ్యగారు, 3 టిల్ జుగ రోడ్డు, న్యూ 'L' టౌను.

మదరాసు: వై. టి. ఎస్. నారాయణశాస్త్రిగారు, ప్రైప్రిటరు ఏజన్సీ. 364, ఎస్ప్లనేడు.

,, ఆకుండి వేంకటశాస్త్రిగారు.

తణుకు: నడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.

బెజవాడ: ఆంధ్రాఇన్డస్ట్రియల్ స్టోర్సు.

అనంతపురము: శ్రీగోపాలకృష్ణ అండ్ కంపెని, జనరల్ మర్చెంట్సు.

తిరుపతి: వై. వి. సుబ్బయ్యకంపెని, వెంకటేశనివాస్.

ఇతరచోట్లకు ఏజెంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి", తపాలపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

ఇదిగంటి అదిగంటి ఈశ్వరులగుడిగంటి నాలుగుమూలల నందినిగంటి నమమనపార్వతీదేవిపాదములుగంటి. ఒక్కపువ్వు పూజచేస్తిని, మహాదేవా! అంటే ముప్పున పొయ్యితడు ముకోకుండగా, చేతిగాజులు చెల్లకుండగా, కాలిమెట్టెలు కదలకుండగా, ప్రక్కపురుషుడు పాయకుండగా, చంకబిడ్డ జారకుండగావలెను. రెండుపువ్వులు పూజచేస్తిని, మహాదేవా! అంటే ధరణిదేవివంటి తలిదండ్రులు కలగవలెను. మూడుపువ్వులు పూజచేస్తిని, మహాదేవా! అంటే ముక్కంటికొలువు నేనే కొలువవలెను. నాలుగుపువ్వులు పూజచేస్తిని, మహాదేవా! అంటే ఆదిత్యపరమేశ్వరులవంటి అత్తమామలు కలగవలెను. ఐదుపువ్వులు పూజచేస్తిని, మహాదేవా! అంటే ఆరనిఐదువతనము కలుగవలెను. యేడుపువ్వులు పూజచేస్తిని, మహాదేవా! అంటే ఏక చక్రిమంతా నేనే యేలవలెను. ఎనిమిది పువ్వులు పూజ చేస్తిని, మహాదేవా! అంటే ఎనమండుగురు అన్నలతో నేనేపుట్టాలి. తొమ్మిది పువ్వులు పూజచేస్తిని, మహాదేవా! అంటే తరగని సిరిసంపదకలగాలి. పదిపువ్వులు పూజచేస్తిని, మహాదేవా! అంటే పదకొండుగురు అక్కలతోటి నేనే పుట్టవలెను. పండ్రెండుపువ్వులు పూజచేస్తిని, మహాదేవా! అంటే ముత్యాలగొడుగులనీడ కావాలి. పదమూడుపువ్వులు పూజచేస్తిని, మహాదేవా! అంటే పదుపువ్వులనోముపట్టిన పణతివచ్చింది. పట్టెమంగద్దవేసి, లోహాసనమున పీటవేసి, నాగస్వరాన కాళ్ళుకడిగి, పచ్చిపోకలు, పండుతెల్లనిఆకులు తాంబూలమిచ్చి అక్క మఱియేమివరముకోరినదో అడగ మనెను.

“కోరనేమి ఉన్నదయ్యా! వండ వట్టిఇల్లుగాగోరితి, మసల పెద్దఇల్లుగా గోరితిని.”

“మెచ్చితిని అక్కా!, ఇచ్చితినివరము, మఱియేమి గోరితివి, మహాశివభక్తురాలా!”

“సోమరాజులుగారి సోమిదేవమ్మగారి ఇంటిలో పెద్ద కోడలిగాపుట్టగోరితిని.” “మెచ్చితిని అక్కా! ఇచ్చితి వరము. మఱియేమిగోరితివి, మహాశివభక్తురాలా!”

“ముప్పదిమూడుపుట్లరాజనాలు, ముప్పందుముఉప్పు, ఎత్తెడు ఇంగువ, అరవై ఆరుకడవల ఆవకాయ, కావెడు

పెరుగు, ముంతెడునెయ్యి, చలిదిఅన్నములోకి చెల్ల గోరితిని, దేవరా!"

"మెచ్చితిని, అక్కా! ఇచ్చితివరము. మఱియేమికోరితివి, మహాశివభక్తురాలా!"

"అందానికి విష్ణుమూర్తి, ఆచారానికి సాంబమూర్తి, చక్కదనానికి సూర్యుడు, చలవదనానికి చంద్రుడు, వాక్కుకు సరస్వతి ఇటువంటి అయ్యను పెనిమిటిగాగోరితిని."

"మెచ్చితిని, అక్కా! ఇచ్చితివరము. మఱియేమి కోరితివి, మహాశివభక్తురాలా?"

"తొమ్మండుగురుకొమాళ్లనుగోరితిని. కొమాళ్లు అయినా ఎటువంటివారు అంటే పడమటను భారతము చదివేవాడు ఒక కుమారుడు. ఉత్తరాన్ని ఊళ్లు ఏలేవాడు ఒక కుమారుడు. దక్షిణంగా వెళ్లి అశ్వాలుతెచ్చి, అమ్మా! అశ్వదానము చేయమనేవాడు ఒకకుమారుడు. తూరుపు శాలలో గోవులుఉన్నవి, అమ్మా! గోదానంచేయమనేవాడు ఒకకుమారుడు. బంగారముతీసుకవచ్చి పళ్లెంలోపెట్టి అమ్మా! సువర్ణదానముచేయమనేవాడు ఒకకుమారుడు పట్టుచీరతెచ్చి పళ్లెములోపెట్టి, అమ్మా! వస్త్రదానము చేయమనేవాడు ఒకకుమారుడు. గజ్జెలవాడు ఒకకుమారుడు. మువ్వలవాడు ఒకకుమారుడు. ఆశీపాశీవచ్చి, అమ్మా! పాలు ఇమ్మనేవాడు ఒకకుమారుడు. ఇటువంటి కొమాళ్ళు తొమ్మండుగురు కొమాళ్ళగోరితిని."

"మెచ్చితిని, అక్కా! ఇచ్చితిని వరము. మఱియేమి కోరితివి, మహాశివభక్తురాలా!"

"కోరనేమున్నదయ్యా! ఇద్దరుకుమార్తెలగోరితిని. శ్రీలక్ష్మిదేవివంటిచిన్నది, శ్రీపార్వతిదేవివంటిచిన్నది."

"మెచ్చితిని,అక్కా!ఇచ్చితినివరము.మఱియేమికోరితివి."

"కోరనేమున్నదయ్యా! ఇద్దరు అల్లుళ్ళకోరితిని, అల్లుళ్లు అయినా ఎటువంటివారు అంటే విష్ణుమూర్తి వంటి అయ్యన, సాంబమూర్తి వంటి అయ్యన."

"మెచ్చితిని అక్కా! ఇచ్చితినివరము. మఱియేమికోరితివి, మహాశివభక్తురాలా!"

"కోరనేమున్నదయ్యా! శ్రీపార్వతీదేవిపాదాలదగ్గర చెలికత్తెగా ఉండగోరితిని."